ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# భాగవతకథ

## వింశతి భాగము

గ్రంథకర్త - శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి

అనువాదం - శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

# శ్రీ

# భాగవతకథ

## ( శ్రీ మద్భాగవత దర్శనము )

## వింశతి భాగము

హిందీ మూలము

శ్రీగంల ప్రభు దత్త బ్రహ్మచారి మహారాజు

ఆంధ్రానువాదకులు, శ్రీరామ శరణ్

శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

శ్రీ వేంకటేశ్వరార్ష భారతీ ధర్మసంస్థ

హైదరాబాదు.

# తొలిపలుకు

బ్రహ్మ సృష్టిలో మానవుఁ డుత్తమోత్తముఁడుగా పరిగణింపఁ బడుచున్నాఁడు. అందు కితర జీవజంతువులకు లేని జ్ఞాన మతని కుండుటయే కారణము. భగవంతుఁడు కరుణాళువై ప్రసాదించిన యీ జ్ఞానము సాహాయ్యమున మానవుఁడు తురీయ పురుషార్థమైన మోక్షమును బొందుటకు యత్నింప వలయును. అతఁడట్లు చేయనిచో నాహారభయ నిద్రాదులతోఁ గాలము పుచ్చుచుండు నితర జీవులకును అతనికిని ఆకారమున మాత్రమే భేదముండును. మోక్షప్రాప్తికి మన పూర్వులు మూఁడు మార్గములను నిర్దేశించి యుండిరి. అవి జ్ఞాన, కర్మ భక్తి మార్గములు. ఈ కలియుగమున వీనిలో మొదటి రెండు మార్గము లను అవలంబింపఁ జాలువా రరుదుగా నుందురు. ఇంక మూఁడవదైన భక్తి మార్గమును స్త్రీలనక, పురుషులనక, బాలురనక, వృద్ధులనక, పండితులనక, పామరులనక అందఱు ననుసరించి మోక్షసౌధమును జేరవచ్చును.

వేదార్థోపబృంహణార్థమై భగవంతుఁడగు కృష్ణద్వైపాయనుఁడు బ్రహ్మసూత్ర శ్రీ మద్భాగవతములతోపాటు పదునెనిమిది మహాపురాణ ములను ఉపపురాణములను కూడ రచించియుండెను. ఇవి కథోపాఖ్యాన పూర్వకముగా **వేదనిక్షిప్త**ములైన ధర్మ నీతితత్త్వములను జిజ్ఞాసువు లంద ఱికిని సుబోధ మొనరించును. పదునెనిమిది పురాణములలో భాగవత మొకటి. ఇది శ్రీమద్భాగవతమా, దేవీ భాగవతమా. అను విషయమున పండితులలో వివాదమున్నది. కాని పలువురది శ్రీ మద్భాగవతమేయని

భావించుచున్నారు. ఇది యెంత మనోహరమో, భాషాభావము లందంత క్లిష్టమైనది. అందుచేతనే "విద్యావతాం భాగవతే పరీక్షా" అను నానుడి యేర్పడుటయు, పోతరాజు "భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలి కైనఁ దమ్మిచూలికైన" నని చెప్పుటయు సంభవించినది. "భగవతః ఇదమ్" (భగవంతునికి సంబంధించునది) అని భాగవత శబ్దమునకు వ్యుత్పత్తి. ఇందు భగవన్మాహాత్మ్య బోధకములైన విషయములు కథలు అనేకములుండును.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశాను చరితము అను పంచలక్షణములు పురాణమునందుండును. శ్రీ మద్భాగ వతము పురాణమగుటచే నిందా పంచలక్షణములును కలవు. వీనితో పాటిందు శ్రీమన్నారాయణునికి సంబంధించిన ఏక వింశత్యవతారము లును (21) వర్ణింపఁబడియున్నవి. "యదాయదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత" "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే" అని శ్రీ మద్భా గవద్గీతలో భగవంతుఁడు చెప్పినట్లాతఁడు ధర్మ సంస్థాపనము కొఱకును, సాధురక్షణ, దుష్టశిక్షణముల కొఱకును భూమిపై నవతరించుచుండును. ఆ యవతారముల విషయమే శ్రీమద్భాగవతము నందు ప్రపంచింపఁబడి నది. మత్స్యకూర్మాద్యవతారములన్నియు నవతార ప్రయోజనములను నిర్వహించినమాట వాస్తవమేయైనను "కృష్ణస్తు భగవాన్ స్వయ" మ్మను సూక్తి ననుసరించి యిందు దశమస్కంధమున శ్రీ కృష్ణుని జన్మాది వృత్తాంతములు విపుల తరముగా వివరింపఁబడినవి. భాగవత తారహార మునకు దశమస్కంధము తరళ ప్రాయము.

III

శ్రీ మద్భాగవతమున కర్మజ్ఞాన విషయములు కూడ ప్రతిపాదింపఁబడినను భక్తికే అందు ప్రాధాన్యము. మోక్షప్రాప్తి కదియే పరమసాధనమని యది బోధించును. అందలి కథోపాఖ్యానములన్నియు భక్తిమహత్త్వ ప్రతిపాదనము నందే పర్యవసించును. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు కూడ భక్తిని నిరసింప లేదనుటకు "మోక్ష సాధన సామగ్ర్యాం · భక్తిరేవ గరీయసీ" అని వివేకచూడామణిలో చెప్పియుండుట నిదర్శనము. సత్యముకూడనంతే. కలియుగము నందలి జనులు కర్మజ్ఞాన మార్గముల నవలంబింపఁజాలని వారగుటచే భక్తినే ఆశ్రయింపవలయును. సంసార సాగరతరణమున భక్తియే నిరపాయమైన నౌక. వ్యాసభగవానుఁడు భాగవతము నిగమ కల్ప తరువు నుండి జాఱిన ఫలమని చెప్పియుండెను. అది కల్పతరువువలె భక్తులకు సర్వాభీష్టములను సిద్ధింపఁజేయును.

వ్యాసుఁడు సంస్కృతమున రచించిన శ్రీ మద్భాగవతమును మహాభక్తుఁడును, కవిపుంగవుఁడునైన బమ్మెర పోతరాజు గద్య పద్యాత్మకముగా తెలుఁగున కనువదించెను. ఆతఁడు రచించిన భాగవతము నందలి కొన్ని భాగము లేకారణము చేతనో శిథిలమగుటచే వాని నతని మిత్రులో శిష్యులోయైన గంగన, సింగన, నారయ యను వారు పూరించిరి. అయినను తెలుఁగున భాగవతము మాట విన్నంతనే పోతరాజే తలంపునకు వచ్చును. ఆంధ్ర దేశమున నతని భాగవతమున కున్నంత ప్రచారము మఱే గ్రంథమునకును లేదనుటలో నతిశయోక్తి లేదు. అందుకతని పద్యములందలి ధారాశుద్ధియు నానృతో దృశ్యమైన మాధుర్యమును కారణములు. అందలి పద్యము లొండో, రెండో

నోటికి రాని అక్షరాస్యుఁడు మొన్నమొన్నటి వఱకు ఆంధ్ర దేశమున నుండెడివాఁడుకాదు. కాలవైపరీత్యముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొనరించుకొనువారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కువైనది. పోతరాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీకరించియుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతఁడు పెంపొందించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొనఁ గలవా రిప్పుడెందరో యుండరు. అందుచే సంస్కృత భాగవతమునకు రెండు మూడు వచనానువాదములు కూడ వెలసినవి. భాగవతమువంటి ఉత్తమ గ్రంథమెంత అధికముగా ప్రచారము పొందిన లోకమున కంత మేలు కలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్తశిఖామణులునైన శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు జగద్ధితార్థమై శ్రీ భాగవతము నందలి విషయములను కథాదృష్టాంతానుభవపూర్వకముగా సరళసుందరమైన హిందీభాషలో నలువది సంపుటములుగా వచన రూపమున రచించి యుండిరి. అది హిందీ భాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనర్సయ్య గురుపుంగవులు సర్వసుబోధమైన భాషలో తెలిఁగించి యుండిరి. భక్తిప్రధానమైన శ్రీ మద్భాగవతమును భక్తవరేణ్యుఁడైన పోతరాజాంధ్రీకరించుటవలన నాంధ్రలోకమున కెంత మహోపకారము జరిగినదో భక్తచూడామణులైన శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి గారి హిందీ గ్రంథమును భక్తిసముద్రులైన శ్రీ కుందుర్తి గురుపుంగవు లాంధ్రీకరించుట వలన నంతమహోపకారము జరిగినది. ఆ గ్రంథమునకు శ్రీ మద్భాగవతదర్శనమను పేరు

సార్థకము. అది రెండుసార్లు ముద్రితమైనది. కాని ప్రతులిప్పుడు లభ్యములగుటలేదు అది చూచి నిత్యధర్మకార్యపరాయణులును వదాన్య శేఖరులునైన భక్తులొకరా సంపుటములను పునర్ముద్రించుట వలన లోకమునకు మేలు కలుగునని అందుకు సంకల్పించిరి. వారు సిద్ధ సంక ల్పులు. వారి సంకల్ప బీజము వృక్షమై యిప్పుడీ గ్రంథముల రూపమున ఫలించినది. ఆంధ్రులా ఫలమును ఆస్వాదించి ఆనందపారవశ్యము పొందుదు రనుటలో సందేహము లేదు.

ఆ భక్తులే శ్రీ వేంకటేశ్వరార్షధర్మ భారతీధర్మ సంస్థను స్థాపించి దాని పక్షమున అష్టాదశ మహా పురాణములను తెలుగు లిపిలో తాత్పర్య సహితముగ ముద్రించి ఆంధ్రులకు మహోపకారము చేయుచున్నారు. ఈ భాగవతకథా సంపుటములు కూడ, శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ధర్మ సంస్థ పక్షముననే ముద్రింపబడుచున్నవి.

శ్రీ వేంకటేశ నామ్నా
భారత సంస్కృతి ప్రవర్ధనార్థాయ
సంస్థాపితేయం ధర్మ
సంస్థార్షా జయతు భగవతః కృపయా,

—దివాకర్ల వేంకటావధాని

నిగమకల్పతరో ర్గళితం ఫలం
శుకముఖాదమృతద్రవ సంయుతం
పిబత భాగవతం రస మాలయం
ముహురహో రసికా భువి భావుకాః

—సంస్కృత భాగవతము

లలితస్కంధము కృష్ణ మూలము శుకా
లాపాభిరామమ్ము మం
జులతాశోభితమున్ సువర్ణ సుమన
స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తమ్ము మహాఫలమ్ము విమల
వ్యాసాలవాలమ్మునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వు
ర్విన్ సద్విజశ్రేయమై

—శ్రీ మదాంధ్ర మహాభాగవతము



# విషయ సూచిక

....o....

# భాగవతకథ

## ప్రహ్లాదుఁడు

### మొదటి భాగము

### భగవంతునిలో విషమతయేల?

శ్లో॥ సమః ప్రియః సుహృద్బ్రహ్మన్ భూతానాం భగవాన్
స్వయమ్।
ఇన్ద్రస్యార్థే కథం దైత్యానవధీ ద్విషమో యథా॥
---శ్రీ భాగ. ౭ స్కం ౧ అ. ౧ శ్లో.

సీ. సర్వభూతములకు సముఁడు నెచ్చెలి ప్రియుం
డైన వైకుంఠుఁడనంతుఁడాద్యుఁ
డింద్రుని కొరకు దైత్యేంద్రుల నేటికి
విషమునికైవడి వెదకి చంపె ?
--శ్రీ మదాంధ్ర భాగవతము,

వేదశాస్త్రములందు విశ్వాసముంచకపోవుటయే నాస్తిక
తకు లక్షణము, వేదశాస్త్రవచనములను సత్యములని భావించి,
వాని యాధారమునఁ బరస్పరవిరుద్ధముగఁదోచు వచనములను

సమన్వయ పఱచుకొనుట, మీమాంసచేయుటకే ఆస్తికదర్శన మని పేరు, భగవానుఁడేదిచేసిన మంచియే చేయునని విశ్వసింప వలయును. కాని యేదైన విరోధవాక్యములు కనఁబడినచో శ్రద్ధాపూర్వకముగ నా విషయమున శంక చేయుట దోషము కాదు. శంకయే లేనివాఁడు చాల అదృష్టవంతుఁడు; కాని శంక కలిగినచో నట్టివారు మహత్పురుషుల కడకుఁబోయి సమాధాన పరచుకొనవలయును, పరీక్షిన్మహారాజుకూడ యిట్టి శంకనే శాస్త్రీయమైన దానినిఁ గావించెను.

సూతుఁడిట్లనెను :- "మునులారా : దక్షుని అఱువది మంది కన్యకల వంశచరిత్రము పూర్తికాగానే, పరీక్షిన్మహారాజు కథాతంతువును తెగనీయకుండుటకునై ఒకానొక శంకను జేసెను. మహారాజు శుకునినిట్లు ప్రశ్నించెను:-

"ప్రభూ : నేను మీ ముఖమున నత్యంత సుందరమగు విదుర మైత్రేయ సంవాదమును వినియుంటిని, ఈ ప్రసంగ మున హిరణ్యాక్షవధ, దేవాసురసంగ్రామము, వృత్రవధ, దక్షప్రజాపతి పుత్రికల వంశవర్ణనమును, దేవతలయొక్కయు దైత్యులయొక్కయుత్పత్తియు, మరుద్గణ చరిత్రమును వింటిని. వీనియందు భగవంతునకు దేవతలయందు పక్షపాత ముకలదని తెలిసికొంటిని. ఆతఁడమరులు కోరఁగనే అసురు లను సంహరించుచుండును, దేవతాపక్షమును వహించి దైత్యు లను జంపుచుండును. స్వయముగఁదాను గరుడునిపై నెక్కి యింద్రునితోఁగూడి అసురులతో యుద్ధమునుజేసి వారినోడించు

చుండును. భగవంతుఁడిట్లు చేయుటెందులకు? భగవంతుఁడు సమదర్శి, అతనికి దేవతలెంతో దైత్యులు నంతే.

మానవుఁడు పరపక్షమును రెండే కారణములచేఁగైకొనును. ఒకనియెడల రాగమున్నను, రెండవవానియెడల ద్వేషమున్నను; లేక యేదైన లోభమున్నను నట్లుజరుగును. భగవంతునిదృష్టిలోఁ బ్రాణులందఱు నొక్కటియే. అందఱును నాతని సంతానమే. అతనికి దేవతలయెడల నేవిధమగు రాగముగాని, దైత్యులయెడల నేవిధమగు ద్వేషముగాని లేదు. ఇప్పుడిక మిగిలినది లోభము. అప్రాప్యవస్తువు ప్రాప్తింపవలసియుండుటచే లోభము కలుగును. భగవంతున కప్రాప్యమగు వస్తువే లేదు. బ్రహ్మాదిదేవతలుకూడ ఆతఁడొసంగిన విభూతినే ఉపభోగించుచున్నారు. ఆతఁడొసంగిన కణమాత్రైశ్వర్యమువలననే వారైశ్వర్యశాలులైనారు. ఆతఁడు సాక్షాత్తుగఁగళ్యాణస్వరూపుఁడే. కావున దీనినిబట్టి భగవంతుఁడెదో లోభముచే దేవతాపక్షమును వహించెననుటయును సంభవింపదు. అట్టియెడనాతఁడిట్టి విషమవ్యవహారము నేల చేయును? ఈ విషయములో నాకు మిక్కిలి సందేహముకలదు స్వామీ! మీరు సర్వజ్ఞులు సర్వమును దెలిసినవారు. నా యీ శంకకు సమాధానము నొసంగుఁడు."

సూతుఁడిట్లనెను :- 'మునులారా! పరీక్షన్మహారాజు యొక్క యీ శంకను విని శ్రీ శుకదేవుఁడు క్రుద్ధుఁడు కాలేదు. ఆతఁడవనీపతిని గద్దించి యిట్లనలేదు. "నీవు గొప్ప నాస్తికు

దవు. భగవంతుని విషయములో శంకించెదవా? అని ఆతని శంక అసంగతమన లేదు సరిగదా ఆతఁడు రాజు యొక్క ప్రశ్నను ప్రశంసించెను. ఈ మాటను వినఁగానే ఆతని రోమ రోమము నిక్కపొడిచి రాజును ప్రశంసించుచు నిట్లనెను. "మహారాజా! నీవు చక్కని ప్రశ్నను వైచితివి. ఈ శంకకు శ్రీహరియొక్క విచిత్ర చరిత్రములకు సంబంధము కలదు. దీనికి సమాధాన మొసంగుచు నేను నీకు పరమ భాగవతోత్త ముఁడగు శ్రీ ప్రహ్లాదుని చరిత్రమును జెప్పెదను. భగవంతుఁడ సురులను ద్వేషించునంటివి. అయితే ప్రహ్లాదుఁడును నసురుఁడే. ఆతఁడు ప్రపంచములో సర్వశ్రేష్ఠుఁడగనెన్నఁబడు చున్నాఁడు. పరమ భాగవతులగు భగవద్భక్తులను జెప్పవలసి వచ్చినపుడు ముందుగాఁ ప్రహ్లాదుని పేరును జెప్పుచుందురు. ఆతని యశః కీర్తులను నసురులు కీర్తించుటయే కాదు, గొప్ప గొప్ప నారదాది మహర్షులును నట్లే చేయుచుందురు. మా తండ్రియగు కృష్ణ ద్వైపాయనుని వలన నీ భక్తివివర్ధకమగు నీ కథను వింటిని. కావున నాతని పాదపద్మములకుఁ ప్రణామము కావించి నేనా కథను ప్రారంభించెదను. ఇప్పుడు ముందుగా నేను మీ శంకకు సంక్షేపముగ సమాధానము చెప్పి తరువాత మహా భాగవతుఁడగు ప్రహ్లాదుని పరమ పావన చరిత్రమును జెప్పెదను.

ఈ ప్రపంచమున నున్న దంతయును భగవద్విలాసము నకే. భగవంతుని సత్తావలననే యీ ప్రపంచపు సత్తాయున్నది.

దీనిలో నుండి భగవంతునిఁ దీసివైచినచో నిఁక మిగులు నదేమియు నుండదు. అరఁటి చెట్టునకుఁగల పొత్తులను వరుసగాఁ దీసివైచినచో నిఁక మిగులునదేమియునుండదు. పెద్దఉల్లిపాయ పొరలును నొక్కొకటి దీసివైచినచో నిఁక నుల్లిపాయయే యుండదు. ఇదే విధముగ భగవంతుఁడు నిర్గుణుఁడుఁ అజన్ముఁడు, అవ్యక్తుడు, ప్రకృతికతీతుఁడు. అయినను దాను, మాయ నాశ్రయించి విచిత్ర రూపములను ధరించి బాధ్య బాధక భావమును బొందెను.

తానే ప్రపంచమైనాఁడు, తానే దానినిఁ బ్రకాశింపఁజేయుచున్నాఁడు, సూర్యుఁడక్షులలో నుండి జ్యోతిప్రధానముకావించుచుండును. చక్షువున కధిష్ఠాన దేవతయగు సూర్యుఁడు లేకున్నచోఁ గన్నులున్నను గనఁబడదు. కన్నులలో నధిష్టాతృ రూపముననున్నాఁడు. బయట ప్రకాశరూపమున నున్నాడు. కన్నులున్నను బహిఃప్రకాశము లేకున్నచోఁ గన్నులున్నను గనఁజాలవు. ఇదే విధముగ బ్రకాశ్య ప్రకాశక స్వరూపమాయనయే. ఆత్మ నిర్గుణమైనది. సత్వ, రజ, స్తమోగుణము లాత్మగుణములు కావు. ప్రకృతి గుణములు, భగవంతుఁడు భగవన్మాయనాశ్రయించి ప్రకృతిగుణములలో విహార మొనర్చుటను గాంచునెడల నీ గుణములందు న్యూనాధికతలు గోచరించుచుండును. సామ్యమందు సృష్టిలేదు. ఈ మూఁడు గుణములును సామ్యావస్థలో నున్నచోఁ బ్రకృతి అదియేయుండును. కాని అదియేమియును జేయఁజాలదు. గుణములలో విషమతయుండెనా సంసార చక్రము తిరుగును.

ఏదో ఒక గుణమధికముగను నొక గుణము తక్కువగను నుండవలయును."

అంత మహారాజిట్లడిగెను:- "ప్రభూ! ఎప్పుడేగుణము ప్రాబల్యమును జెందును. ఏ గుణము న్యూనతను జెందును?"

ఇది విని శుకుఁడిట్లనెను:- "ఈ గుణములయొక్క వృద్ధిక్షయముల వలననే కృత, త్రేతా, ద్వాపర, కలియుగాది కల్పన యేర్పడినది. కాని యీ యన్నింటిలో భగవదేచ్ఛ ప్రధానమైనది. ఆతని యిచ్ఛ యిట్టిదని పలుకుట కాతని క్రీడయేప్రధానము. ఒక్కొక్కప్పుడు సత్వమువృద్ధినిఁ జెందిన రజస్తమము లణఁగిపోవును. ఒక్కొక్కప్పుడు రజస్సు వృద్ధినిఁబొందుచో సత్వతమములు న్యూనతను వహించును. ఒక్కొక్కప్పుడు తమస్సు వృద్ధినిఁబొందినప్పుడు సత్వరజస్సులు దుర్బలములగును. మూఁడును నొక్కసారిగా వృద్ధినిఁ బొందవు. ఒక్కసారిగా క్షీణింపవు."

అంతఁ బరీక్షన్మహారాజిట్లడిగెను :- "స్వామీ! ఫలాని సమయమున సత్వము వృద్ధినిఁ బొందిన దనియు, రజోగుణ ప్రాబల్యము కలిగినదనియు, తమోగుణమునకుఁ బ్రాధాన్యము కలిగిన దనియు నెట్లు తెలిసికొనఁగలము?"

అంత శుకదేవుడు ప్రత్యుత్తర మొసంగెను :- "రాజా! భగవంతుఁడు సత్వగుణమును వృద్ధిచేయవలసి వచ్చినప్పుడు భగవంతుఁడు తన విశేషశక్తిచే దేవతా, ముని, ఋష్యాది సత్వగుణ ప్రధానులగుఁ బ్రాహ్మణులలోఁ బ్రవేశించును. అప్పుడు

సర్వత్ర సత్వగుణులమాట సాగుచుండును. యజ్ఞయాగాదులు, జ్ఞానసత్రములు, సత్సంగ కథావార్తాదులు వృద్ధియగును. భగవానుఁడు రజోగుణవృద్ధినిఁ జేయఁదలచినప్పుడు, అసురుల ప్రాబల్య మెక్కువగును. దేవతలు నిర్బలులగుదురు. చివరకు నారదాది పరమ మునులుకూడ ఆ యసురుల సంకేతమునఁ బోవుచుండవలయును. వారు త్రైలోక్యాధిపత్యమును వహింతురు. సర్వత్ర దెబ్బలాటలు, యుద్ధములు జరుగును. ప్రాణులందఱును గర్మములందత్యంతాసక్తిని గలిగియుందురు. అప్పుడు చిత్తములు చంచలములగుచుండును. హిరణ్యాక్ష హిరణ్యకశిపుల కాలములో నెట్లుండెనో అట్లుండును. ఆతరువాత దమోగుణ వృద్ధిని గావించుటయే ఆతని కభీష్టమగుచో యక్ష రాక్షసులకు వృద్ధికలుగును. వారత్యంత నిద్రాళువులు, మహా ప్రమాదులు, విషయలంపటులుగనుందురు. అధర్మమునే ధర్మముగ భావించుచుందురు. ఆ సమయమున రుషి, ముని, దేవ, గంధర్వాదుల బలము క్షీణమగును. అందఱును రాక్షసాధీనము కావలసినదే. ఆత్మ యీమూఁడు గుణములకు వేఱుగనున్నది."

అంతఁబరీక్షిన్మహారాజిట్లనెను:- "ఆత్మ వేఱుగనున్నచో దానిప్రతీతి యుండవలయునుగదా! మనకు భిన్నభిన్న దేహములందు భిన్న భిన్నాకృతులు, భిన్న భిన్న నామములతోఁగనఁబడుచున్నవి. అందువలన మేము దేహమునే ఆత్మగ భావించుచున్నాము."

అంత నవ్వి శుక దేవుఁడిట్లనెను:- "మహారాజా! శరీర మాత్మకాదు. ఆత్మఒక్కటే. శరీరములు చాలగలవు. శరీర మేక దేశీయమైనది. ఆత్మ సర్వవ్యాపకమైనది. మంచిది, నీవగ్నినిఁ జూచితివా ?"

మహారాజిట్లనెను :- "అవును స్వామీ ! ఎందులకుఁ జూడలేదు ? ఒక్కొక్కచోట అగ్ని గుండ్రని కణికలుండును. ఒక్కొకచో వంకరగనుండును, మఱియొకచోట లావుగనుండును. మఱికొన్నిచోట్లఁ జాలగను. కొన్ని చోట్ల కొద్దిగనునుండును."

ఇది విని శుక దేవుఁడిట్లనెను :- "రాజా ! నీవుచూచు వంకర టింకర, చిన్న పెద్ద మొదలగు నాకృతులు అగ్నికాదు. అగ్ని అరూపమైనది. తేజోమయమైనది. దానికి రూపమేమియు నులేదు. ఏ యాశ్రయమున బ్రకటమగునో అట్లే కనఁబడును. ఇనుపగుండులో గుండ్రగఁగనఁబడును. అది శాంతింపఁగానే అగ్ని నాశముకాదు. వ్యష్టి అగ్నిశక్తి సమిష్టి అగ్నిలోఁగలిసి పోయినది. కలిసిపోయినదని చెప్పుటయు సరిగాదు. ఆకాశము సర్వవ్యాపకమైనది. ఘట, మఠాదులన్నిటిలో నాకాశముకలదు. ఘటము నాశముకాఁగానే ఘటములోని ఆకాశము సర్వగతాకాశమునఁ గలిసిపోయినది. అనఁగా దానిలో ఘటసంబంధముచే వ్యవధానముగఁ గనఁబడుచున్నది యిప్పుడులేదు. కాణాదులు లేక మీ కగ్నిలభింపదు. అగ్నినిఁ బ్రకటమొనర్చుటకేదైన నాశ్రయము కావలయును. ఇదే విధముగ భిన్న భిన్న దేహ

ములందు భిన్న భిన్న రూపములతో నాత్మజ్యోతి ప్రకాశించుచు న్నది. కావున దేహాదులు లేక అది దొరకదు. మూర్ఖులు కాష్ఠ లోహాది అగ్నిప్రకాశక వస్తువులందున్న దానినే అగ్నియను కొనునట్లు, అవివేకు లీ దేహములనే ఆత్మలుగ భావించు చుందురు. కాని మనీషులు, ఆత్మ కాలరహితమైనది యనియు, ఆత్మ స్వభావరహితమైనదనియు, ఆత్మ కర్మరహితమైనదని యుసను నీ వాదములను నిరసించుచుఁ జివరకు తమ యంతః కరణములోనే అంతరాత్మ రూపమునఁ బ్రాప్తించెదరు. వారే ఆత్మ జ్ఞానులు, జీవన్ముక్తులు, భగవద్భక్తులని పిలువఁబడుదురు.

పరీక్షన్మహారాజిట్లనెను :- స్వామీ ! నాకొక శంక కలదు. అదేమనఁగా - భగవంతుఁడు పూర్ణకాముఁడై, ఆతని కేమియును గోరికలేనప్పుడు, ఆకాంక్ష లేనప్పుడు, ఆతఁడు కాలకర్మ, స్వభావములందు విభిన్నతను గావించి, యీ దృశ్య ప్రపంచమందేల ప్రవిష్టుఁడగు చున్నాఁడు ?"

అంత నతిశీఘ్రముగ శ్రీశుకుఁడిట్లనెను :- "రాజా ! ఆతఁడెచ్చట ప్రవిష్టుఁడగు చున్నాఁడు ? ప్రవిష్టుఁడైనట్లు కన బడుచున్నాఁడు. ఆతఁడు లేకున్న దేనికిని సత్తాలేదు. జీవుల యొక్క అనంతకాలీన అదృష్టము కారణముగా భగవంతుఁడు తనమాయను గర్మఫలముల ననుభవింపజేయుటకై ప్రేరేపిం చును. ఆతఁడు నిద్రించి నిద్రించి విసుగుఁజెందినపుడు కొంత

వినోదము నొనర్పఁదలఁచె ననుఁడు. నిత్యపూర్ణకామునకు విసుగు జనించుట, వినోద మొనర్చుట యివియును నుపలక్షణ మాత్రములే. ఈ శబ్దమునందీభావములు విలక్షణములుగఁ గనఁబడును ఆతఁడు భిన్నభిన్న శరీరములను రచించును. శరీర రచనముకొఱకు రజోగుణమును వేఱుగ నుత్పన్నము కావించును. ఆతఁడు బ్రహ్మయని పిలువఁబడును, ఆతఁడు నానావిధముల సృష్టినిఁ గావించును. జరిగిన సృష్టినిఁ బాలించుచు వానిలో రమించుటకై ఆతఁడు సత్వగుణసృష్టినొనర్చి విష్ణురూపమునఁ బ్రకటమగును. మనువు - మనుపుత్రులు, ఇంద్రుఁడు దేవతలు, సప్తర్షులు, మన్వంతరావతారములు ఈ విధముగ రూపములుగ విభక్తమై వివిధక్రీడలొనర్చును. రక్షించును. సంహారేచ్ఛ కలిగినపుడు తన తమోగుణమూర్తియగు రుద్రదేవుని బ్రేరేపించును. ఆతఁడు సమస్త సృష్టిని సంహరించును. ఈ క్రీడయే ప్రవాహరూపమున నడుచుచుండును. భగవంతుఁడు కాలమున కధీనుఁడు కాఁడు. కాలమే భగవంతున కధీనమైయుండును. ఆతఁడు కాలమునకుగూడా కాలుఁడు. ఈ కాలదేవుఁడు జగత్తునకు నిమిత్త భూతులగు ప్రకృతి పురుషులకు సహకారియు నాశ్రయమైయున్నాఁడు. కావున సత్వగుణ కాలము వచ్చినపుడు భగవంతుఁడు దేవతాపక్షమును వహించి అసురులతోఁ బోరాడును. అసురులఁ బరాజితుల గావించును

రజోగుణకాలము వచ్చినపుడు దేవతలతోఁజెప్పకయే క్షీరసాగరమున ముసుఁగుఁబెట్టుకొని పరుండును. లక్ష్మీదేవి పాదము నొత్తును. అప్పుడు దేవతలు మొత్తుకొనుచున్నను బలుకఁడు. వారి నసురులు నిర్జించి స్వర్గమునందధికారమును వహించెదరు. ఛాజా! ఈ విధముగ గుణప్రవాహము నడుచు చుండును. భగవంతున కెవరితోడను రాగముగాని ద్వేషముగాని లేదు. సత్వగుణాభివృద్ధి కాలమున సత్వప్రధానులగు నమర సమాజమును వృద్ధిపొందించుటకై అసురులను సంహరించుచున్నట్లు కనఁబడును. వాస్తవముగఁ జూచినచో నాతనికి సురాసుర యక్ష రాక్షస తిర్యఙ్మనుష్యాది సమస్త ప్రాణులు సమానమే. ఈ విషయమున నేను నీకొక ప్రాచీనమైన ఉపాఖ్యానమును వినిపించెదను. దానిని వినుటచే నీ శంకకు సమాధానము రాఁగలదు."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఇట్లు చెప్పి మాగురుదేవుఁడు పరీక్షన్మహారాజునకు యుధిష్ఠిర నారద సంవాదమును జెప్పుటకుద్యుక్తుడయ్యెను."

....)o(....

# భగవానుఁడు నిర్గుణుఁడు, నిర్లేపుఁడు

శ్లో॥ నిందన స్తవ సత్కార న్యక్కారార్థం కలేవరమ్ ।
ప్రధాన పరయో రాజన్నవివేకేన కల్పితమ్ ॥
హింసా తదభిమానేన దండపారుష్య యోర్యథా ।
వైషమ్యమిహ భూతానాం మమాహమితి పార్థివ ॥
--శ్రీభాగ, 2 స్కం, ౧౦అ, ౨౨, ౨౩ శ్లో॥

"వ. ధర్మనందనునకు నారదుండిట్లనియె :- దూషణ భూషణ తిరస్కారంబులు శరీరంబునకుంగాని పరమాత్మకు లేవు. శరీరాభిమానంబునంజేసి దండవాక్పారుష్యంబులు హింసయై తోఁచు తెఱంగున నేనునాయది యనియెడు వైషమ్యంబును భూతంబులకు శరీరంబునందు సంభవించు"....

....శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రపంచములో నందరును నున్నతిని గోరుకొందురు; కాని యీ శరీరంబును వదలి వృద్ధిలోనికిఁబోఁగోరరు. బ్రాహ్మణుఁడు కావలయుననుకొన్నను, దివ్యత్వమును బొందఁదలఁచినను నీ శరీరము తోడనే పొందఁదలఁతును. కాని దీనిని వదలరు. తాను ధనికుఁడు, మాన్యుఁడు, యశస్వి, ప్రతిష్ఠితుఁడు, పూజితుఁడు సత్కృతుఁడు, పవిత్రుఁడు, జ్ఞాని, ధ్యాని యివన్నియు నీ శరీరముతోడనే కావలయును. ఈ భావములో

రెండు విషయములు కలవు. ఒకటి గొప్పవారు కావలయునను కోరికయు, రెండవది శరీరమునందు మమత్వము గొప్ప కావలయునను కోరిక ఆత్మగుణము. ఏలననగా నాత్మకుమించిన దేదియునులేదు. శరీరముమీద మమత్వము కలిగియుండుట అజ్ఞాన చిహ్నము. శరీరమందు మమత్మమే పోయినచో జీవుడు శివస్వరూపుడే. ఆతడు బద్ధుడుకాడు. చిన్నవాడు కాడు. జీవన్ముక్తుడు. గొప్పవారిలో గొప్పవాడు. మనము విషయములకు దాసులమైనంత వఱకును, అనిత్యమును, నశ్వరమునగు శరీరమును దానేయని భావించు వఱకు మనము దుఃఖితులము, అశాంతులము. విషయదాసులముగాక హరిదాసుల మైనచో, నిత్య శాశ్వత సౌందర్య మాధుర్య నిధానుడగు శ్రీమన్నారాయణుని దనవానిగా నెన్నుచో ధుఃఖమను మాటయేలేదు. ఆనందసాగరములో మునిగి తేలుచుండును. ప్రకృతి గుణములను మన వివేకముచే మనయందారోపించు కొనుచున్నాము.

శ్రీ శుకదేవుడిట్లనెను :- రాజా ! యుధిష్ఠిర మహారాజు రాజసూయ యాగమొనర్చినపుడాతడచ్చటనే యజ్ఞమండపమందు ముని మండలిచే బరివేష్టింపబడియుండెను. అప్పుడు దేశదేశాంతరములందలి రాజులందఱును నుండిరి. స్వయముగద్వారకాధీశుడగు శ్రీకృష్ణుడును విచ్చేసియుండెను. ఆ సమయమున మునుల సమక్షమున ధర్మరాజగు యుధిష్ఠిరుడు దేవర్షి నారదు నొక్క ప్రశ్న నడిగెను. ముందుగా

నాతఁడు నారదుని విధ్యుక్తముగఁ బూజించి, ప్రణామము గావించి యాతనితో నిట్లచెను:-

"స్వామీ ! నాకొక శంక కలదు, మీరాజ్ఞ నొసంగుచో నడిగెదను."

ఆనందమును ప్రకటించుచు నారదుఁడిట్లనెను :- "రాజా ! నీవు నీ సందేహము తప్పక యడుగుము. ఈ మును లందఱ సమక్షమున నీశంకకు యథాశక్తిగ యథామతిగ సమాధాన మొసంగెదను."

నారదుఁడు ప్రసన్నతతో నుత్తర మొసంగుట కుద్యుక్తుఁడగుటనుగాంచి ధర్మరాజు చేతులు జోడించుకొని యిట్లనెను:- "స్వామీ ! నాశంక సామయికమైనది. మీరందఱును జూచినదే కదా ! శిశుపాలుఁడు భగవంతు ననరాని కువాక్యములను బలికినాఁడు. ఎన్నోతిట్లు తిట్టినాఁడు. చివరకాతఁడు భగవంతుని చక్రముచేఁ జంపఁబడినాఁడు. ఈతఁడు చచ్చి ఘోరరౌరవాది నరకము లకుఁబోవునని మన మందఱమను కొంటిమి, కాని యాతఁడు ప్రత్యక్షముగ నందఱును జూచు చుండ భగవంతునిలో నైక్యమయినాఁడు. ఆతనిజ్యోతి శ్రీహరి శరీరములో లీనమైనది. ఆతనికి సాయుజ్యముక్తి లభించినది. ఇదెంతటి యాశ్చర్యకరమగు విషయము !"

అంత నవ్వి నారదుఁడిట్లడిగెను :- "రాజా ! ఇందులో ఆశ్చర్యము చెందవలసిన దేమున్నది ?"

యుధిష్ఠిరుఁడు విస్మయముతో నిట్లనెను :- "స్వామీ ! మీ కాశ్చర్యము కలుగుట లేదేమోకాని మాకు మాత్రమాశ్చర్యము వేయుచున్నది. ఆశ్చర్యము చెందవలసిన విషయమును గలదు. సాధారణ మానవునిఁ దిట్టినను, అట్లు దిట్టినవానికిఁ బాపము సంభవింపగలదు. ఇతరులను నిందించుటగాని, ఇతరులను దిట్టుటగాని మహాపాపము. ప్రపంచములో నిందకునకు మించిన పాపిలేఁడు. ఘోరాతిఘోర నరకములకు నిందకుఁడే పోవును. స్వామీ ! ఈ విషయమున నేనొక కథను వినియుంటిని. మీరాజ్ఞ నొసంగినచోఁ జెప్పెదను."

నారదుఁడిట్లనెను :- "రాజా ! చెప్పుము. నీవు ధర్మావతారుఁడవు. నీవేది మాటలాడినను అది ధర్మానుసారముగనే యుండును."

ఇది విని వినయముతో ధర్మరాజిట్లనెను :- "స్వామీ ! నేను సత్సంగ ప్రసంగములో మహర్షుల ముఖమున నొక కథను వింటిని. ఒకానొక రాజునకుఁ దన ప్రసంసను వినవలయునను వ్యసనము కలదు. అందఱును వచ్చి ఆతని యెదుటనే ప్రశంసించు కార్యముల నాతఁడొనర్చెడువాఁడు. ప్రశంసకుల కాతఁడు మిక్కిలి ధన మొసంగెడువాఁడు. ప్రశంసకొఱకాతఁడు ధర్మమును గూడ చేసెడువాఁడు. ఆతఁడు స్వర్గమునకుఁబోఁగానే ఆతఁడుండుటకు గొప్ప గొప్ప సువర్ణ భవనములు లభించెను; **కాని లోనికి** వెళ్ళి చూచునప్పటికి ఆతనకి ఆభవనములనిండ **గుఱ్ఱపు** లద్దెలుండెను. ఎచ్చటను నివసించు

టకు స్థానము లభింపలేదు. కొంత భాగము లద్దెలు లేకుండెను.

రాజు దేవేంద్రునితో నిట్లనెను :- దేవేంద్రా ! నేనుండ వలసిన యిల్లు గులపులద్దెలతో నిండియున్న దేమి !"

అంత స్వర్గాధిపతియగు నింద్రుఁడిట్లనెను :- "రాజా ! నీవు నిరంతరము నీ మిథ్యాప్రశంసయందే నిమగ్నుఁడవై యుంటివి మిథ్యా ప్రశంస లద్దెవలె నిస్సారమైనది. నీవు ధనము నొసంగి నీ ప్రశంసను వినుచుండెడువాఁడవు కాని నిందను వినెడువాఁడవుకావు. ఎవరు రహస్యముగ నిన్ను నిందించు చుండిరో వారు కొంత లద్దెను దినుచుండెడువారు. అందువలన నీ స్థానము లద్దెలు లేకున్నది. నీ రాజ్యములో నొక వడ్రంగి యున్నాఁడు. ఆతఁడు నిన్ను నిందించుచో నిప్పుడే యీ భవనమంతయును వట్టిదై పోగలదు. ఏలయనఁగా నాతఁడును నెవని నిందించువాఁడుకాఁడు. రాజేంద్రుని యాజ్ఞచే వేషమును మార్చుకొని వడ్రంగి దగ్గఱకుపోయి యిట్లనెను. "మహాను భావా ! మీరు మిక్కిలి ధర్మాత్ములు. ఈ దేశపు రాజు మిక్కిలి ప్రతిష్ఠాలోలుపుఁడు. ఎల్లప్పుడును దన పొగడ్తలనే వినుచుండును. ఆతఁడు మిక్కిలి నీచుఁడు."

ఇది విని వడ్రంగి నవ్వి చేతులు జోడించుకొని యిట్ల నెను. "రాజా నీవకారణముగ నన్నన్యాయముపాలు చేసెద వేల ? ఆ సువర్ణ భవనములందు నింపఁబడిన లద్దెలను నాచే నేలతినిపింప దలచుచున్నావు ? మహారాజా ! నేను నేఁటివర కెవ్వరిని నెట్టి నిందనొనర్ప లేదు. ఇంకను జేయఁబోను. పర

నిందను మించిన పాపమీ ప్రపంచమున లేనేలేదు. అందఱును దమతమ ప్రకృతి ననుసరించి అవశులై యుండఁగా నిందించి యేమి లాభము ?"

యుధిష్ఠిర మహారాజు నారదునితో నిట్లనెను. 'స్వామీ ! వఁడ్రంగి యొక్క యీ మాటలనువిని రాజు చింతామనస్కుఁడై తిరిగిపోయెను. కావున ఓ మహర్షీ ! నిందకుమించిన పాపము నాకీ ప్రపంచమున నింకొకటి దృష్టికి గోచరమగుట లేదు. చూడుఁడు రాజర్షియగు నంగుని పుత్రుఁడు వేనుఁడను వాఁడు బ్రాహ్మణులను నిందించినాఁడు. ఈ కారణమున నాతఁడు భయంకరనరక యాతనలలోఁబడవలసివచ్చినది. బ్రాహ్మణులను నిందించిన వేనుఁడు నరకమునకుబోయెను. ఈ శిశుపాలుఁడు సాక్షాత్తుగా బ్రాహ్మణ్య దేవుఁడగు వాసుదేవునిఁ దిట్టెను. ఈ రాజసూయ యాగములోనే తిట్టినాఁడనుటకాదు. మేమీతని తండ్రి నెఱుఁగుదుము. ఈతఁడు పుట్టినపుడును మేమును లోక వ్యవహారముగఁజూడఁబోయితిమి, అట్లే మేమీతని కడకు తఱుచు వెళ్ళివచ్చుచుండెడువారము. మాకు సంబంధులుకూడనై యున్నారు. ఈతఁడు మా పెదతల్లి కుమారుడు. ఈతఁడుమాటలు నేర్చినప్పటినుండియును భగవంతుని ద్వేషించుచుండెడువాఁడు. ఆతనినిఁగువాక్యములు పలుకుచుండెడు వాఁడు అతనిని నిందించుచుండెడువాఁడు. ఇటువంటిపాపికి

దుఃఖదాయకమను యాతనల నొసంగవలసి యుండును. దమఘోషుని మహాపాపియగు పుత్రుఁడు శిశుపాలుఁడెట్లో దంతవక్త్రుడు నట్లే యుండెను. ఆతఁడును బుట్టినప్పటినుండి భగవంతుని ద్వేషించుచుండెడువాఁడు. వీరిద్దరును భగవంతుని చేత మడసినవారు. వీరికిద్దరకును ముక్తి లభించినది."

నవ్వి నారదుఁడిట్లనెను :- అయితే నీ యభిప్రాయమేమి ? ఈతనికేమి శిక్షలభింపవలయును ?

రోషస్వరమున ధర్మరాజిట్లనెను :- "స్వామీ ! ఈ పాపమున కెంతటి శిక్ష యొసంగినను నల్పమే కాఁగలదు. నా యభిప్రాయమేమనఁగా నేజిహ్వతో నవినాశియగుఁ బరబ్రహ్మ, వాసుదేవునిఁ గటువాక్యములు పలికినచో వాని జిహ్వకు గళితకుష్ఠు సంభవింపవలయును. ఆ జిహ్వ క్రుళ్ళి తెగిపడవలయును. ఆతని అంగ ప్రత్యంగములందర్బుదములుగ, ఖర్వములుగ సర్పములు, తేళ్ళు ఒక్కసారిగ కుట్టిన వేదన నిరంతరము సంభవింపవలయును. ఇవన్నియును జరగలేదు. దేనికొఱకై అనేక జన్మములు యోగులు తప స్స్వాధ్యాయములొనర్చి శరీరమును శుష్కింపజేసికొందురో అట్టి ముక్తిలభించినది. స్వామీ! ఈ సంఘటనమువలన మాకు చాల ఆశ్చర్యము కలుగుచున్నది. మా బుద్ధి వాయుచలితమైన దీపకళికవలెఁ జంచలమై ఉద్భ్రాంతమైయున్నది. మీరు సమర్థులు, సర్వజ్ఞులు. భగవత్కృపాపాత్రులు, దయయుంచి మా యీ శంకకు సమాధానమొసంగుఁడు. నావలెనే యీ రాజులును, మహారాజులును

ఋషులును, మునులును నీప్రశ్నకుఁ బ్రత్యుత్తరమును వినుటకు సముత్సుకతను జెందియున్నారు."

శ్రీ శుక దేవుఁడిట్లనెను :- "రాజా ! భగవత్ప్రేమలో మునిఁగిన యుధిష్ఠిరుని వాక్యములను విని నారదుఁడు పరమసంతోషమును జెంది నవ్వుచు ధర్మరాజు ప్రశ్నమునకు-బ్రత్యుత్తరమొసంగనుద్యుక్తుఁడయ్యెను."

నారదుఁడిట్లనెను :- రాజా ! నిందా, స్తుతులు, సత్కార తిరస్కారాదులు శరీరమునకా లేక ఆత్మకా ? అని నేను నిన్నడుగు చున్నాను,"

ధర్మరాజిట్లనెను :- "స్వామీ ! ఆత్మకు సత్కార తిరస్కారము లెక్కడివి ? దానికి నిందాస్తుతులొనర్పఁగలవారెవరు ? ఆత్మ నిత్యమైనది, ఏకరసము, సత్కార తిరస్కారముల కతీతమైనది. నిందాస్తుతులు శరీరమునకు సంబంధించి యుండును."

అంత నారదుఁడిట్లనెను : రాజా ! నీవు సత్యమును బలుకుచున్నావు. ఈ శరీరోత్పత్తి ఆత్మవలనఁ గలుగునేమో యిప్పుడు చెప్పుఁడు."

ధర్మరాజిట్లనెను :- "స్వామీ ! ఆత్మకు ఉత్పత్తివినాశము లెచ్చటివి ? శరీరరచనము ప్రకృతి పురుషాశ్రయముచేనైనది. వీరిలో నుత్తమ పురుషుఁడెవఁడో ఆతఁడే పురుషోత్తముఁడనఁబడు చున్నాఁడు."

నారదుఁడానందమును బ్రకటించుచు నిట్లనెను:- "మహారాజా! నీ కన్నియును దెలియును. ఈతఁడు నాకంటెఁ హీనుఁడు, ఈతఁడు గొప్పవాఁడను నీవిషమత అహంకారమమకారములవలనఁ గలుగును. నేను బ్రాహ్మణుఁడను, నేను శ్రేష్ఠుఁడను, నేను పండితుడను అని యీవిధముగ నహంకరించుటకే అహంత యనిపేరు. ఇది నాధనము, వీరు నాజనము, ఇది నాగృహము. ఇది నాకుటుంబము, పరివారము ఈవిధముగ నాదియనుటకు మమకారమని పేరు. అహంకార మమకారములు జీవులందు శరీరాభిమానముచేఁ గలుగుచుండును. ఎవరికెంతగా శరీరాభిమానముండునో వారికంతగా నహంకార మమకారములుండును. అంతగా నాతఁడు సత్కారముచే సుఖియు, తిరస్కారముచే దుఃఖియునగును. ఆతఁడు స్తుతిని విని హర్షితుఁడగును. నిందను విని దుఃఖించును. దేహాభిమానులను నిందించినచో నరకాదిలోకములకుఁబోయి నానా యాతనల ననుభవింపవలయును. దేహసంబంధముగాని అహంకార మమకారావేశముగాని లేని శ్రీహరిని గొట్టినను--(ఆతని నెవరును గొట్టఁజాలకున్నను) పాపమంటదు. ద్వేషభావమున నిందించినను నిందచే నరకాది లోకప్రాప్తియును గలుగదు. దేహాభిమానులగు జీవుల కహంకార మమకారములుండును. సర్వాత్ముఁడగు శ్రీహరికి హెచ్చుతగ్గుల భావముండదు. ఏలననఁగా నాతఁడద్వితీయుడు. ఆతఁడెవరికంటెఁ బెద్ద-ఎవరికంటె చిన్న. భగవంతుఁడెవరినిఁ జంపును. వైరకారణముననను ద్వేషముచేతను గాదు.

కల్యాణము కొఱకు చంపును. వీరివలనఁజచ్చువారికి మేలేకలుగును. ఏలననఁగా భగవంతుఁడు కల్యాణనిధానుఁడు. ఆతనితో జీవులకెట్టి సంబంధమున్నను వారికి కల్యాణమే కలుగును. కత్తివచ్చి ఫలముపైఁ బడినను ఫలమే తెగును, ఫలమువచ్చి కత్తిపైఁబడినను ఫలమే తెగిపోవును. అద్దే విధముగా భగవంతునితో స్వయముగ సంబంధము పెట్టుకొన్నను కల్యాణమే కలుగును, భగవంతునితో ద్వేషమును వహించిన, భగవంతుఁడే ఆతనితో హఠపూర్వకముగ సంబంధమును బెట్టుకొని వారినిఁ జంపినచో నాతనికిని కల్యాణమే కలుగును. దేహాభిమానిని నింకొక దేహాభిమాని జంపినచోఁ జంపువానికిని పావము సంభవించును. చచ్చువాడును గర్మఫలమును భోగింప వలసివచ్చును. కాని భగవంతునిచేతిలో నెవఁడు చంపఁబడినాఁడో, ఆతనితో నెవఁడు వైరమును బెట్టుకొని ప్రాణత్యాగ మొనర్చినాఁడో ఆతఁడును ముక్తుఁడగును.

ఇది విని మిక్కిలి యాశ్చర్యముతో యుధిష్ఠిరుఁడిట్లనెను:- "స్వామీ! మీ రెట్టి మాటలు మాటలాడుచున్నారు? వైరముచేతఁ గూడ భగవంతునియందుఁ దన్మయత కలుగునా ?"

నారదుఁడిట్లనెను :- "కలుగునాయేమిటి, కలిగితీరును. ఈ విషయమున నేను ముందు నీకు విస్తారముగఁజెప్పెదను. నీవు శ్రద్ధగా నీ గహనవిషయమును శ్రవణమొనర్పుము."

.... )o( ....

# యుధిష్ఠిర నారద సంవాదము

౪౪౭

శ్లో॥ తస్మాత్ కేనాప్యుపాయేన మనఃకృష్ణ నివేశయేత్ ।

మాతృష్వస్రేయో వశ్చైద్యో దంతవక్రశ్చ పాండవ ।

పార్షదప్రవరౌ విష్ణోర్విప్రశాపాత్పదాచ్చ్యుతౌ॥

....శ్రీ భాగ. ౭ స్కం. ౧ అ. ౩౨ శ్లో.

వ. కావున నేయుపాయముచేనై మనంబును శ్రీ కృష్ణచరణార విందంబులఁ బ్రవేశపెట్టవలయు.... మీతల్లి చెలియలి కొడుకులైన శిశుపాల దంతవక్త్రులు దొల్లి విష్ణుమందిర ద్వారపాలకులు. విప్రశాపంబునఁ బదభ్రష్టులై భూతలంబున జన్మించిరి."

....శ్రీ మదాంధ్రభాగవతము

రాజు రాజసభలోనికి మంచి మంచి బహుమూల్యములగు సుగంధ అత్తరులను రాచుకొని వచ్చుచుండును. ఆ సభలో నాతనికి మిత్రులు, శత్రువులు, స్నేహితులు, వందీగణాదులంటకును సుగంధము సమానముగ లభించును. అందటి ఘ్రాణేంద్రియములు దానిచేఁ దృప్తియగును. వారికి రాజుమీఁద నెట్టి భావముండినను నాతని సన్నిధికి రాఁగానే సుగంధమునకు వంచితులు కాఁజాలరు. ఆతని సన్నిధికిరాకున్నచో నది వేఱువిషయము. కల్పతరువుకడ కెవరు పోయినను వారి మనోవాంఛలు నెఱవేరితీరును. దానికి దూరముగ నున్నవారు ఆగుణమునకు

వంచితులగుదురు. భగవంతుఁ డానందస్వరూపుఁడు. ముక్తి ధామము, సౌందర్య మాధుర్యరాశి. ఆతనిలో ద్వేషములేదు. స్వపరభేదములేదు. ఆతనితో నెట్టి సంబంధమును బెట్టుకొన్నను ముక్తుఁడగును. ఒకానొకఁడన్నసత్రమును దెఱచెను. అచ్చటికి వచ్చిన వారందఱకును అన్నముఁబెట్టుచుండెను. చాలమందివచ్చి అన్నదాతను దిట్టుచుందురు. కువాక్యములను బలుకుచుందురు. పోరాడుట కుద్యుక్తులయ్యెదరు. ఉదారుఁడగు నాతఁడు వారికిని అన్నమును బెట్టుచుండును. వచ్చి తనను బ్రశంసించుచునాతని దానధర్మములను గూర్చి పొగడినవారికిని నన్నమును బెట్టును. భేదమేమనఁగా ద్వేషులకును నిందకులకును కేవలము భోజనము లభించును. సాధుస్వరూపులును గుణగ్రాహులగు సత్పురుషుల కును భోజనమేకాక స్నేహరసమును నొసంగును. ప్రేమమయ మగు నా భోజనమునకును కేవలము భోజనమునకును భేదము న్నది. కాని కడుపు ఇద్దరకును నిండినది. ధర్మాత్ముఁడగు దాతయొక్క ద్వారమునుండి యెవ్వడును నిరాశను జెంది పోఁడు,"

నారద మహర్షి ధర్మరాజగు యుధిష్ఠిరునితో నిట్లనెను:- "రాజా ! ఈ శబ్ద స్పర్శ, రూప, రస, గంధములకు సంబం ధించిన సాంసారిక అసుఖకర విషయములందు ప్రియత్వబుద్ధి యున్నంత వఱకే రాగద్వేషములుండును. ఒకానొక వస్తువు నుగూర్చి ఒకఁడు తనకుఁ గావలయుననియు, మఱియొకఁడు తనకే కావలయుననియుఁ కోరుటచేతనే రాగ, ద్వేష, ఈర్ష్యా,

యుద్ధ, కలహాదులు సంభవించుచుండును. ఏ సమయమున నన్నిటిని మానవుఁడాత్మస్వరూపమునఁ జూచుచుండునో అట్టి సమదర్శియగు వానికి రాగమునులేదు, ద్వేషమునులేదు, మోహ శోకములునుండవు. భగవంతునకీ సంసారిక పదార్థములతో సంబంధము లేనేలేదు. సాంసారిక పదార్థములయందును సాంసారిక పురుషులయందును ఆశకలిగినవారు మాటి మాటికి పుట్టి చచ్చుచుండవలయును. కాని యే కారణముచేనైనను నే భావముచేతనైనను భగవంతునితో సంబంధమును బెట్టుకొని అతని యందు చిత్తము తగుల్కొనినచో వానికిఁక జననమరణములు లేకపోవును.

అంత ధర్మరాజిట్లడిగెను:- స్వామీ! ఏయేకారణములచేఁ జిత్తము తన్మయ మగును ?"

ఇది విని నారదుఁడిట్లనెను:- "రాజా! ఏ వస్తువుమీద నైనను జిత్తము తన్మయమగుటకైదు కారణములుండును. మొదటిది భక్తిభావముతోఁ జిత్తము భజనీయ యిష్టమునందుఁ దన్మయమగును. భక్తుఁడే సమయమునఁ బ్రేమాశ్రువులను విడుచుచు, గద్గద కంఠములోఁ దనయిష్టదైవమును స్తుతించునో ఆ సమయమున నాతనికి సాంసారిక విస్మృతి కలుగును. ఆతఁడతిశయమైన భక్తిచే భగవంతునియందిట్లు తదాకారమును జెందును. అప్పుడాతనికి శరీరస్పృహకూడ ఉండదు. ఇట్టి తన్మయత ఏ భక్తులకు లభించినదో వారి పాదపద్మములకు నా ప్రణామములు. భయమువలనను దన్మయము కలుగును. ఉరి

శిక్షను బొందిన భయకారణమున నాతని కేమియును దెలియకుండును. చిత్తము సదా చింతామగ్నమై యుండును. ఉరి వేయఁబడఁబోవు వారినిఁ జూచినచో నాతనికి బ్రహ్మ జ్ఞానికినిఁ బైకిచూచినచో భేదమేమియును గనఁబడదు. ఇద్దరును బ్రపంచ నిస్పృహులుగానే యుందురు. మైత్రియందును దన్మయత యుండును. హార్దిక ప్రేమకలిగిన మిత్రుఁడు లభించినవాఁడే భాగ్యవంతుఁడు. మైత్రిలోఁగల తన్మయతను జెప్పుట కట్టిమిత్రుఁడు లభించినఁగాని చెప్పవలను బడదు. ఇది చెప్పఁదగినదికాదు. అనుభవింపఁదగినది. కామమువలనను దన్మయత కలుగును. స్త్రీ పురుషుని యందాసక్తినిఁజెందినను, పురుషుఁడు స్త్రీయందాసక్తినిఁ జెందినను వారికి తాము ప్రేమించినవారు తప్ప అన్యముగోచరింపదు, నిద్రించు నున్నను, మేల్కొన్నను, కూర్చుండినను, నిలుచుండినను వారి చింతయే యుండును. ఈ విషయములో నేనొక కథను వింటిని, చెప్పుమనినఁ జెప్పఁగలను."

ధర్మరాజిట్లనెను:- "స్వామీ! దృష్టాంతమున విషయము స్పష్టమగును. కావున మీరాకథ నవశ్యము చెప్పవలయును."

ధర్మరాజుయొక్క జిజ్ఞాసను గాంచి నారదుఁడిట్లనెను :- "రాజా! ఒకానొక రాజునకొక దాసి యుండెను, ఆమె కొకానొక పురుషుని యందాసక్తియుండెను. పురుషుఁడు రాజసేవకుఁడు. ఇద్దరును పరస్పరము హృదయపూర్వకముగఁ బ్రేమించుకొనుచుండిరి. ఒకదినమున నాస్త్రీ తన జారపతినిఁ గలిసి

కొనుటకై సంకేతాను సారముగ నరణ్యములోనికిఁ బోవుచుం డెను. మార్గమున నొక క్రోధియగు ముని భగవద్ధ్యానము చేసి కొనుచుండెను. ఆ కామిని కామవేగమున నంధురాలయ్యెను. ధ్యానస్థుఁడగు మునిఁ బాదముల దాటుచు వెళ్లుటచే మునికిఁ గోపమువచ్చి ఆమెను రెండుబాదెను. ఆమె వెడలిపోయెను. తన జారపతినిఁ గలిసికొని ఆమె అచ్చట నుండి తిరిగెను. ముని యామెను బిలిచి యిట్లడిగెను:- "నీవు నన్ను; గాలితోఁ ద్రొక్కుచు నేలబోయితివి ?"

ఆమె చేతులు జోడించుకొని మిక్కిలి నమ్రతతో నిట్లు నెను:- స్వామీ! అది యెప్పుడు? ఎన్నాళ్ళయినది? నేను మీతో నీయవజ్ఞను చేసినట్లు నాకు గుర్తులేదు."

ముని కోపముతో నిట్లనెను:- "ఎట్టి మాటలు మాటలాడు చున్నావు, నీవు నిర్దోషిగాఁజెప్పుకొనుచున్నావు. ఇప్పటికిప్పుడే నీవు గ్రుడ్డి దానివలెఁబోవుచుంటివి. నేను ధ్యానమగ్నుఁడనై యుండఁగా నీ పాదములు నా శరీరమునకుఁదాకినవి. అందు వలన నాకు కోపము వచ్చినది, నేను నిన్ను రెండుదెబ్బలను గూడ కొట్టితిని. నీకు కొంచెమైన స్పృహలేదు."

అప్పుడాకామిని యిట్లనెను:- ప్రభూ! సత్యమును జెప్పు చున్నాను. నాకు గుర్తులేదు. పొరపాటునఁదగిలినవేమో! దానికి నేను క్షమాపణమును గోరుచున్నాను. కాని నా యపచారమును మన్నించునెడల నేనొక మాటను జెప్పెదను."

"ముని యిట్లనెను :- "మంచిది, చెప్పుము. నీవు నిర్భయురాలవై చెప్పుము, నేనన్యథాతలంపను."

ఆ కామిని యిట్లనెను:- "లేదు స్వామీ! అన్యథాతలంచుటకేమియును లేదు. మీ మిథ్యాధ్యానముకంటె నా ధ్యానమే గొప్పదని నేను చెప్పగలను నీవేకాంతమున నాసనమునఁ గూర్చుండి, కన్నులను మూసికొని ధ్యానముననుంటివి. కాని నా పాదములు తాఁకఁగానే మీ ధ్యానము భంగమైనది. మీరు నన్ను గుర్తించితిరి. అంతేకాదు రెండు దెబ్బలుకూడ కొట్టితిరి. కాని నన్నుఁజూడుఁడు. నేను గన్నులను మూసికొనలేదు, ఆసనము వైచుకొనలేదు. ఒక్కస్థానమున గూర్చుండలేదు. పరుగెత్తుచుంటిని. కన్నులు తెఱచుకొనియున్నను బొరపాటున మీ పైఁగాళ్లుపడినవి. నేను రెండు దెబ్బలుకూడ కొట్టితినని మీరు చెప్పుచున్నారు. మీరు నాకుఁగనఁబడనులేదు, కట్టి దెబ్బల సంగతియునుదెలియదు. కావున మీ ధ్యానముకంటె నాధ్యానమే గొప్పది,"

ఇది విని మునిలజ్జితుఁడై యిట్లనెను:- "దేవీ! నిజము చెప్పుచున్నావు. నా చిత్తము భగవంతునియందు దన్మయము కాలేదు. నీ చిత్తము నీజారపతియందు దన్మయము చెందినది".

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను:- "రాజా! ఈ విధముగ నత్యంత కామానక్తియందున్నను జిత్తము తన్మయమగును. ఆ సాంసారిక కామమునే భగవంతునియందు గలిగినచో భగవంతునిఁదనపతిగనో, ఉపపతిగనో, జారపతిగనో ప్రేమి

గనో యెంచి స్త్రీ భావమున జీవుఁడు కాంక్షించునెడల ఆతని కల్యాణమున సందేహములేదు. నాలుగు కారణములివియే, ఐదవది సుదృఢ వైరానుబంధము చేతన జిత్తము తన్మయమగును.

ధర్మరాజాశ్చర్యముతో నిట్లనెను:- "వైరమునఁజిత్తము తన్మయమెట్లగును?"

ఇది విని నారదుఁడు బిగ్గఱగ నవ్వి యిట్లనెను:-"రాజా! వంధ్యకు బ్రసవబాధ యేమి తెలియును? అబోధబాలికకుఁబతిగృహ సుఖానుభవమెట్లు తెలియగలదు? మహారాజా! నీవజాతశత్రుఁడువు, నీ వెవ్వరితోడను తీవ్రముగ హృదయముతో వైరమును జెందలేదు. అందువలన నీవాశ్చర్యమును జెందుచున్నావు; కాని చిత్తము వైరి యెడలఁ దన్మయమును జెందినటులఁగామమువలనఁగాని, స్నేహము వలనఁగాని, భక్తిచేఁగాని, కలుగదని నేను దృఢముగఁజెప్పఁగలను, మహారాజా! తమకున్న ప్రబలశత్రువు సదా హృదయ పటలమున నాట్యమొనర్చుచుండును. ఒక భృంగి గృహ కీటకమే. అది తడిమట్టినిఁదననోటియందుఁ బెట్టుకొని తెచ్చి ఒక యింటినిఁగట్టుకొనును. ఆ యింటిలో నొకానొక కీటకమును దెచ్చి బంధించి దానిముందు గుంజారవ మొనర్చును. నిరంతరము బంధములో నుంచి శత్రువు యొక్క గుంజారవమును విని ఆకీటక ముద్వేగమును జెంది, నిరంతరము శత్రువును స్మరించుటచే నాకీటకమును భృంగమగును. తన్మయమగును కావున మహారాజా! వైరమునఁ జిత్తము బాగుగాఁ దన్మయమగును. సాంసారిక వ్యక్తితో వైర

మును బెట్టుకొనినచోఁ జచ్చి ఆతనికి సంబంధీయగును. పూర్వ కృతవైరమునకుఁ బ్రతీకార మొనర్చును. అదేవైరము జ్ఞానము చేఁగాని అజ్ఞానముచేఁగాని భగవంతునితో సంభవించెనా బంధములే దీరిపోవును. శాశ్వతముగ నావాగమనములు వదలిపోవును. కావున మహారాజా! చిత్తము తన్మయమగుటకుఁగామము, ద్వేషము, భయము, స్నేహము, భక్తి యీయైదు ఉపాయములు కలవు. ఈ భావములతో భగవంతునియందు జిత్తమునుంచి చాలమంది సంసార సాగరమును దాటినారు."

ఆశ్చర్యముతో ధర్మరాజిట్లనెను:- 'స్వామీ! మీరొక విలక్షణ సిద్ధాంతమును జెప్పినారు. భగవంతుని యందుఁగామభావమునుంచు టెట్లు? కామభావముచే నెవరు సిద్ధినిఁబొందినారు?"

అంత నారదుఁడిట్లనెను:- "రాజా! శ్యామసుందర భగవానుఁడు వ్రజమందవతరించి లీలలొనర్చినపుడు మొట్ట మొదటగఁ గొందఱు గోపికలచిత్తమాతని యందు కామభావమున నాకృష్టమయ్యెను. మునుముందుగా వారొక అత్యంతరూపవంతమగు తమ యొక్క పరమ ప్రేష్ఠముగ భావింపవలయును. అతనితో సంబంధము కలిదిన తరువాత నాతఁడు కేవలము గోపికానందనుడు కాఁడనియు, సర్వుల అంతరాత్మలలో విరాజిల్లు సర్వేశ్వరుఁడనియుఁ దెలిసి కొనిరి, ఆ కామభావము సాంసారిక సౌందర్యయుక్తుఁడగు యువకుని మీఁదగలిగినచో నది పాపమగును. బంధనకారణము కాఁగలదు. కాని యదృష్టవశమున నాకామము కామారియగు గేశవుని యెడల గలిగినది.

అంధునిచేతికి పక్షి అందినది. రాజా! ఇది వ్యావహారిక లీలావిషయము. వాస్తవముగ నీగోగోపగోపీజనాదులు భగవంతునకు నిత్య సహచరులు, పార్షదులు, అందువలననే రసశాస్త్రమందు వ్రజాంగనల కామమునకుఁ బ్రేమయని చెప్పబడినది.

ఇదివిని ధర్మరాజిట్లడిగెను:- స్వామీ! భయముచేఁజిత్తము తన్మయమగుటెట్టుల?"

నారదుఁడిట్లనెను:- "భయమును గూర్చి నేను భృంగ కీటకముల దృష్టాంతము నొసంగి చెప్పియుంటిని, కంస జన్మమునకుఁ బూర్వమును భగవంతునితో వైరమును బెట్టుకొనెను నావలనఁదన శత్రుగోకులమున నందగృహమునఁ బెరుగుచున్నాడను సంగతినిఁ దెలిసికొని, ఆతఁడు నిద్రించుచున్నను, మేల్కాన్నను, లేచినను, గూర్చుండినను, తినుచున్నను, త్రాగుచున్నను నడచుచున్నను, దిరుగుచున్నను సర్వత్రకృష్ణధ్యానమే ఆతనికుండెను. కృష్ణుఁడు నన్నుఁజంప గలఁడు కృష్ణుఁడురాలేదే, కృష్ణునినుండి నేను రక్షింపఁబడుటెట్లు? ఆతనికి జిత్తమంతయును గృష్ణమయమయ్యెను. వైరియై ఆతఁడు శ్రీ కృష్ణారాధనమును గావించుచుండెను. భగవంతుడొక ప్రతిజ్ఞను జేసినాఁడు- 'ఎవరు నన్నేభావముతో భజించెదరో వారికట్టిఫలమునే యొసంగఁగలను.' "యే యథా మాంప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్" నేనును నాభావముతోడనే భజించుచు నారీతిగనే ఫలము నొసంగెదను. కావున భగవానుఁడు చప్పట్లు చరచుచు నాతని

సమ్ముఖమునకు వచ్చి, ఆతనిని తన శ్రీ హస్తములతోఁ జంపి ముక్తునిగాఁజేసెను?"

ధర్మరాజిట్లడిగెను:- "స్వామీ: ద్వేషమున నెందఱనెట్లు భగవంతుఁడను గ్రహించినాఁడు."

నవ్వి నారదుఁడిట్లనెను:- "స్వామీ! ప్రత్యక్ష విషయమునకుఁ బ్రమాణములేల? శిశుపాలుని శరీరమునుండి జ్యోతిబయలు దేరి యీ సర్వాంతర్యామియగు ప్రభువు శరీరమున నైక్యమైన సంగతిని నీ సభాసదులందఱును బ్రత్యక్షముగఁ జూచితిరిగదా! ఈ శిశుపాలుఁడు పుట్టినప్పటినుండియును భగవంతుని ద్వేషించుచుండెడు వాఁడు. ఇదే విధముగ దంతవక్త్రుఁడును. నీకు వీరిద్దరును పెదతల్లి బిడ్డలు. శ్రీకృష్ణుని మేనత్తకు వీరిద్దరును బిడ్డలు; కాని పూర్వజన్మ సంస్కారవశమున భగవంతునిఁ పుట్టినప్పటినుండియును ద్వేషించు చుండెడువారు, సాంసారిక రాజన్యులతో ద్వేషమును బెట్టుకొని యుండినచో మరలఁజచ్చి మరల రాజులయ్యెడువారే, కాని వీరు ద్వేషమును భక్తభయహారియగు శ్రీ కృష్ణునితోఁ బెట్టుకొనిరి. అందువలన వీరిద్దరును మరణించి ముక్తులైరి. ఇంకను చాలమంది రాజులు భగవంతుని ద్వేషించియే ముక్తి కధికారులైరి."

ధర్మరాజిట్లడిగెను:- "స్వామీ! భగవంతునితో సంబంధము నెట్లు పెట్టుకొనవలయును?"

నారదుఁడిట్లనెను :- "సాంసారికులతోఁ బెట్టుకొనునట్లే. ఈతఁడు నా తండ్రి, పినతండ్రి తాత, ముత్తాత, మామ, సోద

రుఁడు, బావ, పుత్రుఁడు, మామ, మేనమామ, బావమఱఁది, షడ్డకుఁడు అని మొదలగు సంబంధము లేర్పఱచుకొనవలయును. ఈ సంబంధము లన్నియునుమాయిక ప్రాణులతోఁ బెట్టుకొనినచో బంధనము వృద్ధియగును. భగవంతునితోడ బెట్టుకొనినచో ముక్తుఁడవయ్యెదవు. ఈ యాదవులందఱును ముక్తి కధికారులే; ఏలననఁగాఁ దెలియకయే వీరందఱును కృష్ణునిఁ దమ బంధువునిగఁ దలఁచుచున్నారు."

ధర్మరాజిట్లడిగెను:- "స్వామీ! మిత్రత్వముతో భగవంతునితో సంబంధమును స్థాపించుటెట్లు?"

ఇది విని నారదుఁడు కిల కిల నవ్వి యిట్లనెను:- "రాజా! అమృతము స్వయముగ రుచిచూచుచు దాని రుచినడుగుచున్నావు. నీ యెదుటఁ గూర్చుండిన నీ శ్యామసుందరుని సాక్షాత్తుగ భగవంతునిఁగఁ దెలిసికొనియుండినచో నొక చలువరాతి సుందరమందిరమును నిర్మించి, ఆతని నెల్లప్పుడిందు పూజించుచుందువు. ఈతనిచే రథమును దోలింపవు. సేవచేయించుకొనవు ఈతనితోఁ గలిసి మెలసి చనవుగ మాటలాడుకొనవు. పాదములు పట్టించుకొనవు. ఈతనిని నీవు నీ మిత్రునిఁగను, సుహృదునిఁగను, సఖునిఁగను హితైషిగను భావించుచున్నావు. దాని యొక్క ఫలమే నీ యిల్లు పరమపావనమగు తీర్థమగుటకుఁ గారణము, గొప్ప గొప్ప ఋషులును మహర్షులును నీయంగణములోని ధూళినిఁగైకొనుటకు సదావచ్చి పోవుచుందురు. బండి చక్రమువలె గిఱ్ఱున నెల్లప్పుడును దిరుగుచుండునేను

సేవలము మీ యింటిలో సుస్వాదు సామగ్రులను బిండివంటలను దినుటకు వచ్చుటలేదు. ఈ వాసుదేవుని పాదధూళిచే నీ శరీరమును బావనమొనర్చుకొన వచ్చెదను. కావున రాజా! సర్వాంతర్యామియగు భగవంతుఁడనగు వాసుదేవుని మీరు సుహృదునిగను, సఖునిఁగను, మిత్రునిఁగను భావించుచున్నారు. మీరు ధన్యులు."

అంత నమ్రతతోఁ జేతులు జోడించుకొని ధర్మరాజిట్లనెను. : "స్వామీ ! ఇదంతయును మీవంటి గురుజనచరణ కృపా ఫలమే. వాసుదేవ భగవానునకు మిత్రులమగు యోగ్యతమా కెక్కడిది ? భగవంతుఁడే కృపచే మమ్ములను తనవారిగాఁ జేసికొనినాఁడు. భక్తితో భగవంతుని నెట్లారాధింపవలయును ?"

అంత నారదుఁడు సంకోచముతో నిట్లనెను :- "ఇప్పుడు భక్తి విషయమేమిచెప్పగలను ? వీరు ఋషులు మునులందఱును గూర్చుండియున్నారు. వీరందఱును భగవంతునిభక్తిభావముతో, బూజించుచుందురు. నేను నిరంతరము వీణనుబూని రామకృష్ణ హరి, రామకృష్ణహరి, యని కీర్తించుచుండుటచే నన్నుగూడ భక్తుఁడని అనుచుందురు. నాలో భక్తి గిక్తి యేమియును లేనే లేదు. ఈ శ్యామసుందరుఁడే నాకాధారము. ఈతఁడే అభక్తుఁడ నని తెలిసియు భక్తి వేషమునుగాంచి స్వీకరించుట వేఱు విషయము.

నీవు వేనమహారాజు దృష్టాంతము నొసంగితివి, రాజా, వేనునకు భగవంతునియందు ద్వేషమునులేదు. ప్రేమయును లేదు. అతఁడు సర్వశ్రేష్ఠుఁడనని యనిపించుకొనఁదలఁచెను. ఆతని సర్వశ్రేష్ఠత్వమునకు బ్రాహ్మణులు బాధకముగనుండిరి. ఆతఁడిట్లనుకొనెను :- "సమాజములో నీబ్రాహ్మణులకే అధికారముకలదు. వీరిని నశింపఁ జేసినచో నందఱును నన్నే శ్రేష్ఠునిగ నెన్నుచుందురు. భగవంతుని యెడల నాతని కుపేక్షాబుద్ధి యుండెను. ఏలననఁగా నాతఁడీచర్మచక్షువులకుఁ గనంబడువాడు కాఁడు. ఆతనికి బ్రాహ్మణులయెడలనే ద్వేషము. అందువలన బ్రాహ్మణశాపముచేఁ జచ్చి నరకమునకుఁ బోయెను. ఆతనికి భగవంతునితో సంబంధమేర్పడి పృథుభగవానుఁడాతని దన తండ్రిగా భావించునప్పటి కాతని కుద్ధారముకలిగెను. ఆతఁడు చచ్చిన తర్వాత యాతనలనుండి ముక్తుఁడయ్యెను. కావున మహారాజా ! ఏదోవిధముగ భగవంతునిఁ బ్రేమింపవలయును. ఈ చంచలచిత్తము నాతనికి జోడింపవలయును. ప్రపంచములో నన్నివస్తువులు అందఱకులభింపవు. పుత్రులు లేనివారు భగవంతునిఁ బుత్రునిగా భావింపవలయును. ఆతనిఁ బుత్రునివలెఁ బ్రేమింపవలయును. తనకు స్వామిలేనివారు భగవంతుని స్వామిగా భావించి సేవింపవలయును. గురువులేనివాఁడు భగవంతుని గురువుగా భావించి పూజింపవలయును. మనోనుకూల పతిలేనివారు భగవంతునిఁ బతిగాభావించి, పతిగా సంబంధమునేర్పాటుగావించుకొని, తన హావభావ కటాక్ష శృంగారము

లచే సంతోషపెట్టవలయును. మిత్రుఁడు లేనివాఁడు భగవంతునితో మిత్రత్వమును నెఱపుకొనవలెను. శత్రువులు లేనివాఁడు భగవంతుని శత్రువుగా నేర్పఱచుకొనవలయును. సారాంశమే మనఁగానేదోవిధముగ మనస్సును గృష్ణునియందుంచవలయును. అట్టివాఁడీ పరాత్పరుని చెంగుపట్టుకొనవలయును. ఆతనికిఁ బెనవైచుకొనియుండవలయును. రాజా ! ఈ శిశుపాల దంతవక్త్రులెవరోకారు, భగవంతుని నిత్యపార్షదులగు జయవిజయులే సనకాదుల శాపవశమున భూమిపై జన్మించిరి. చివరకు భగవంతునిచేఁ జచ్చి ముక్తులైరి, మరల వారిపదవినిఁ బొందిరి.

ఇది విని ధర్మరాజిట్లగెను :- "స్వామీ ! జయవిజయులకు శాపమెట్లువచ్చినది ? త్యాగులును, తపస్వులు నగు సనకాదులు మాయాగుణరహితులుగదా వారికి కోపమేల వచ్చినది ? ఈ ప్రసంగమును మీరు నాకుఁ జెప్పవలయును.

సూతుడిట్లనెను:- "మునులారా! ధర్మరాజడుగఁగా దేవర్షియగు నారదుఁడు జయవిజయుల శాపకథనంతను వినిపించెను. స్వామీ! హిరణ్యాక్షవధాప్రసంగమున నేనాకథను జెప్పితిని, మరల నిప్పుడు హిరణ్యకశిపుని వృత్తాంతమును జెప్పెదను. కావున మరల స్మరణార్థము అత్యంత సంక్షేపముగ నాకథను జెప్పెదను. ఏలననఁగా ప్రసంగానుసారముగఁ జెప్పవలసి వచ్చును. కాకున్న విషయముతెలియదు. మీరు దీనిని పునరుక్తిదోషముగ భావింపకుఁడు."

ఇది విని శౌనకుఁడిట్లనెను:- "సూతా! సాహిత్యములో నిరుక్తిదోషముండును. కాని భాగవత కథయందుఁ బునరుక్తి దోషముండదు. దీనిలో నొకవిషయమును వేలకొలది సార్లు చెప్పవలసి వచ్చును. అవతారచరిత్ర మొక్కటియే దానినిఁ జెప్పవలసియున్నది. మీరు నిస్సంకోచముగఁ జెప్పుఁడు" శౌనకుని యీ మాటలను విని సూతుఁడు జయవిజయుల కథను మరల నత్యంత సంక్షేపముగఁ జెప్పుటకుద్యుక్తుఁడయ్యెను.

....o....

## జయ విజయుల శాపకారణము

౪౪౮

శ్లో॥ కీదృశఃకస్య వాశాపో హరిదాసాభిమర్శనః।
అశ్రద్ధేయ ఇవాభాతి హరేరేకాంతినాం భవః॥
....శ్రీ భాగ. స్కం, ౧ అ. ౩౩ శ్లో॥

యుధిష్ఠిరుఁడు నారదునితో నిట్లనెను:-

మ. అలుగం గారణమేమి విప్రులకు? మున్నా విప్రులెవ్వారు? ని
శ్చలు రేకాంతులు నిర్జితేంద్రియులు నిస్సంసారులీశాను వ

ర్తులు వైకుంఠపురీ నివాసులన విందున్ వారికెబ్భంగి నీ
ఖల జన్మంబులు వచ్చె నారద వినం గౌతుహలంబయ్యెడిన్
....శ్రీ మదాంధ్ర భాగవతము.

తండ్రి పుత్రునితో నాడఁగోరునెడల నాతఁడాతనితోఁ బోరాడును. తండ్రి పోరాటాభినయమొనర్చును. పిల్లవాఁడును దనశక్తి కొలఁది బలమునుజూపును. అంతఁదండ్రి తనకుఁ దానే క్రిందఁబడి, కపటాశ్చర్యముతో నిట్లనును:- "అబ్బాయీ! నీవు చాల బలవంతుఁడవురా. నన్నుఁబడవైచినావే." తండ్రి తనకుఁదానే పడినాఁడని పిల్లవానికిఁదెలియును. అయినను ఆనందించును. ఏలననఁగాఁదండ్రి యానందములోఁదన యానందమిమిడియున్నది. భగవంతుఁడవతరించుటలో ననేక ప్రయోజనములున్నవి. కాని తన భక్తులకుఁదనక్రీడచే సుఖమొసంగుటకే అవతరించినాఁడని మనుమనుకొందుము. భగవంతుఁడు భక్తులను నిమిత్తముగాఁజేసికొని నాటకమును రచించును. పాత్రలన్నియు నాతని యధీనములోనివే. ఏ నాటకమాడవలసినదియు ఆయనకు బాగుఁగాదెలియును. ఏ పాత్రలేయభినయము నెప్పుడు చేయఁగలవనునది ఆతనికిఁదెలియును. అయినను నాతఁడు వేషమును ధరించి రంగస్థలమ్ముపైదకువచ్చి తన జనములతోడను, తానునేర్చిన పాత్రలతోడనే కోపించును యుద్ధమొనర్చును, ప్రేమించును దీనిపేరే భగవల్లీల, దీనినే ఆవతార చరిత్రమందుము. దీనిని మాటి మాటికి వినుటచే భవబంధములు పటాపంచలగును.

నారదుఁడు ధర్మరాజగు యుధిష్ఠిరునితో నిట్లనెను;- "రాజా! నీవు జయ విజయుల శాపవిషయమును గూర్చి నన్నడిగితివి. దానిని నీకుజెప్పెదను. నీవు సమాహితచిత్తుఁడవై శ్రవణ మొనర్పుము. ఒకానొక దినమున బ్రహ్మమానసపుత్రులగు సనక, సనందన, సనాతన, సనత్కుమారులు దిగంబరులై అనేక లోకములు తిరుగుచుఁదిరుగుచు విష్ణులోకమగు వైకుంఠధామమునకువచ్చిరి. వీరికి సర్వత్ర అవ్యాహతగతి కలదు. వైకుంఠనాథుని దివ్యభవనమునకు సప్తప్రాకారములు కలవు. ఆఱుప్రాకారములను వీరు దాటిరి. ఏడవ ప్రాకారమునకు వీరు చేరఁగనే అచ్చట ప్రధాన ద్వారపాలురగు జయ విజయులు వీరు లోనికిఁబోవుటనుగాంచి కేకవేసి యిట్లనిరి. "జాగ్రత్త! జాగ్రత్త! ఓ పిల్లలారా! లోపలికిపోవలదు."

వీరు పిల్లలు కానేకారు. వీరికి గడ్డములు బయటకుఁబెరుగక. పొట్టకు బెరిగెను. వీరు పూర్వజులకును బూర్వులు. నిన్నమొన్నటి వారగు వీరినోట పిల్లలారా ! యను శబ్దమునువిని, అవహేళన మొనర్చుచు వారు ముందుకుఁబోవుచుండిరిగాని యేమియును మాటలాడ లేదు. వారి యీ యాపేక్షాభావమును గాంచి యిట్లనిరి :- "వత్సలారా ! మీరు చెప్పిన వినరేల ?"

"అవును వినము" అని వారు కచ్చితముగఁ జెప్పిరి.

వారు బెత్తములాడించుకొనుచుఁబోయి, ద్వారము నడ్డగించి నిలుచుండి యిట్లనిరి :- "చూతము, ఎట్లులోపలకుఁ బోఁగలరో"

ఇప్పుడు కాముని తమ్ముఁడు క్రోధము మునుల నావరించెను. అది వైకుంఠమునకెట్లు ప్రవేశించినదని మీరడుగవలదు. భగవంతుఁడులేక క్రోధమునకు సత్తాలేదు. అధర్మము భగవంతుని వీపునుండి పుట్టినది. భగవంతునకట్లు సంకల్పము కలిగినది వచ్చినది. ఇప్పుడు మునులిట్లనిరి :- "పొండు మీరు పాపులగు అసురులై పుట్టుఁడు."

"ఏలస్వామీ" ఇప్పుడు వారి వాక్కులలో మృదుత్వము కనఁబడెను. "నతు ప్రీతిర్వినాభయమ్" భయము లేక ప్రీతి యుండదు.

"ఏలననఁగా మీరు రజోగుణతమోగుణములచే వ్యాప్తులైయున్నారు. భగవంతుని లోకములోనుండ యోగ్యులుకారు పిల్లల శక్తినిఁజూడుఁడు. మీరు తలక్రిందులుగఁ గ్రిందఁబడగలరు."అని వ్యంగ్యముగ నవ్వుచుఁ గుమారులనిరి.

"స్వామీ ! దయఁజూపుఁడు మేము మీ బిడ్డలము." ఇప్పుడు బుద్ధిపాటువఁబడెను "అందఱును చమత్కారమునకు నమస్కరించెదరు" అని నవ్విరి కుమారులు.

స్వామీ ! దయజూపుఁడు. మాకు మీ సంగతి తెలియలేదు. మీ స్వరూపమును గుర్తింపలేదు. మీ మాటలను వినలేదు. మేమెల్లప్పుడు నసురజన్మలో నుండరాదు" అని తప తప కొట్టుకొని కుమారుల కోమల పాదములపైఁబడిరి.

సాధువుల క్రోధము నీటిమీఁద గీతవంటిది. వచ్చిన నాక్షణముననే సమాప్తమగును. కుమారునిట్లనిరి :- "మా వచన

ములు మిథ్యలుకావు; కాని మూఁడు జన్మములవఱకు మీ రసుర భావమును భోగించి మరల భగవంతుని లోకమునకు రాఁగలరు."

"అయితే మేము మూఁడు జన్మములు భగవంతుని వీడి యుండవలసినదేనా ?" పాదములపైఁబడి జయ విజయులనిరి.

కుమారులు నవ్వి యిట్లనిరి :- మీరు భగవంతునకు దూరము కావలయుననుకొన్నను గాఁజాలరు. మూఁడు జన్మల లోను భగవంతుఁడే మిమ్ములను జంపును. మూఁడవజన్మమునఁ బీతాంబరధారియు, వనమాలియనగు భగవంతుడు మిమ్ములను సంహరించినప్పుడు మీరసురీభావము నుండి ముక్తులగుదురు."

సంతోషించి యిద్దరును బాదములనుండి లేచి, మరల సాష్టాంగ దండప్రణామమును గావించి యిట్లనిరి :- "అయితే, చింతింపవలసిన పనిలేదు. భగవంతుఁడు చంపినను భగవంతునితో సంబంధముండును. ద్వేషముతోనైన నగుఁగాక ! నిరంతరము శత్రుభావముతోనైనను మాకు స్మరణము లభించును. ఇచ్చట కావలి కాచి కాచి మాకును విసుఁగు జనించినది. ఇప్పుఁడు భగవంతునితోఁ జేపట్లు పట్టుదుముగాక ! సంబంధముచే సంకోచముగాని లేకున్న లేదు. ద్వారపాలురమై స్వామితో బోరాడ జాలము, మాశంఖ, చక్ర, గదా, పద్మములను వనమాలలను లాగుకొనఁగానే నల్లముఖములతో అసురభావమును జెందినచో నప్పుడు మామల్ల యుద్ధకౌశలమును జూపెదము.

మీ కృపచే జలవాయువులు మారిపోఁగలవు, ప్రపంచమును జూడఁగలము. మాస్వామియొక్క విచిత్రావతారములను దర్శించెదము. ఇచ్చట మేము సదా శ్రీమతి లక్ష్మీదేవి పాదములొత్తుచుండఁగా దర్శించితిమి కొంచెముగ దెబ్బలాటలు జరిగి, పోరి పోరి, ఖట ఖట, ఛటా పటఫటా ఫట అను శబ్దములతోఁగొట్టుకొనుచు, మేము రెండు దెబ్బలుకొట్టుటయు, నాలుగు దెబ్బలు తినుటయుఁ జేయుచుండినఁ గొంచె మానందము లభించును. మంచిది స్వామీ! మేమికఁ బడిపోయెదము" అని పలికి దడదడ, బడబడమని దొర్లుకొనుచు ఇద్దరును వైకుంఠమునుండి క్రిందఁ బడిపోయిరి.

నారదుఁడు ధర్మరాజగు యుధిష్ఠిరునితో నిట్లనెను :- "రాజా ! ఆ జయవిజయులే కశ్యపభగవానుని యమోఘవీర్యమున దితిదేవి గర్భమునుండి హిరణ్యకశిపు, హిరణ్యాక్షనామములచేఁ బ్రసిద్ధులైరి. వీరు దైత్యదానవులకుఁ బ్రథములును, బూర్వజులును బ్రతాపశాలురగు రాజులునైరి. వారితో హిరణ్యాక్షుని భగవంతుఁడు సూకర రూపమును ధరించి చంపెను. హిరణ్యకశిపుని కరాళ నృసింహరూపమును ధరించిచంపెను. వారిద్దరే పులస్త్యుని పుత్రుఁడగు విశ్రవుని భార్యయగు గేశినీ గర్భమున రావణ కుంభకర్ణరూపమునఁ బుట్టిరి. వారిని రఘుకుల మండనుఁడును, కౌసల్యానంద వర్ధనుఁడును, దశరథనందనుఁడును, మైథిలీ హృదయ సర్వస్వమునగు శ్రీ రాఘవేంద్రుఁడు యుద్ధములోఁ జంపెను. మరల మూఁడవ జన్మమున

వారే భగవానుని మేనత్తలిద్దరకును శిశుపాల దంతవక్త్రులుగా నుత్పన్నమైరి, ఈ జన్మమున వారు భగవంతుని చేతిలోఁజచ్చి ముక్తులైరి. వైరభావముతోడనే కానిండు. వారు నిరంతరము భగవద్ధ్యానమునే యొనర్చిరి. ఎవరెట్టి ధ్యానమును జేయుదురో వారట్టి రూపమును చెందుదురు. అందువలన వీరు భగవంతుఁడగు నచ్యుతుని స్వరూపమును బొంది ఆతని సమీపమునకుఁ బోయిరి. శ్రీ రామావతారకథను నీవు మార్కండేయ మహాముని ముఖమున శ్రవణ మొనర్పఁగలవు."

అంత ధర్మరాజిట్లనెను:- "స్వామీ! శ్రీ రామచరిత్రమును నేను మార్కండేయ మహాముని వలన వినఁగలను. సూకరావతార కథను గూడ భగవానుని వలననే వినఁగలను. కాని నృసింహుని కథను మీరే నాకు వినిపింపవలయును. ఈ కథను గూడ భగవానుని వలననే విన్నచో నాతఁడు మరల నా నృసింహరూపమును ధరించినచో నందఱును గోవిందాయన మోనమః చేయఁగలరు. భగవంతుఁడు నృసింహరూపము నే నిమిత్తముగ ధరించినాఁడు?"

అంత నారదుఁడిట్లనెను:- "రాజా! భగవంతుఁడవతారము లన్నిటిని భక్తుల నానందపరచుటకై ధరించునని నేనిది వఱకే చెప్పియుంటిని. అసుర రాజగు హిరణ్యాక్షుఁడు పాతాళమున కీతనిని(గొని పోయినప్పుడు, ఈతడు వానినిఁజంపి ధరాదేవినిఁదనకోఱలతో నెత్తి పైకిఁదెచ్చెను. ఇదేవిధముగహిరణ్యకశిపుఁడు తన చిన్న కుమారుఁడగు ప్రహ్లాదుని మిక్కిలి

ద్వేషించెను. ఆతనిని జంపఁజూచెను. ఆతనినిఁ జంపుట కనేకో పాయములను గావించెను. దాని మీఁద భగవంతునకుఁ గోపము వచ్చి, అత్యంత భయానకమగు నృసింహ రూపమ్మును ధరించి స్తంభమును బగులగొట్టుకొని వెంటనే దానిలోనుండి వచ్చి స్తంభమునకుఁ పుత్రుఁడయ్యెను చైతన్యమున కందఱును బుత్రు లగుచుందురు భగవంతుఁడు భక్తులకొఱకై జడమునకుఁ బుత్రుఁడయ్యెను."

అంత ధర్మరాజిట్లనెను:- "స్వామీ! తల్లి దండ్రులకుఁ బుత్రులమీఁద మమకారముండునే పుత్రుఁడయోగ్యుఁడగుఁగాక; తల్లిదండ్రు లాతని బ్రేమించెదరు. ఆతని మేలునే కోరుచుం దురు. పైఁగా చిన్నవానియందు మమకారమెక్కుడుగ నుండును. తండ్రి కొడుకుల కింతటి ద్వేషము ప్రబలుట కేమి కారణము సంభవించినది. నిరంతరము శరశ్చంద్రునివలె మందహాస వదనారవిందముగ నుండు నాతఁడేల పెద్ద పెద్ద గడ్డములను, మీసములను ధరించినాఁడు. ఈ చరిత్రమును వినుటకు నాకుమిక్కిలి కుతూహలముగ నున్నది. మీరు దీనినిఁ దప్పక జెప్పవలయును."

సూతుఁడిట్లనెను :- మునులారా ! ధర్మరాజగు యుధిష్ఠి రుఁడడుగఁగా నారదుఁడిచ్చిన ప్రత్యుత్తరమును నేనట్లే మీకు వినిపించెదను. ఆ విధముగానే మాగురుదేవుఁడగు శుకుఁడు పరీక్షిత్తునకుఁ జెప్పెను. మీరందరును దానిని సమాహిత చిత్తు లై వినుఁడు."

# తమ్ముఁడు చావఁగా హరిపై హిరణ్యకశిపుఁడు కోపించుట.

౪౪౬

శ్లో॥ భ్రాతర్యేవం వినిహతే హరిణా క్రోధమూర్తినా।
హిరణ్యకశిపూ రాజన్పర్యతప్యద్రుషా శుచా॥

--శ్రీభాగ ౭ స్కం ౨ అ. ౧ శ్లో.

నారదుండిట్లనియె :- "కమలోదరు చేతం దన సహోదరుండు హతుండయ్యెనని విని హిరణ్యకశిపుండు రోషశోక దందహ్యమాన మానసుం డయ్యెను."

--శ్రీమదాంధ్ర భాగవతము.

తన యొక్కయు, తన సంబంధులయెడలను ద్వేష భావమును వహించువారిని ద్వేషించుట స్వాభావికమే. మాతృ, పితృ, భ్రాతృ సంబధులను హింసించువారిని హింసింప వలయునని అందఱ హృదయములలోఁ గలుగుచుండును. అట్లు కలుగనివారు జడులైనను గావలయును. జీవన్ముక్తులైనను గావలయును, ఎవడైన నపకార మొనర్చినచో వారితో సంబంధము పెట్టుకొనిన నందఱయెడలను ద్వేషము కలుగును. పరశురాముని తండ్రియగు జమదగ్ని శిరస్సును హైహయవంశ క్షత్రియులు ఖండించిరి, అంతఁ గృద్ధుఁడై పరశురాముఁడు

భూమిలోని సమస్త క్షత్రియులను వినాశమొనర్చుటకుఁ బ్రతిజ్ఞను దీసుకొని తిరిగి తిరిగి యిరువదొక్కసారి క్షత్రియకులమును సంహరించెను. ఋషిమునులకే యిట్టి ప్రతిహింసా భావముండిన నసురులలో నుండుననుట కాశ్చర్యమేమున్నది ?

యుధిష్ఠిర మహారాజు నారదునితో నిట్లనెను :- "రాజా ! తన పుత్రుఁడగు ప్రహ్లాదుని హిరణ్యకపుడేల ద్వేషించెనని నీవడిగితివి, ఈ విషయమున ముందుగా నేను నీకు హిరణ్యకశిపు చరిత్రమును జెప్పెదను. తరువాత ప్రహ్లాదుని స్వభావమును చెప్పెదను. ఇద్దరకును బరస్పరము ప్రతికూలభావము కలుఁగఁగానే భగవంతుఁడు నరహరి రూపమును ధరించి, ఆశ్రితభక్తుని రక్షించిన యీ పరమ పవిత్రాఖ్యానము నత్యంత సరసతగా, మనోరంజకముగాఁ జెప్పెదను. కావున నిప్పుడు నీవారంభమునుండియే యీ చరిత్రమును వినుము."

భగవంతుడు వరహావతారమును ధరించి ధరణినెట్లుద్ధరించెనో ఆ యవతారముననేవిధముగ హిరణ్యాక్షునివధించినది. ఈ ప్రసంగమును మీరు వినియుంటిరి. దేవతల హితముకొరకు సూకర రూపధారియగు విష్ణువు హిరణ్యకపుని తమ్మునిఁ జంపగానిదివిని మహాబలియును, దైత్యరాజునగుహిరణ్యకశిపుఁడత్యంత కుపితుఁడయ్యెను. ఆజ్ఞాకారియగు తన తమ్ముఁడు చచ్చిన దుఃఖమొకటియు, రెండవది విష్ణువు దేవతల పక్షమునన్నాఁడనుఁడను శోకముననుండెను. ఈ కారణమున నాతఁడు పండ్లను బటబటఁ గొఱకుచు, దంతములచేఁ బెదవులను గొఱు

కుచు, గ్రోధాగ్నిచే మండిపడుచు సమస్తఅసురులు వినుచుండ నిండుసభలో మాటలాడుటకు నిలుచుండెను. క్రోధకారణమున నాతఁడు వణఁకుచుండెను. నోట శబ్దములు స్పష్టముగ వచ్చుట లేదు. ఆతని రెండు భ్రుకుటులు ముడివేయఁబడియుండెను. కన్ను లెఱ్ఱనయ్యెను. కరాళ దంతములను బయటఁబెట్టుటచే నాతని అతి భయంకర ముఖము మిక్కిలి భయానకముగను, దుర్దర్శముగను నుండెను. రోషావేశుఁడై త్రిశూలమును ద్రిప్పుచు నాతఁడందఱను సంబోధించి యిట్లనెను :- "ద్విమూర్ధా !"

ద్విమూర్ధుఁడు లేచి నమ్రతతో నిట్లనెను:- "ప్రభూ! నేనిచ్చటనేయున్నాను, ఆజ్ఞ?" అప్పుడాతఁడిట్లనెను :- "త్ర్యక్ష శంబర శతబాహు, హయగ్రీవు లెచ్చట నున్నారు?" ఇది వినగానేవారు నలుగురును నిలుచుండియిట్లనిరి:- "ప్రభూ! మేమును సిద్ధముగ నున్నాము, ఆజ్ఞ?"

అప్పుడాతఁ డిట్లనెను:- 'నముచి, పాక, ఇల్వాలాగజ, విప్రచిత్తి, పులోమ, శకునులగూడ పిలువుఁడు. ప్రధాన దైత్య దానవులందఱును సావధానులై నామాటలు వినవలయును. నేను చెప్పుదాని నవ్యగ్రభావముతో శ్రవణమొనర్చి దాని ననుసరించి కార్యమొనర్పవలయును."

అందఱును చేతులను జోడించుకొని యిట్లనిరి. "అన్నదాతా! మేమెల్లప్పుడు నీ సేవలోనేయున్నాము. మాకేమిఆజ్ఞాపించిన దానినదే విధముగ నా సమయముననే నిర్వహించెదము"

అంత హిరణ్యకశిపుఁడిట్లనెను:- "నాకుఁ బ్రాణప్రియుఁడగు నా తమ్ముని సమ్ముర హరి సూకరపమును ధరించి వధించిన సంగతి మీకు విదితమే."

చేతులు జోడించుకొని శంబరాసురుఁడిట్లనెను:- "అవును ప్రభూ! ఇది చాల అన్యాయము. చిన్నయ్యగారిని మోసముచేసి సూకరరూపధారియగువిష్ణువు చంపినాఁడు."

అంతఁ గోపముతోఁ బెదవులను గొఱకుచు హిరణ్యకశిపుఁడిట్లనెను:- "మోసముచేసి చంపినాఁడా బలముచేతనా? విష్ణువున కేమి యపకార మొనర్చినాఁడని నేనడుగుచున్నాను. విష్ణువు సమదర్శియని నేను వినియున్నాను. ఆతనికి సురలెంతో అసురులంతే. భేదమేమనఁగా సురలెల్లప్పుడును నాతనియెదుటఁ జేతులు కట్టుకొని నిలుచుండి ఆతని మాటనే అమోదించుచుందురు.మాకాతనితో సంబంధము లేదు.ఆతనికడ మేము మోఁకరించము ఇకిలించము. ఆతని ప్రశంసనుజేయము. అందువలన నాతనికి మా యెడలఁగోపము. తమ ప్రశంస సాంసారికులకుఁ బ్రియముగనుండును. ఆతఁడును నాత్మ స్తోత్రము చేసికొనువాఁడుగానున్నట్లున్నది. ఆతఁడును మిథ్యాప్రశంస వచనములను విని యుబ్బిపోవుచుండును. విష్ణువు శుద్ధస్వరూపుఁడని నేనువినియుంటిని. శుద్ధస్వరూపునకు ఇతరులయెడల రాగద్వేషములెట్లుండును? విష్ణువు తనస్వభావమునువీడినట్లున్నది ఆతఁడును బక్షపాతియైనాఁడు. ఆతనికినిఁ బిల్లలవలె అస్థిరచిత్తమేర్పడినట్లున్నది. ఎవఁడైనఁ బూలమాలతో నలంకరించినను, దిన

తిండిపెట్టినను వానివడిలోనికిఁబోవు పిల్లవానిగతియైనది యీతని స్వభావము. ఆతఁడిప్పుడు తన హద్దులను మీఱినాఁడు, కావున నిప్పుడు నేనీ త్రిశూలముతో నాతని శిరస్సును ఖండించి దానిలోనుండి వెలువడిన యుష్ణరక్తముచే నాతనిచేఁ జంపబడిన నా ప్రియ సహోదరునకు తర్పణ మొసంగెదను. ఆ రక్తమును బానమొనర్చి నా పరలోక గతుఁడగు సోదరునకు సంతుష్టినిఁ గలుగఁజేయుదును."

అంత నముచి యిట్లనెను:- "ప్రభూ! మనకు ముఖ్యశత్రువులు దేవతలు. ముందు వారినిఁ జంపవలయును. తదనంతరము విష్ణువు మీఁద దండెత్తవలయును."

ఇది విని హిరణ్యాక్షుఁ డిట్లనెను:- "ఓరీ! మీరు గ్రహింపలేదు. దేవతలు నపుంసకులు, వారిలో బలపౌరుషములు లేవు. వీరు జగద్విఖ్యాత పారుబోతులు. మా తమ్మునిఁగాంచి యింద్రుఁడు శచీ భవనమున ముసుగువైచుకొని కూర్చుండినాఁడు. వీరందఱకును బలము విష్ణువే. విష్ణువే వీరి సాహసోత్సాహములకు ముఖ్యకారణము. కావున ముందుగా మూలచ్ఛేదనము కావింపవలయును. ముందుగా వేరును దెగఁగొట్టవలయును. వేరు తెగినచోఁ బత్రములు, పుష్పములు, శాఖాదులు వానికవియే క్రిందకు వ్రాలిపోవును. ఇంటికి గోతినిఁ ద్రవ్వినచో నిల్లంతయును బడిపోయినట్లు విష్ణువు చంపఁబడఁగానే దేవతలందఱును నిస్తేజులై శ్రీహీనులు కాఁగలరు.

అంత నసురులిట్లనిరి :- "అసురేంద్రా ! శత్రువులను జంపుటకుఁ బూర్వము వానిని దుర్బలము కావింపవలయును. దుర్బల శత్రువు శీఘ్రముగఁ జావఁగలఁడు."

అంత హిరణ్యకశిపుఁ డిట్లనెను:- "మీ యాలోచనము చాల బాగున్నది. విష్ణువునకు మూలము యజ్ఞము. యజ్ఞమును విష్ణువందురు. యజ్ఞములు వేద, బ్రాహ్మణ, గోవుల సహాయమున జరుపఁబడును. ధర్మమున్నచోట విష్ణువుండును. ఏలన నఁగా యజ్ఞ స్వరూపుఁడును, బురాణపురుషుఁడు నగు విష్ణువుని యథార్థరూపము ధర్మమే. ధర్మము నాశ్రయించియే యీ దేవతలు, పితరులు, ఋషులు, మునులు పంచభూతములు మొదలైనవి నిలిచియున్నవి. కావున ముందుగా వీనిని నశింపఁజేయవలయును. వీనిని నష్టపఱచుటచే విష్ణువు నిర్బలుఁడు కాఁగలఁడు. యజ్ఞాదులు జరుగకున్నచో విష్ణువునకు యజ్ఞభాగములు లభింపక పోవుటచే నాతఁడు నిర్బలుఁడగును యజ్ఞములు జరుగుచోటులను దగులఁబెట్టుఁడు. బ్రాహ్మణులను జంపియమపురమునకుఁ బంపుడు. వారి రక్తమును మీరందఱును పానమొనర్పుడు గోవులను జంపుఁడు. బ్రాహ్మణుల పొట్టలను జీల్చుడు."

హిరణ్యకశిపుని యీ యాజ్ఞ అసురులకు నిధి దొఱకినట్లయ్యెను. వారు హత్యలకును, హింసలకును, క్రూరత్వమునకును సిద్ధపడి కూర్చుండియే యుండిరి. వారికి జీవులను జంపి

నను, హింసాదు లొనర్చినను మిక్కిలి యానందము కలుగు చుండును. ఇంకేమున్నది? అందఱును దమతమ అస్త్రములను దీసికొని భూమినిఁ దిరిగి తిరిగి బ్రాహ్మణులను హింసింప సాగిరి. ఇండ్లు తగులబెట్టుచుండిరి. ధర్మ విరుద్ధముగ నేమిచే యవలయునో అది అంతయును జేయుచుండిరి. గ్రామములకుఁ బోయి వాటినిఁ దగులబెట్టి, నగరములను నాశము చేసెడు వారు, ప్రజోద్యానక్షేత్ర, వనోపవన, ఆశ్రమ, ఖేటఖర్వాట ఘోషనగరములను స్వాహాయొనర్పసాగిరి. గొడ్డండ్రతో ఫల వృక్షములను ఖండింపసాగిరి. పలుగులతో సేతువులను, బర కోటలను, నగరద్వారములు భవనములను ద్రవ్వసాగిరి. పెద్ద పెద్ద రాజధాని నగరములకగ్నినిఁ బెట్టి స్వాహాచేయుచుండిరి.

నారదుఁడిట్లనెను :- "మహారాజా! ఈవిధముగ హిరణ్య కశిపుని దైత్యులు భూమిమీఁదకుఁబోయి యజ్ఞ యాగాదులను నాశముగావించగా దేవతలకుహవిర్భాగములు లభింపకుండెను. వారాఁ కలిచే యజ్ఞ భాగములు లభింపక సాధారణ మానవుల వలె భూమిపైఁ దిరుగుచుండిరి. హిరణ్యకశిపునకు స్వర్గముపై నధికారము లభించెను. ఆఁకలినిఁజెందిన నా దేవతలేమి చేయఁ గలరు? వారు తమ వేషములను మార్చుకొని విపత్యమయమున నెట్లో తమ కాలమును గడుపుచుండిరి."

....)(....

# హిరణ్యకశిపుడు తనవారికి ధైర్యము చెప్పుట

౪౫౦

శ్లో॥ అంబాబహే వధూః పుత్రా వీరం మార్హథ శోభితుమ్।
రిపోరభిముఖశ్లాఘ్యః శూరాణాం వధ ఈప్సితః॥
--శ్రీభాగ, ౭ స్కం. ౨ అ. ౨౦ శ్లో॥

శా॥ నీరాగార నివిష్ట పాంథులక్రియన్ నిక్కంబు సంసార సం
చారుల్ వత్తురు, గూడీవిత్తురు, సదాసంగంబులేదొక్కచో
శూరుల్ వోయెడి త్రోవఁబోయెను శావత్స్రానుండు తల్లీ మహా
శూరుండాతఁడు దద్వియోగమునకున్ శోకింప నీకేటికిన్॥
--శ్రీమదాంధ్రభాగవతము.

మనవారెవరైనఁ జచ్చినచో మనము శోకించి దుఃఖించెదము. మన సంబంధులకు సంబంధులైనవారు మరణించినచో సంసార మనిత్యమైనదనియు, శోకించుట వ్యర్థమనియు బోధించెదము. ఈ యాచారము సనాతనము. తామేడ్చునపుడేడ్చెదరు. కాని యితరులకు జెప్పునపుడు దుఃఖించుటను నిందించెదరు. అర్జునునకు జ్ఞానోపదేశమొనర్చునపుడు భగవంతుఁడెంతో జ్ఞానమును జెప్పెను. కాని యాతని మామ చచ్చినపుడు - లోకమునకుఁ జూపుటకే యనుకొనుఁడు-ఆతఁడును బీతాంబరముతోఁ దన యశ్రువులను దుడుచుకొనుచు వెక్కి వెక్కి యేడ్చు

చుండెను. ఇది లోకాచారము. ఏడ్చునప్పు డేడ్చుటయును, ఓదార్చు సమయమున శోకించుట వ్యర్థమని చెప్పుటయు జరుగుచున్నది.

నారదుఁ డిట్లనెను :- "రాజా ! హిరణ్యకశిపుఁడు తన తమ్ముఁడగు హిరణ్యాక్షుని మిక్కిలి ప్రేమించెడు వాఁడు. ఆతని వరాహమూర్తి చంపగానే వానికి దేవతలమీఁదను, విష్ణుభగవానుని మీఁదను మిక్కిలి కోపమువచ్చెను. ఆ కోపము తోడనే ఆతఁడసురులను భూమిమీదఁకు వైదిక ధర్మ విధ్వంసనము కొఱకు పంపెను. అసురులు పోయి అట్లే చేసిరి. దేవతలు నిర్బలులైరి. ఆతఁడు స్వయముగ విష్ణునిమీఁదఁ గసి తీర్చు కొనుటకై ప్రయత్నించుచుండెను. శక్తి సంచయము కావించు కొనక, అజరామరుఁడుకాక రణమున నజేయుఁడుకాక విష్ణువు జయింపఁబడఁడు, అందువలన నాతఁడు తపస్సు చేయ నిశ్చయించుకొనెను. ఏలననఁగాఁ దపస్సు లేక శక్తి వృద్ధినిఁ బొందదు.

తపస్సునకు వెళ్ళుటకుఁబూర్వము హిరణ్యాక్షుని వధచే దుఃఖితులైన తల్లిని, హిరణ్యాక్షుని భార్యను ఆతని పుత్రులను నోదార్పవలసి యుండెను. ఇంతటి శూరవీరుఁడును బరాక్రమవంతుఁడును జచ్చుటచే శోకమునఁ బరివారమంతయును మిక్కిలి దుఃఖించిరి ఏడ్చుచుండిరి. అందువలన నాతఁడందఱను దనసమీపమునకుఁబంపెను. దితి తన చిన్న కుమారుని శోకమున సంతాపముజెంది యుండెను. హిరణ్యాక్షుని భార్య

విధవయగుటచే నత్యంత దుఃఖితయయ్యెను. ఆతనికి శకుని, శంబర, ధృష్ట, భూత సంతాపన, వృక కాలనాభ, మహానాభ హరిశ్మశ్రు, ఉత్కచాది పుత్రులు తండ్రి మరణించుటచే నత్యంత చింతితులై యుండిరి. హిరణ్యకశిపుఁ డందఱను సమీపమునఁ గూర్చుండ బెట్టుకొని మధుర వచనములతో నోదార్చుచు నిట్లనెను. ముందుగా నాతఁడు తన తల్లియగు దితితో నిట్లనెను :-

"అమ్మా! హిరణ్యాక్షుఁడు నీకు చింతింపఁదగిన పుత్రుడు కాఁడు. కుక్క పందివలెఁ బుట్టినవాఁడును, యశస్సునుబొందని వాఁడును, ధర్మమొనర్పనివాఁడును, పశుపక్షులవలె నాహార విహారములందు దినములను వెడలఁబుచ్చుచుఁ గుక్కవలెఁ జచ్చిన వాఁడును శోచనీయులగుదురు గాని ప్రపంచమందు యశమునార్జించి, తనప్రబల పరాక్రమముచే శత్రువుల హృదయములను గాల్చి, మిక్కిలి గర్వమును జెందిన వారిహృదయముల నడలఁగొట్టి, సముఖమున యుద్ధమందు నవ్వుచు నవ్వుచు శత్రువునకు వీపుఁ జూపింపకయే శస్త్రప్రహారముచే వీరగతినిఁ బ్రాప్తించెను, ఇట్టి పుత్రుఁడు పరమ ప్రశంసనీయుడు. జనని ఇట్టి పుత్రునివలననే పుత్రవతియని పిలువఁబడు చున్నది. ఇట్టి పుత్రుని వలననే అమె గర్భముసఫలమైనది నీ పుత్రుడు సమస్త దేవతలను లోకపాలురను వశమందుంచు కొనినాఁడు. అతనిపేరు చెప్పిన శత్రువులు గడగడ వణఁకెడు వారు. దేవతల కాతని పేరు వినిన రోమములు నిక్కఁబొడిచెడివి. ఇట్టి శూరవీరుని

స్వయముగ సాక్షాద్విష్ణువుకూడ యెదుర్కొనఁజాలకుండెను. ఆతఁడును గపటవేషమును ధరించియెదుర్కొనవలసి వచ్చినది. యుద్ధములో దుర్బలశత్రువుచేఁ జచ్చినను బ్రశంసనీయమే. కావున నీవు నీకొడుకు కొఱకు దుఃఖింపవలసిన పనిలేదు.

దితి యిదివిని అశ్రువులను దుడుచుకొనుచునిట్లనెను :- 'వత్సా నీవు పలుకునది సత్యమే. నాబిడ్డఁడు ప్రపంచములో సర్వశ్రేష్ఠుఁడగు బలవంతుఁడు, ఆతని నెవరును నెదుర్కొన జాలరు. కాని యేమి చేయుదును ? నా కన్నులయెదుట నీ విధవ కోడలు కనబడుచుండిన నాహృదయము బ్రద్దలగుచున్నది. ఈ పసిపిల్లలు పితృహీనులై విలవిలలాడుచున్నారు. చావ వలసిన దానను నేను. ఏతల్లి యెదుట ఈ అవస్థలోనున్న పుత్రుఁడు మరణించినాఁడో అట్టి తల్లికంటె నభాగ్యరాలెవరీ లోకమున నుండఁగలరు ? యువతియగు కోడలు తాడును ద్రెంపు కొని, బొట్టును జెరుపుకొని విధవయై కూర్చుండఁజూచి యే యత్త ధైర్యమును వహింపఁ గలదు ? నాకేమి లేరా నాయనా! నేను నదీకూలమున నున్న లతవంటిదానను. ఎప్పుడు కూలము విఱిఁగిపడునో ఎప్పుడు నశించునో, నాకీపిల్లలదిగులు ఏమియు నెఱుఁగని యీ కోడలు దిగులు తప్పితే వేరేమియును లేదు, వీరిని వోదార్చుము.

ఇది విని హిరణ్యకశిపుఁడు అత్తగారు సమ్ముఖమునను తన ముందును ముసుంగు గప్పుకొని యేడ్చుచున్న మఱదలను గాంచి ఆమెను పుత్రవధువువలె సంబోధించుచునిట్లనెను :-

"భ్రాతృవధూ. నీవింతటి బుద్ధిమతివయ్యు నీవిధముగఁ బిల్లలవలె విలాపమొనర్చుచున్నావు. ఇది బాగుండలేదు. నీపతి యెచ్చటకైన వెడలియుండినచో జింతింపవలయును. ఓసీ పిచ్చిదానా! ఆతడిచ్చట నీ ప్రపంచమునఁ గీర్తియున్నచోట నుండనే యున్నాడు. ఆతఁడు మృత జీవుడు."

మఱఁదల శ్రువులను దుడుచుకొనుచు ముసుఁగులోనే వెక్కి వెక్కి యేడ్చుచు నిట్లనెను :- "ఆతఁడు నాకుఁగనఁ బడుట లేదుకదా! ఆతఁడు లేక నేనెట్లు జీవించి యుండ గలను?"

ఇది విని హిరణ్యకశిపుఁ డత్యంత ప్రేమతో దీన స్వర ముతోఁ బలుకనారంభించెను, సోదరస్మృతిచే వాతనికిని దుఃఖము పొరలి పొంగెను, కాని ధైర్యవంతుఁడనని ఋజువు చేసికొనుచు నిట్లనెను : "ఏల కనబడుటలేదు? ఇదిగో! నీయెదుటనున్న శకుని, శంబర, దృష్ట, భూత, సంతాపన, వృకాది పుత్రులు వీరందఱాతని ప్రతిరూపులే. తండ్రియే స్త్రీ గర్భమునఁ బుత్రుఁడై మరల నుత్పన్నమగును. అందువలనఁ బుత్రవతియగు స్త్రీజాయా యనబడుచున్నది. ఆమె తన పతినే గనుచున్నది. ఆతని తేజమునే ఉదరమున ధరించుచున్నది."

ఇఁక సంబంధ విషయమందుమా! ఈ సంసారసంబంధము క్షణికమైనది. మార్గమునఁ బోవుచుండఁగా నలసి నీటిచలి వేంద్రను జూచి చెరువు ఒడ్డునకు వచ్చును. ఛాయగల చెట్టును జూచి కూర్చుండును. కొందరు తూర్పుయాత్రికులు వచ్చిరి,

కొందరు పడమటివారువచ్చిరి. అందఱును గలిసి ఒకే చెట్టు క్రింద ఛాయలోఁగూర్చుండిరి, మధుర ప్రేమ సంభాషణలుజరుగుచుండెను. క్షణములో సంబంధము కలిగినది. రెండుజాములు దాటఁగానే యెండతగ్గినది. కొందఱు తూర్పుకుఁ బోయిరి. కొందఱు పశ్చిమమునకుఁ బోయిరి. నెవరిత్రోవ వారిదే అట్లే యీ సంసారమును నొక మార్గమే" ఇందులో నీ సంబంధులే పాంధులు. దైవవశము గృహస్థరూపమగు వృక్షఛాయయందందఱును గలిసిరి. పరస్పరమును ప్రేమించుకొందురు. సమయము రాఁగానే అందఱును నెవరిత్రోవవారిదే".

అంత దితి యిట్లనెను:- "నాయనా! నీవుచెప్పునది యథార్థమే. కాని తనవారు పోయిన శోకముండనే యుండును".

హిరణ్యకశిపుఁడు దానిననుమోదించుచు నిట్లనెను:- "చావేమిటి? చచ్చుటయును నొక విధమగు భ్రమయే, శరీరము చావదు. ఇచ్చటనే పడియుండును. జీవుఁడీ శరీరమును వదలి పోగానే శరీరములోనున్న పంచభూతములు మహాభూతములలో గలిసిపోవును. ఇఁక నాత్మయా అది చావదు, పుట్టదు. అది నిత్యమైనది. అవినాశి, శుద్ధ బుద్ధ సర్వగతమైనది, సర్వజ్ఞమైనది, దానికి దేహేంద్రియ మనోబుద్ధ్యాదులతో సంబంధములేదు వేఱికది వేఱుగ నున్నది."

దితి యిట్లనెను:- "అయితే నాయనా! అది దేహము నేల ధరించుచున్నది?"

హిరణ్యకశిపుఁడిట్లనెను:- "అమ్మా! వాస్తవమున నాత్మ దేహమును ధరించుటలేదు. విడుచుటయునులేదు. అది తన యవిద్యా శక్తిచేతనే సుఖదుఃఖాది గుణములను స్వీకరించుచున్నట్లు కనఁబడుచున్నది. ఇది లింగశరీరమునఁ గనఁబడుచున్నది."

దితి యిట్లనెను:- "ఈ మాయిక గుణము లాత్మయందు లేనప్పుడు ఈ గుణముల నాత్మయందు ధరించి నానాక్రియలేల జేయుచున్నది? ఏల భ్రాంతియైనట్లు కనఁబడుచున్నది?"

అంత హిరణ్యకశిపుఁడిట్లనెను:- "కల్యాణీ! అమ్మా! నీవు స్వయముగ నాలోచించుకొనుము. ఆత్మ వాస్తవముగనిర్వికారమైనది: కాని అవిద్యాజన్యమగు నీమాయిక గుణములవలన మనస్సు భ్రమింపఁగా నాత్మయును భ్రమితమైనట్లు తోఁచుచున్నది. వాస్తవమున నది లింగాది రహితమైనప్పటికిని వానితోఁ గూడినట్లు కనఁబడుచున్నది."

దితి యిట్లనెను:- "నాయనా! అదెట్లు కాఁగలదు"

హిరణ్యకశిపుఁడిట్లనెను:- "అమ్మా! మనమొక నౌక మీఁదఁ గూర్చుండి నదియొక్క ప్రబలధారవైపునకుఁ బోవుచున్నామనుకొనుఁడు నౌక మంచి వేగముతోఁ బోవుచున్నది. అప్పుడు మనకు తీరముననున్న వృక్షములు మనకెదురుగఁ బరువీడుచున్నట్లు కనఁబడును ఇట్లే వేగముగల వాహనముల పైఁబోవుచుండి నట్లే కనఁబడును. వాస్తవమున వృక్షములు స్థిరములు, అవి పోవుటలేదు. నౌకపోవుటచే భ్రమచే నవిపోవు

చున్నట్లు కనఁబడును. చిన్న చిన్న పిల్లలు అల్లీబిల్లి గిఱ్రునఁ దిరుగుచుందురు. భ్రామరీనృత్యమును జేయుచుందురు. వేగము గఁదిరిగిన కారణముచే సమస్త పృథివి, వృక్షాదులు తిరుగుచున్నట్లు కనఁబడును. భ్రమవశమున, నజ్ఞానియగు బాలకుఁడిట్లనును:- "మనతో భూమియును దిరుగుచున్నది" ఇదంతయును నాత్మ విపర్యయ కారణమున జరుగును.

దితి యిట్లడిగెను:- "ఆత్మవిపర్యయమని నాయనా! దేని నందురు?"

హిరణ్యకశిపుఁడిట్లనెను:- "అశరీరియగు నాత్మయందు శరీర భావముంచుటయే. అసత్తును సత్తనుకొనుట, అనాత్మయందాత్మ నారోపించుట. దీనినే ఆత్మ విపర్యయమందురు. ఈఆత్మ విపర్యయమే దుఃఖశోక చింతలకు హేతువు. దీని కారణముననే ఇది ప్రియమైనది, ఇది అప్రియమైనది, ఇది సుఖము, ఇది దుఃఖము, ఇది అనుకూలము, ఇది ప్రతికూలము. ఇది సంయోగము, ఇది వియోగము. ఈ విధముగ ద్వంద్వానుభూతి కలుగును. ఈ యాత్మ విపర్యయము వలననే కర్మలొనర్చుచుందుము ఆ కర్మల వలనఁ ప్రపంచమున జనన మరణములు కలుగుచుండును. నానావిధములగు శోక, మోహ, రాగ, ద్వేష, భయోద్వేగ, ఆదివ్యాధి, అవివేక ఆత్మవిస్మృతి మొదలగుననేక విధముల చింతలు కలుగును. ఈ విషయమున నేను మీకంద

ఱకును నొక మిక్కిలి ప్రాచీనమును శిక్షాప్రదమునగు దృష్టాంతమును జెప్పెదను. దానినిమీరందఱును సావధానముగ వినుఁడు దానిని వినుటచే నీ విషయము స్పష్టము కాఁగలదు."

నారదుఁడిట్లనెను:- "ధర్మరాజా! ఇట్లు పలికి హిరణ్యకశిపుఁడు తన తల్లికిని, మఱదలకును, తమ్మునికొడుకులకును చాల చక్కని శిక్షాప్రదమగు దృష్టాంతమును జెప్పెను. దానిని నీవు సమాహిత చిత్తుఁడవై శ్రవణమొనర్పుము."



## యమధర్మరాజ ప్రేతబంధువుల సంవాదము

౪౫౧

శ్లో॥ అత్రాప్యుదాహరంతీమ మితిహాసం పురాతనమ్ ।
యమస్య ప్రేతబంధూనాం సంవాదం తం నిబోధత॥

....శ్రీ భాగ. ౭ స్కం, ౨ అ. ౨౭ శ్లో॥

వ. ఈ యర్థంబునకుఁబెద్దలు ప్రేతబంధు యమ సంవాదంబును నితిహాసంబు నుదాహరించుదురు; వినుండు చెప్పెద."

....శ్రీ మదాంధ్ర భాగవతము

భగవన్మాయ ప్రబలమైనది. ప్రపంచములో నెందఱో నిత్యము పుట్టుచుండుటయును, జచ్చుచుండుటను మానవుఁడు నిత్యము చూచుచునేయున్నాఁడు. మనముందఱ నెందఱో పిల్లలు పుట్టుచుండిరి. ఎందఱో పుట్టఁగానే చచ్చుచుండిరి. ఎందఱో అయిదారు సంవత్సరములు బ్రతికి చచ్చుచుండిరి. ఎందఱో యువకులై చచ్చిరి. కొందఱర్థాయుష్కులయి చచ్చుచుండిరి. మన స్నేహితులెందఱోచచ్చిరి. మనయింటిలోనితాత, తండ్రి, తల్లి, పిన తండ్రులు, పెద తండ్రులు, గోత్రీకులు, పరివారజనము చచ్చిరి. మనమును నొకదినమువఁజావఁగలము. అయినను బ్రియజనములు చచ్చిన రందఱేడ్చుచుందురు. ఇదంతయును భగవన్మాయావిశేషమే. జ్ఞాని యొక్క దృష్టిలో జన్మమును నొక్కఖేలనమే. మృత్యువును నొక్కఖేలనమే. జీవాత్మ చావదు. శరీరముమారుచుండును దీనితో దుఃఖించుటవలన లాభములేదు. ఏలననఁగాజచ్చినవాఁడు మరలరాఁడు. యముఁడెవరిని-గొనిపోయిన నాతఁడు పోయినవాఁడే.

నారదమహాముని యుధిష్ఠిరునితో నిట్లనెను:- "రాజా! హిరణ్యకశిపుఁడు తన తల్లిని, మఱదలను, తమ్మునికొడుకులను నోదార్చుటకు నిట్లనెను. "మీరందరును శ్రద్ధతోవినుఁడు, మీకు నేనొక దృష్టాంతమును జెప్పెదను."

పూర్వకాలమున నుశీనరదేశమున నొక గొప్ప ధర్మాత్ముడును శూరవీరుఁడునగు రాజుండెను. ఆతని పేరు సుయజ్ఞుడు, సుయజ్ఞుని పేరెట్టిదోగుణమట్టిది. ఆతఁడెన్నో యజ్ఞయాగాదు

లొసర్చెను. ఆతఁడు పత్నులను దానసన్మానములచే సంతోష పెట్టెడువాఁడు. ఆతఁడు తనబంధు బాంధవులయెడలను ప్రీతిగ నుండెడువాఁడు. ప్రజలందఱాతనినిఁ దండ్రితో సమానముగ భావించెడివారు. ఆతఁడునునందఱును భేదభావమును బక్షపాత మును లేకయే పుత్రులవలెఁబాలించెడువాఁడు. ఒకానొక సమయ మున శత్రువులందఱునుగలిసి ఆతనిపై నొక్కసారిగా దండె త్తిరి. రాజు శూరవీరుఁడును, గొప్పయోధుఁడునై యుండెను. ఆతనికాతని బాహుబలముమీదనమ్మకముండెను. అందువలన నాతఁడు శత్రువులతోఁ బోరఁబోయెను. చాలామంది శత్రువులు ఒంటరిగానున్న రాజును ముట్టడించి చంపిరి.

రాజుభార్యలగు రాణులు తనప్రాణనాథుని పరలోక ప్రయాణ వార్తను వినఁగానే తొమ్ములను బాదుకొనుచు రణ భూమి వాహనములు లేకయే దిసికాళ్ళతో రణక్షేత్రమునకుఁ బోయెను. రాజుయొక్క బంధువులును, పుత్రులును. మంత్రి పురోహితులును శోకసంతప్తులై కన్నుల నీరుగార్చుచు రాఁజును జూచుటకుఁబోయిరి, రాణులను; రాజపరివారమును వచ్చుటను గాంచి ధర్మతః శత్రుసేన అచ్చటనుండి తొలఁగి రాజ పరివార మునకన్ని యేర్పాటులనుగావించెను. తమ నాథుఁడు ధరణిపై రక్తసిక్తుఁడై పడియుండుటనుగాంచఁగానే రాణుల దుఃఖమునకు మేఱలేకుండెను. రాజు ధరించిన రత్నజటితమగు కవచము బాణములచేతను, ఇతరఅస్త్రముల చేతను భిన్నభిన్నమయ్యెను. ఆతని వస్త్రములు లస్తవ్యస్తములయ్యెను. మరి ముక్తామాలలెచ్చట

వచ్చట చెదరిపడియుండెను. హృదయమున ననేక బాణములు గ్రుచ్చుకొనియుండెచు. వానినుండి రక్తముస్రవించుచుండెను. శిరస్సున శోభాయమానముగను సుందరముగనుండిన వెంట్రుకలటునిటు చెదరిపోయియుండెను. నేత్రములలో జ్యోతినశించెను. క్రోధకారణమున నాతఁడు దంతములతో నోష్ఠమును గొఱకుచుండెను. ఆతని ముఖారవిందము మ్లానమై ధూళి ధూసరితమయ్యెను. తూణీర మెచ్చటనో పడియుండెను. ఇంకొకచోట ఆతని భగ్నధనువు పడియుండెను. ఆతని ప్రాణములు శరీరమునువదలి పరలోక ప్రయాణమును గావించెను.

యూథపతి చంపబడఁగా నాడు యేనుఁగులన్నియు ఘీంకార మొనర్చునట్లు రాజుండు స్థితినిఁగాంచి రాణులందఱును నేడ్చుచుండిరి. ఆస్త్రీలు లజ్జను బరిత్యజించిరి. అసూర్యంపశ్యలుగ నున్నవారి నిప్పుడు సాధారణ సైనికులే చూచుచుండిరి. వారినేత్రములనుండి శ్రావణ భాద్రపదములలోని మేఘములవలె నశ్రువులు ధారగాఁగారుచుండెను, వారు మరణించిన మహారాజు చరణములను వక్షః స్థలమున ధరించి యేడ్చుచుండిరి. శిరస్సును బాదుకొనుచు నిట్లనుకొనుచుండరి :- "హా నాథా ! మేము మృత్యువు లేకయే చచ్చితిమి. హా ప్రాణనాథా ! హా ప్రాణనాథా ! నీవు మమ్ముల నందఱును బరిత్యజించి యొంటరిగ నెచ్చటికి బోయితివి ?

అత్యంత శోక కారణమున నశ్రువులు కపోలముల ద్వారా ప్రవహించు వక్షస్థలము మీఁదకు వచ్చి అచ్చట కుచ

కుంకుమారుణిమను వెంటఁగొనుచుఁ బ్రియతముని పాదపద్మములఁబడఁగాఁ దమ హృదయములలోని సుస్నిగ్ధానురాగముచేఁ బతిపాదములను బ్రక్షాళన మొనర్చుచున్నట్లుండెను.

వారేడ్చుచుండిరి. శోకమున నూగుచు దొరలుచుండిరి. మృతపతి శరీరము నాలింగన మొనర్చుకొనుచుండిరి. వారి ముసుఁగులు తొలఁగిపోయెను. కేశపాశము లస్తవ్యస్తము లయ్యెను. వానిలోఁదురుమఁబడిన మాలతీ కుసుమ మాల జారి పోయెను. వారి కన్నులకాటుక చెఱగిపోయెను. శరీరమంతటను రక్తమంటుకొనెను. వారు కురరీ పక్షులవలెఁ గరుణాక్రందన మొనర్చుచు నిట్లనుచుండిరి :- అయ్యో ! నిర్దయుఁడవగు ఓ విధాతా ! నీవేమి చేసితివయ్యా ? మా యెడల నిట్టి యన్యాయ మేల చేసితివి ? మేము మీకేమి చెరుపుచేసితిమి ? ఏ వైరము నకై మాకు ప్రతీకార మొనర్చితివి ? అసమయమున నీవు మా ప్రాణేశ్వరునకు దూర మొనర్చితివి. నిర్దయుఁడవగు నో దేవా ! నీకు దయకలుగుటలేదా ? అబలలమీఁద బలము జూపుటకు నీకు సిగ్గగుటలేదా ? మే మిప్పుడెవరి ఆశ్రయమున నుందుము ? ఎవరి కమల ముఖమును గాంచి జీవించెదము ?'

ఈ విధముగ విధాతనుపాలంభనము గావించుచు మరలఁదనపతిని సంబోధించుచు నిట్లనెను :- "స్వామీ ! ప్రాణనాథా ; జీవన సర్వస్వమా ! నీవు నీ ప్రజలను బుత్రుల వలెఁ బాలించితివి నీ వందఱకు వృత్తి దాతవును భయత్రాత వైతివి. భయభీతులమగు మమ్ముల నందఱను భయమునుండి

జరుగదు. కాని శోకకారణమున నా స్త్రీలు రాజు శరీరమును నే విధముగను పీడఁదలంపలేదు. అప్పుడు రాజుయొక్క సమస్త పరివారమును నత్యంత దుఃఖితులైరి.

వారందఱీ విధముగ దుఃఖితులగుటను గాంచి యెచ్చట నుండియో నాలుగైదు సంవత్సరముల బాలకుఁడచ్చటకు వచ్చెను. ఆతఁడు మురికివి, చినిఁగిన గుడ్డలను గట్టుకొని యుండెను. ఆతని ముఖమున మందహాసము చిందుచుండెను. చూచుటకాతఁడు మిక్కిలి తేజస్విగఁ దోఁచుచుండెను. రాజపత్నులును బంధు బాంధవులును నీ విధముగ శోకమగ్నులగుటను గాంచి ఆతఁడు తనలోఁదాను ఆకాశముతో మాటలాడుచున్నట్లు పలుకసాగెను.

ఆతఁడు పెద్దస్వరమున నిట్లనెను :- "భగవంతుని ప్రబల మాయ యెట్టిదో చూడుఁడు. ఏడ్చు స్త్రీ పురుషులు నాకంటె నెంత పెద్దవారోకదా ! ప్రతి దినమెందఱో చచ్చుచుఁ బుట్టుచుందురు. అయినను వీరికిఁదెలియలేదు. నేను బాలకుఁడనైనప్పటికిని, చిన్నవాఁడనైనను నాకు విశేషదుఃఖము కలుగుటలేదు. వీరి దయనీయ దశను గాంచఁగనే దయాకారణమున నాకు దుఃఖము కలుగుచున్నది. వీరందఱును ప్రపంచములోని జననమరణ రూపమగు గతిని నిరంతరము కాంచుచునే యున్నారు. చూచుచుండియును వీరంధులైయున్నారు.

మాయలోఁబడినారు. చింతించుట కింకేమున్నది ? సుయజ్ఞు డెల్లప్పుడిచ్చట నుండువాఁడుకాడు ఎచ్చటనుండియో వచ్చినాఁడు ఎచ్చటనుండి వచ్చినాఁడో అచ్చటకే పోయినాఁడు. దీనికొఱ కేడ్చుట వ్యర్థము. ఏడ్చువారైనను నిచ్చట నుండగలిగినచో నేడ్చుటలోఁ గొంచెమర్థముండును. వీరును జచ్చువారే ఏదో ఒక దినమున వీరందఱును జావవలసినవారే. వీరుత్రోవను బట్ట వలసినవారే ఇంకేడ్వవలసిన పనియేమున్నది ?"

హిరణ్యకశిపుఁ డిట్లనెను:_ "అమ్మా! ఆ బాలకుని వాక్య ములను శ్రద్ధతో వినుము. మఱదలా ! వినుచున్నావా ? నీవు కూడ వినుము నాయనలారా ! మీరుకూడ ఆ బాలకుని వచన ముల గూర్చి విచారించుఁడు. అతఁడెట్టి గూఢజ్ఞానమును జెప్పి నాఁడో చూడుఁడు. అన్నిటిని సావధానముగ వినుడు, విని మననము చేయుఁడు, అప్పుడు మీ శోకమోహములు విడివడఁ గలవు."

.... )o( ....

# అందఱకును రక్షకుఁడు శ్రీహరియే

౪౫-౨

శ్లో॥ అహో వయం ధన్యతమా యదత్ర
త్యక్తాః పితృభ్యాం నవిచిన్తయామః।
అభక్ష్యమాణా అబలా వృకాదిభిః
సరక్షితా రక్షతి యోహి గర్భే॥

--శ్రీ భాగ. ౩ స్కం ౨ అ. ౩౮ శ్లో.

క॥ జననీ జనకులఁ బాసియు
ఘనవృకముల బాధపడక గడుఁ ఖిన్నులమై
మనియెద మెవ్వఁడు గర్భం
బున మును పోషించె వాఁడె పోషకుఁడడవిన్॥

--శ్రీమదాంధ్రభాగవతము.

కాలముదుర్నివార్యమని చెప్పఁబడినది. మృత్యువు నెవరును దప్పించుకొనఁజాలరు. పుట్టుకతోడనే మృత్యువును నుత్పన్నమగును మృత్యుగడియ తల్లిగర్భమునుండి పుట్టినపుడే నిశ్చితమగును. వీని మృత్యువు ఫలానివానివలన ఫలాని స్థానమున ఫలానిసమయమున జరుగునని వయమాత ముఖమున వ్రాయును. వయమాత వ్రాసిన వ్రాలును దుడుప నెవ్వరికిని శక్యముకాదు. ఆమెయొక్క అళీకలిపికి విరుద్ధముగ నెవ్వరును

నేమియునుజేయఁజాలరు. విధిలేఖనమును దుడిపివేయఁగలవాఁడె వఁడున్నాడు. కాలము రాకున్నచో వాని నేవిధమునను నెవఁడును జంపఁజాలఁడు. వానికి విషమొసంగిననునది జీర్ణమై పోవును లేదా వమనమగును. విషధర సర్పము కఱచినను నెమియునుగాదు. పర్వతమునుండి క్రిందకుఁద్రోచినను జీవించును. వేలకొలఁది అస్త్రశస్త్రములఁ బ్రహారము కావింపఁబడినను నాఁతడు కుశలముగఁ దిరిగి రాఁగలఁడు. దీనిని విపరీతముగ సేపనికిఁగాలము సమీపించినదో ఆతడొక కంకరరాయిచేఁ జచ్చును, తుమ్ముతోఁడనే ప్రాణముపోవును. కూర్చుండఁగానే, పానీయమును గ్రహించఁగానే, మాటలాడుచుండఁగనే కదలుచుంటగనే హృదయగతి ఆగిపోవును. కావున నవశ్యంభావియగు మృత్యువునకు భయపడరాదు. మరణము సంభవించుట తప్పనిసరి పుట్టిన వాఁడేనాటికైనను గిట్టితీరును. ఆతఁడెట్టి యుపాయముల నొసరించినను నింకొక విధముగ జరుగఁజాలదు. దుర్నివార వస్తువునకై చింతించుట మూర్ఖత.

హిరణ్యకశిపుఁడు తన తల్లికిని, మఱదలకును, తమ్ముని కుమారులకును జెప్పుచునిట్లనెను ;- "సుయజ్ఞుని భార్యలు విలాప మొనర్చుచుండ నాబాలఁకుడు నవ్వుచు నిట్లనెను :- "ఇంత పెద్ద వయస్సు కలిగిన స్త్రీ పురుషులీవిధముగ ననాథల వలె నేడ్చుచున్నారు, వీరుకిల్లున్నది, ద్వారములున్నవి, ధనమున్నది పరివారమున్నది. ఇన్ని యున్నను వీరు తాము దుఃఖితులమనుకొనుచున్నారు. ఏలననగా వీరికి సంబంధించిన రాజు

మరణించినాఁడు. ఇప్పుడు చచ్చిన వాఁడేమో చచ్చినాడు. చచ్చినవాఁడు మరలఁ దిరిగిరాఁడు. కాలమాసన్నమైనవాని నెవరును రక్షింపఁజాలరు. కాలమాసన్నముకాకున్న వానినెవ రును జంపఁజాలరు.

నేనెచ్చటిదో దృష్టాంతమును దేనేల ? నేను నావిషయ మునే చెప్పెదను. నేనొక దరిద్రుని గృహమునఁ బుట్టితిని బాల్య కాలముననే నాతల్లిదండ్రులు నన్ననాథునిఁగాఁజేసి చచ్చిరి. నేన నాథుఁడను అసహాయుఁడనైతిని. మాబంధువు లెవరును నాకాశ్ర యమీయలేదు ఘోరారణ్యమునకు బోయి అదృష్టముపై నాధార పడి కూర్చుంటిని. నాకు మృత్యువుండినచో నాకెవరును సుఖము నొసంగి రక్షింపఁజాలరు. నాకు మృత్యువింకను సమీపింప కున్నచో నేనే విధముగను జావనని నిశ్చయించుకొంటిని. ఈ విశ్వాసముతో నేను స్వచ్ఛందముగ వనములందుఁ దిరుగు చుంటిని. ఉద్ధవునివద్ద గైకొనుటయునులేదు. మాధవుని కిచ్చుట యును లేదు. ప్రారబ్ధవశమున నేవి లభించునో దానినిఁ దిను చుంటిని. గంగలోని స్వచ్ఛ నిర్మల జలములను ద్రాగుచుంటిని చెట్లక్రిందఁబరుఁడు చుంటిని. నన్ను సింహములుగాని వ్యాఘ్ర ములుగాని తినెడివికావు. చిరుత వచ్చెడిదికాదు. తోడేలు వచ్చె డిదికాదు. ఎలుఁగుబంటు నాప్రక్కగనే పోయెడది, సర్పములు నాప్రక్కనే పరుండెడివి. ఏవియును గఱచెడివికావు. హాని చేసె డివికావు. ఏలననఁగా నాకింకను గాలము సమీపించలేదు. కాలము సమీపించినపుఁడు పెద్ద పెద్ద భవనములలోనున్నను

రక్షింపఁబడఁజాలను. ఏమానవుఁడును నెవరిని నేమియును జేయఁజాలడు. ఎవ్వఁడును బ్రతికింపఁజాలఁడు. ఈ సుయజ్ఞుఁడెన్నో యుద్ధములలో నెందఱనో పరాజితులఁ గావించెను. అప్పుడీతని నేమియును జేయఁజాలకపోయిరి, ఇప్పుడీతని మృత్యుసమయ మాసన్నమైనది. శత్రువులచేఁ జచ్చినాడు. దీనికి శోకసంతాపములు చెందవలసిన పనియేమున్నది ? చంద్రహాసునిఁ జంపుట కెన్ని ప్రయత్నములు జరిగినవి, కాని చావలేదు. పైఁగా భగవత్కృపచే నాతని వైభవము వృద్ధినిబొంది అనాథుఁడుగా నున్నవాఁడు రాజైనాఁడు.

ఈమాటను విని శౌనకుఁడిట్లనెను :- "మహాభాగా : చంద్రహాసుని శత్రువులేలఁ జంపఁదలఁచిరి? ఆతఁడెట్లు రక్షింపఁబడెను. ఈకథను వినవలయునని మాకు మిక్కిలి కోరిక కలదు.ఇది యుచితమనుకొన్నచో నీయుపాఖ్యానమును మాకుఁ జెప్పుఁడు."

శౌనకుని వాక్యములను విని సూతుఁడిట్లనెను :-"స్వామీ ! ఇది చాలా చక్కని రసయుక్తమైనదియును, శిక్షాప్రదమైన కథ. దీనిని మీకందఱకును జెప్పెదను సమాహితచిత్తులరై శ్రవణ మొనర్పుఁడు. ఒక గొప్ప ధర్మాత్ముఁడగు రాజుండెను. ఆతనికొక పుత్రుఁడుదయించెను. పుత్రుఁడు సర్వాంగ సుందరుఁడు. అతని ముఖమండలమును గాంచిన నత్యంత మనోహరముగనుండెడిది. ఆతని శరీరము హృష్ట పుష్టమైనది. సువర్ణముతో సమానమగురంగు. సర్వగుణ సంపన్నుఁడైనను నాతని

కొక దోషముకలదు. ఆతని కొకచేతికి అయిదు వ్రేళ్ళకు బదులుగా నాలు వ్రేళ్ళుండెను. జ్యోతిష్కులిట్లనిరి :- "మహారాజా! విశేషాంగములోనున్న బాలకుని వలన తల్లిదండ్రుల కష్టము కలుగును. వారివద్ద ధనము నిలువదు. కావున మీరీ పుత్రునిఁ బరిత్యజింపుఁడు."

రాజునకొక్కఁడే పుత్రుఁడు ఆతఁడును వృద్ధావస్థలో నుండెను. ఇట్టిసుందరపుత్రుని వారెట్లు పరిత్యజింపఁగలరు. ఆతఁడేమియును లక్ష్యపెట్టక మిక్కిలి ప్రేమతో లాలన పాలన మొనరించుచుండెను.

అన్ని సమయములొక్క రీతిగ నుండవు. సుఖముతరువాత దుఃఖమును, దుఃఖము తరువాత సుఖమును నీ విధముగ నీ చక్రము తిరుగుచుండును. ప్రపంచములో నందరును సుఖులుగను లేరు, దుఃఖితులుగను లేరు, ఇంతవఱకును రాజు సమస్త సుఖముల ననుభవించు చుండెను. తన పుత్రుఁడగు చంద్రహాసుని ప్రాణములకంటె నెక్కుడుగఁ బ్రేమించుచుండెను. ఆతనిపై హఠాత్తుగ శత్రురాజులు దండెత్తిరి. యుద్ధమున రాజు చచ్చెను. రాణి పతిమృత్యు సమాచారమును విని శరీర పరిత్యాగమును గావించెను. ఇప్పుడా కులమున కేవలము మాతృపితృవిహీనుఁడగు మూఁడు నాలుగేండ్ల కుఱ్ఱవాఁడు మిగిలెను. కుమారుని దాసి యాతనినిఁ బుత్రునికంటె నెక్కుడుగఁ బ్రేమించుచుండెడిది. ఇక నీ పిల్లవాఁడే మిగిలినాఁడు కావున శత్రువులీతనిఁ జంపుదురేమోనని మిక్కిలి కౌశలముగఁ కుమారుని

బొమ్మ; అతనిఁ బ్రార్థించునెడల నాతఁడవశ్య మాశ్రయమీయఁ గలఁడు".

దాసి యీ మాటనువిని దుష్టబుద్ధికడకుఁబోయెను. సంయోగవశమున మహామంత్రి ద్వారముననే నిలిచెను. దాసిపోయి దీన స్వరమున నేడ్చుచునిట్లనెను :- "అన్నదాతా! నేననాథను నిరాశ్రయను, అబలను, విపత్తునఁబడి అటు నిటుఁ దిరుగుచున్నాను. నాకు మూఁడు నాలుగేండ్ల బాలుఁడు కలఁడు. వీనినిఁ దీసికొని మీ శరణమునకు వచ్చితిని. నాకేదైన కూలి లభించినచో నీ బాలునిఁ బోషించుకొనఁగలను."

ఈ బాలుని అమాయకపు అందమైన ముఖము గాంచి మహామంత్రికి దయకలిగి యిట్లనెను :- "మంచిది, నీవిచ్చట భవనములోనుండి నీకు తోచిన కార్యమొనర్పుము. నీకు కావలసినవన్నియును లభింపఁగలవు."

దాసి మహామంత్రికి జయజయ శబ్దములొనర్చి, అతని భవనమునుండి చాకిరిచేయుచుండెను. చంద్రహాసున కాశ్రయము లభించెను. ఆతఁడు మహామంత్రియొక్క పిల్లలతో నాడుకొనుచుండెను. అచ్చట పనియేమియునులేదు. సుఖముగ దినములు గడుచుచుండెను.

ఎచ్చటికిఁబోయినను మనవ్రాత మనవెంటనే వచ్చును. అదృష్టవంతునకు సర్వత్రసుఖమే లభించుచుండును. కాని భాగ్యహీనుఁడు సుమేరు పర్వతము కడకుఁబోయినను రాయి

గానే కనబడును. చంద్రహాసుని దౌర్భాగ్యమున కంతులేకుండెను. ఒకటి రెండు సంవత్సరములైన తరువాత దాసియును నాతని ననాథునిగా నొనర్చి వదలి పరలోకమునకుఁబోయెను. ఇప్పుడన్ని విధములఁ జంద్రహాసుఁడు నిరాశ్రయుఁడయ్యెను. మానవుఁడన్ని విధముల నిరాశ్రయుఁడు కాఁగానే అప్పుడువానికి భగవంతుని స్మరణము కలుగును. భగవానుఁడు నిర్బలులకు బలము, నిర్ధనులకు ధనము, నిరాశ్రయుల కాశ్రయము. అన్ని విధముల నిరాశ్రయుఁడైనప్పుడు, తన పురుషార్థమును గోల్పోయినప్పుడు భగవత్కృప అనుభవమునకు వచ్చును. తనకీ ప్రపంచమున నెవరును లేరని చంద్రహాసుఁడును గ్రహించెను. ఇంక నేకమాత్రుఁడగు హరియే తనకు శరణమని భావించి ఆతఁడార్తస్వరమున నేకాంతమునం దేడ్చుచు భగవంతునిఁదలఁపసాగెను. సంయోగవశమున నా సమయమున నొక మహాత్ముఁడచ్చటికి వచ్చెను. ఈ బాలకుని అట్టి నిష్ఠనుగాంచి ఆతఁడీతని ననుగ్రహించెను. భగవన్నామోపదేశమును గావించి, పూజచేసికొనుటకొక సాలగ్రామ శిల నొసంగి యిట్లనెను:- "ఈతఁడు భగవానుఁడు. సదా యీతనిని స్నానము చేయించి చరణామృతమును గొనవలయును. ఈతనికి నివేదించి ప్రసాదమును గైకొనవలయును."

చంద్రహాసునకు నిధి లభించినట్లయ్యెను. భగవంతుని సాలగ్రామమును బొంది యాతఁడు పరమ ప్రసన్నుఁడయ్యెను. దానినుంచుట కాతనికొక స్థానములేదు. అందువలన నాతఁడు

భగవంతుని శ్రీ విగ్రహమును దన నోటనుంచుకొనెను. ఉదయ ముననే నదీతీరమునకుఁబోయి, నిత్యకర్మలను బూర్తికావించు కొని, నదిలో స్నానమొనర్చి, నోటినుండి సాలగ్రామమునుదీసి, స్నానముచేయించి, దానినుండి శుద్ధమృత్తికను దీసి తిలకమును బెట్టి, అచ్చట నరణ్యములో దొరకిన ఫలపుష్పములను దెచ్చి నివేదించి, పూజపూర్తిచేసి మరల నోటఁబెట్టుకొనెడువాఁడు. ప్రేమోద్రేకమున భగవన్నామమును గీర్తనము చేయుచుండెను. గద్గద కంఠముతోఁ బ్రభుని స్తుతి కావించుచు ధ్యానమగ్నుఁడై తన్మయుఁడగును. ఇంటికి రాఁగానే ఆతఁడు మంత్రియొసంగు ప్రసాదమును ముందు దేవునికినివేదించి, దానిని ప్రభుప్రసాద ముగా భావించి ప్రేమపూర్వకముగ గ్రహించుచుండెడువాఁడు. ఈ విధముగ నాతఁడు నిరంతరము భగవద్ధ్యానమునను, భగవ త్పరి చర్యయందును నిమగ్నుఁడయ్యెడు వాఁడు. మహామంత్రి యగు దుష్టబుద్ధికి రెండుమూఁడు సంవత్సరములపుత్రికకలదు. ఆమెపేరు విషయ. ఆమె అతి చక్కనిది, మహామంత్రికి ఆమె యందు మహాప్రేమ ఏకైకపుత్రిక యగుటచే నామె నాతఁడు ప్రాణము కంటె నెక్కుడుగఁ బ్రేమించెడువాఁడు. పిల్ల మిక్కిలి అమాయక, చంచల, అమిత తెలివికలది. ఆమెను జూచిన వారెల్లరునునామెను బ్రేమతో వడిలోనికిఁ దీసికొని ముద్దుపెట్టు కొనెడువాఁరు ఆ పిల్ల చంద్రహాసునితో నాడుకొనుచుండెడిది. చంద్రహాసుఁ డాఱేడేండ్లవాఁడు. పిల్ల రెండుమూఁడేండ్లది. ఇద్ద రును బరస్పర మొకరి నొకరు ప్రేమించుకొను చుండెడువారు.

ఒకానొకదినము మహామంత్రి యింటనేదో మహోత్సవము జరిగెను. దూరదూరములనుండి సాధుమహాత్ములును, బ్రాహ్మణులును ఉత్సవమునకు వచ్చిరి. మహామంత్రి వారికందఱకును స్వాగత సత్కారములనొనర్చి మిక్కిలి వైభవముగ నుత్సవమును జరుపుచుండెను. ఆ యుత్సవమందు మహామంత్రి తన చిన్నకుమార్తెను దీసికొనిపోయి మహాత్ముల చరణములపైఁబడవైచి యిట్లనెను :- "మహాత్ములారా ! ఈమెనాకు ప్రాణాధికమైన పుత్రిక, మీరు సర్వజ్ఞులు. ఈమె అదృష్టమెట్లున్నదో మీరు చెప్పుఁడు. ఈమెకు మంచి మగఁడు చిక్కునా ?

మహామంత్రి మహాత్ముల నిట్లడుగుచున్నప్పుడు చంద్రహాసుఁడును నచ్చటనే కూర్చుండెను. ఆ సాధువులలో నొక వృద్ధసాధువా పిల్లచేతినిఁజూచుచుండెను. హఠాత్తుగా నాతని దృష్టి చంద్రహాసుని తేజోముఖమండలముల పైఁబడెను. ఆతఁడు బాలకుఁడగు చంద్రహాసునిఁదనసమీపమునకుఁబిలిచెను. ఆతని అవయవ లక్షణముల నన్నిటిని గాంచి మహామంత్రితో నిట్లనెను :- మంత్రివర్యా ! మీరన్యథా తలంపకున్నచో నొకమాటను చెప్పెదను ?"

మంత్రి మిక్కిలి యుల్లాసముతో నిట్లనెను :- "లేదు స్వామీ ! ఇందన్యథా తలంచుటకేమున్నది ? మీరు చెప్పదలచినదేమో నిస్సంకోచముగఁజెప్పుడు."

అంత వృద్ధసాధువిట్లనెను :- మంత్రివర్యా ! ఈ బాలకుఁడతి పరాక్రమశాలి. భవిష్యత్తులో నీతఁడే మీకు యజమాని

కాఁగలడు. ఈతఁడే మీ పిల్లకు మగఁడుకాఁగలడు. కావున నీతనిని శ్రద్ధాభక్తులతోఁబోషింపుఁడు.

ఇది వినఁగా దుష్టబుద్ధికి లోలోన మిక్కిలి క్రోధము కలిగెను. ఆతఁడిట్లనెను :- "ఇది నాకు చాల యవమానము. నా పుత్రికనేదో రాజకుమారున కీయవలయుననుకొన్నాను. ఈ యనాథుఁడగు దాసీ పుత్రుఁడు నాకల్లుఁడగునని నాకు స్వామి యగు ననియు మునిచెప్పుచున్నాఁడు. నేనట్లెన్నటికినిఁగానీయను ఇదినాకు చాలా యవమానకరమైన విషయము. నేఁటివఱకు నాకుదాసుఁడై, నేనొసంగిన ముద్దను దిని బ్రతికినవానికి నా కుమార్తె నెట్లీయగలను. నేనీతని పాదములఁబూజించుటెట్లు ? ఏ విధముగనీతని కధీనుఁడనై యీతని యాజ్ఞలను పాలింపఁ గలను. ఋషులేదో ఆలోచించియుండవచ్చును. ఇప్పుడితఁడు నాయధీనముననున్నాడు. ఇప్పుడే యీతని నేనేలఁజంపరాదు. మూలచ్ఛేద మొనర్చినచో శాఖాపత్రాదులెట్లుద్భవింపఁగలవు ? వీఁడసలు లేకున్నచో నాకల్లుడును, రాజును నెట్లుకాఁగలడు. అని యిట్లాలోచించుకొని, ఆతఁడు తనభావములను దాఁచుకొని యిట్లనెను :- స్వామీ ! దైవగతి విలక్షణమైనది. క్షణములో నేమి జరుగునో యెవ్వరికినిఁదెలియదు. ఎట్లుజరుగుచున్నదో అట్లు జరుగఁగలదు." అనివలికి ఆతఁడు తన పుత్రికను వడి లోనికిఁదీసికొని లోపలికిఁబోయెను. ఇచ్చట ఉత్సవమును సమాప్తమయ్యెను. సాధు మహాత్ములు తమతమ స్థానములకుఁ బోయిరి.

మఱునాఁడు మహామంత్రియగు దుష్టబుద్ధి తలారులను బిలిచి యిట్లనెను :- "మీరీ నీచ దాసీపుత్రుని ఘోరారణ్యము నకుఁ గొనిబోయి, వీనిని వధించి నదిలోఁ బారవేయుఁడు. ఈ పనినిఁ జాల జాగ్రత్తగ నొనర్పవలయును, ఈ సంగతి యెవ్వరికినిఁ దెలియరాదు."

తలారులు చేతులు జోడించుకొని మహామంత్రి ఆజ్ఞలను శిరసా వహించిరి. ప్రొద్దు క్రుంకగాఁగానే వారా పిల్ల వానినిఁ బట్టుకొని అడవికిఁ గొనిపోయిరి. ఉజ్జ్వల రాత్రియందు ఒక సఘన వనమందు వధ్య శిలపైఁ జంద్రహాసునిఁ గూర్చుండఁబెట్టిరి. వారు తళతళలాడు ఖడ్గమును దీసి చంద్రహాసునితో నిట్లనిరి :- ఓయీ ! పిల్లవాఁడా ! ఇప్పుడు నీవేమి చేయఁదలచితివో దానినిఁ జేసికొనుము. ఇప్పుడు మేము నీ శిరస్సును దెగఁ గొట్టెదము."

చంద్రహాసుఁడాశ్చర్యముతో నిట్లడిగెను :- "నాయన లారా : మీరు నన్నేలఁ జంప జూచుచున్నారు ? నేను మీకేమి హాని చేసితిని ?"

అంత నొకతలారి యిట్లనెను :- నీవు మాకేమియును హానిచేయలేదు; కాని ఇది మహామంత్రియాజ్ఞ, మేమాతని కఠీను లము మాపని హత్యలొనర్చుట, ఎవరినిఁ జంపుమని యాజ్ఞ వచ్చునో వారినిఁ జంపెదము."

అంత జంద్రహాసుఁ డిట్లనెను;- "మంచిది, సోదరులారా! మీరు నన్నుఁ జంపదలఁచుచో నొక్క ముహూర్తమాగుఁడు,

నేను నా భగవంతుని గూర్చి పూజాస్తుతులొనర్చుకొందును. అప్పుడు మీరిష్టమువచ్చినట్లు చంపవచ్చును."

అంత నొక యువకుఁడగు తలారి యిట్లనెను :- "మేమంత సేపుండఁజాలము."

ఇది విని వారందఱలో శ్రేష్ఠుఁడైనవాఁడును, నాయకుఁడును నిట్లనెను :- "భగవత్పూజ చేయఁదలఁచుచున్నాఁడు చేసికొన నిమ్ము. మన కింకొక పనియేమున్నది ?"

నాయకుని మాటలువిని అందఱును మెదలకుండిరి. దగ్గఱనే ఒక జలప్రవాహముండెను. చంద్రహాసుఁడు స్నాన మొనర్చెను. నోటినుండి సాలగ్రామమును దీసెను. విధ్యుక్త ముగఁ బూజించి, కన్నులను మూసికొని అతఁడత్యంత కరుణా భరిత వాక్కులతో భగవంతుని స్తుతింపసాగెను. అది అతని యంతిమ స్తుతియని గ్రహించెను. అందువలన నాతనికేడ్పు వచ్చెను. ఇష్టము లేకున్నను రెండు నేత్రములనుండి రెండ శ్రుధారలు ప్రవహించుచుండెను. గద్గదకంఠముతో నాతఁడు మమతాభరితవాక్కులతోఁ ప్రభువును బ్రార్థించెను. ఆతని కరుణాక్రందనము చేతను, ప్రేమోద్రేకమునను జాళ్ళును కఱిగి పోయెను. వాయుగతి ఆగిపోయెను. ప్రకృతి స్తబ్ధమయ్యెను. తలారుల మనస్సులలోను దయ యుత్పన్నమయ్యెను వారిట్లను కొనిరి :- "మహామంత్రి కుసుమపేశల శరీరుఁడగు నీబాలకుని నేలఁ జంపఁదలఁచినాఁడో, ఈతఁడెవరికేమి అపకారమొనర్చి నాఁడు ? పాప మమాయకపు బాలుఁడు. ఈతనికి భగవంతు

నిపై నెంతటి యనురాగము. ఈతని నిర్మలబుద్ధి యెట్టిది. భగవంతునిపై నెంతటిభక్తి. నిరపరాధియగు నీతని మనమేలఁ జంపవలయును ?"

తలారు లిట్లాలోచించునంతలోఁ జంద్రహాసుఁడు స్తుతినిఁ బూర్తికావించుకొని తలారుల కడకువచ్చి. తన అమాయకపు పలుకులతో వినయపూర్వకముగ నిట్లనెను :- "నాయనలారా ! ఇప్పుడు మీరు నన్నుఁజంపవచ్చును ?"

ఇది విని యావృద్ధుఁడగు తలారి యిట్లనెను:- నాయనా! మహామంత్రికి నీవే యపరాధ మొనర్చితివి. ఆతఁడు నిన్నేలఁ జంపదలఁచినాడు."

చంద్రహాసుఁడిట్లనెను :- "అయ్యో ! నాకేమియును దెలియదు. ఆతఁడు నన్నేలఁ జంపఁదలఁచినాడు. ఆతఁడు నన్నెల్లప్పుడును బుత్రునివలెఁ జూచెడువాఁడు."

అంత వృద్ధతలారి యిట్లనెను :- "అబ్బాయీ ! నీవు పొరపాటున నైనను మరల మహామంత్రికడకు బోకున్నచో నిన్నువదలి వైచెదము. ఇది నీకిష్టమేనా ? చెప్పుము."

చంద్రహాసుఁ డిట్లనెను :- "నేనాతనికడకు వెళ్ళు పనియేమున్నది ? ఇప్పుడు నే నేకాంతమున నడవులలో దిరిగెదను. భగవద్భజన మొనర్చుకొందును."

చంద్రహాసుని సరళత్వమును, సుకుమారతను గాంచి జాలిపడి తలారులు వానినిఁ జంప సాహసింపలేదు. వారిమనస్సులలోఁగూడ దయా సంచారము కలిగెను. చిహ్నమును గొని

పోవుటకై వారతని ఆరవ వ్రేలిని దెగఁగొట్టగా బాలకుఁడచేత నుఁడై క్రిందఁబడిపోయెను. ఆతని నాస్థితిలోనే వదలి తలారులు నగరమునకుఁబోయిరి. చంద్రహాసుఁడచ్చటనే అచేతనుఁడై పడి యుండెను. మహామంత్రి సమీపమునకుఁబోయి బధికులిట్లు నివే దించిరి :- "అయ్యా ! మేము మీయాజ్ఞనుసారముగ నాపిల్లవాని నిజంపి వచ్చితిమి. గుర్తుగా నాతని ఆఱవవ్రేలిని నఱకి తెచ్చితిమి.

మహామంత్రికి ఇదివినఁగానే చాల సంతోషమయ్యెను. ఆతడు సందేహింపవలసిన పనిలేకుండెను. తలారులు తనయా జ్ఞనుల్లంఘింపఁజాలరని ఆతని యూహ. అందువలన నాతని శత్రువు చంపఁబడెనని ఆతఁడనుకొనెను. ఆతని వధా వృత్తాంత మును వినఁగానే ఆతఁడు నిశ్చింతుఁడయ్యెను. భగవంతుడు రక్షించినవారి నాపగలవారెవరును లేరు. దైవగతిని దమ ప్రయత్నమునమార్చఁగల వారెవరును లేరు. చంద్రహాసుని అశుభ లక్షణములుపోసాగెను. ఆఱవవ్రేలు తెగఁగొట్టఁబడఁ గానే ఆతనికి భాగ్యోదయసమయ మాసన్నమయ్యెను. ఆతఁడు ఘోరారణ్యమున నొంటరిగ నచేతనస్థితిలోఁ బడియుండెను. చాలాపక్షులు తమ రెక్కలను విప్పుకొని ఆతనికి నీడను బట్టు చుండెను. అదేసమయమున దైవయోగముచే వేటకై కుళింద నరేశుఁడచ్చటికి వచ్చెను.

ఒకానొక మృగమును వెన్నంటి ఆతఁడు తన సైనికుల కును, సహచరులకును దూరమయ్యెను. అందువలన నాతఁడొం టరి వాఁడయ్యెను, ఘోరారణ్యమున మిక్కిలి సుందరసుకు మార కుమారుని చుట్టును పశులుండుట నాతఁడు కాంచెను. పశులు తమ ఱెక్కలచే ఛాయఁను బట్టుచుంచెను. రాజా బాల కుని తేజమునుగాంచి స్తంభితుఁడయ్యెను. ఆతఁడిట్లకొనెను :- బాల్యకాలమందే యీతని కిట్టి ప్రభావముండినఁ బెద్దవాఁడైన తరువాత నీతడేమేమి యొనర్చునో."

కుళిందనరేశుఁడు కుంతల నరేశునకు సామంతరాజు, ఆతనికి సంతానము లేదు. అరణ్యమున నీబాలకునిఁ జూడగానే ఆతనిచిత్త మీతనివైపునకు స్వతః ఆకర్షింపబడెను. ఎప్పుడెట్లు జరుగవలసి యున్నదో అప్పుడు వారికట్టి బుద్ధిపుట్టు చుండును. చంద్రహాసున కిప్పుడభ్యుదయ సమయ మాసన్న మయ్యెను. రాజాతని మిక్కిలి సత్కారముతో దన యింటికిఁ గొనిపోయెను. రాణి యిట్టి లావణ్యయుక్తుడగు సుందర సుకు మార కుమారునిఁ గుమారునిగాఁ బొంది పరమ ప్రసన్నురాల య్యెను. ఇద్దరు నాతని తమకు దత్తపుత్రునిఁగా నొనర్చుకొనిరి. ప్రజలందరును నానందోత్సవము నొనర్చుకొనిరి. రాజునకును రాణికిని ఆనందమునకు మేఱలేకుండెను. రాజభవనమున నుండి చంద్రహాసుఁడు శుక్లపక్ష క్షపాకరునివలె దినదిన ప్రవర్ధమాన మగు చుండెను. ఆతఁడు బాల్యకాలమునుండియు సాధుసేవ కుడును భగవద్భక్తుఁడునై యుండెను. అందువలన నాతనికి

సర్వత్రఖ్యాతి లభించెను. నలుదిశలన్నను సాధు మహాత్ములును, పండిత గణమును వచ్చి ఆతనికి దర్శనమొసంగుచుండిరి. ఆతఁడు తను మన ధనములచే నందఱకును యథాచితసేవ లొనర్చు చుండెను. ఇంకేమున్నది? ఇప్పుడు సర్వదా సాధుసజ్జన బృందము వచ్చుచుండెడిది. సర్వత్ర కథాకీర్తనము జరుగుచుండెడిది. నిత్యము ఉత్సవములు జరుగుచుండెడిది.

కుళిందనరేశుఁడు తన కుమారుని యీ వ్యవహారమున కుబ్బిపోవుచుండెను. చంద్రహాసుఁడెంతగా వ్యయము చేయుచుండిన నరేశుఁడంతగా సంతసించుచుండెను. ఈ కారణమునఁ కుళింద నరేశుని నుండి కప్పము రాలేదు.

ఒక దినమున మహామంత్రియగు దుష్టబుద్ధి రాజుతో నిట్లనెను. "ప్రభూ ! మన సామంత రాజులందఱును నియత సమయమునకు పన్నులను బంపుచున్నారు. కాని కుళింద నరేశుఁడిప్పటికి చాలా సంవత్సరములనుండి కప్పమునుబంపుట లేదు. ఆజ్ఞయైనచో నాతనిపై దండెత్తి ఆతని బంధించి తెచ్చెదను. నాకుమార్తెయు నిప్పుడు పెద్దదైనది. అచ్చటి నుండి నేను యోగ్యుఁడైన వరుని వెదకి తెచ్చెదను."

నేఁడు కుళింద నరేశుఁడు మిక్కిలి దానపుణ్యము లొనర్చుచున్నాఁడనియు, నొకానొక పుత్రుని దత్తుగాఁదీసికొనినాఁడనియు ఆతఁడు వినియుండెను. ఆతఁడు ధర్మాత్ముఁడైయుండెను. అందువలన నాతఁడు ప్రధానమంత్రితో నిట్లనెను :- "మంత్రీ ! ఏదైన వ్యసనములోఁబడి కప్ప మీయకుండిన

నాతనిపై దండెత్తుట యుచితముగాని ఆతఁడు సాధుసేవ లొనర్చుచున్నాఁడు. కావున నీవు సేనను గైకొని ఆతని రాజధానిని ముట్టడించుము. కేవలము భయపెట్టి, అదరఁగొట్టి కొద్దియో గొప్పయో కప్పమును దెమ్ము, ఆతని కేమియును హానిచేయవలదు. రాజు ఒకరాజకుమారునిఁ బెంచుకొనినాఁడని వినియుంటిని ఆఁతడు యోగ్యుఁడగుచో నాతనిని యువరాజుగా నొనర్చి, ఆతఁడు మన అమ్మాయికి యోగ్యుఁడగు వరుఁడగుచో మనస్సులోఁ బెట్టుకొనుము."

రాజాజ్ఞను బొంది దుష్టబుద్ధి చతురంగసేనను దీసికొని కుళింద దేశరాజధానిపై దండెత్తి, రాజుయొక్క కోటను ముట్టడించి రణభేరిని మ్రోగించెను.

కుళింద నరేశుఁ డిదియును కొనుచునే యున్నాఁడు. దుష్టబుద్ధి యెంతటి క్రూరమంత్రియైనదియు, ఆతఁడు యుద్ధమొనర్చినఁ దాను జయింపఁజాలననియుఁ దెలిసికొని, చంద్రహాసుని చేఁజాల కానుకలను దుష్టబుద్ధి సమీపమునకుఁ బంపెను. తన యపరాధమును మన్నింపుమనెను.

దుష్టబుద్ధి కోరుకొనుచున్నదియు నిదియే యుద్ధమొనర్చుటకు ఆతనికి రాజాజ్ఞ లేదు. కుళింద నరేశుని యీ వ్యవహారముచే నాతఁడానందమును జెందెను. చంద్రహాసునిఁ జూడఁగానే ఆతఁడాశ్చర్యమును జెందెను. ఈ కుఱ్ఱవాఁడాతఁడేనా యని యాతనికి సందేహము కలుగుచుండెను. పండ్రెండు సంవత్సరముల చంద్రహాసుఁడిప్పుడు పదునెనిమిదేండ్ల వాఁడయ్యెను.

ఆతని యాకృతియును మారిపోయెను. మహామంత్రి రాజును బిలిచి మిక్కిలి ప్రీతితో నిట్లనెను :- రాజా నేను నిన్ను బెదరించితిని. నీవు చాల సంవత్సరముల నుండి కప్పమును గట్టలేదు. అస్తు, ఫరవాలేదు, ఇప్పుడు నీవెంత యీయగలవో యిమ్ము, మిగిలిన దానికి నేను మహారాజుతోఁజెప్పి క్షమింపఁజేసెదను. నీవీ కుమారుని నెచ్చటనుండి దత్తత తెచ్చుకొన్నావు?"

మంత్రియడుగఁగా రాజిట్లు సత్యమునే చెప్పెను :- "నేను వేటకుబోఁగా నచ్చట పక్షుల చేఁ జుట్టుకొనఁబడిన యీ పిల్లవాఁడు కనఁబడినాఁడు. ఈతని కొక వ్రేలు ఖండింపఁబడినది. దానినుండి రక్తము కారుచుండెను. నే నీతనిఁ దెచ్చుకొంటిని. పిల్లవాఁడు కులీనుఁడు, తెలివిగలవాఁడు. నే నీతని దత్తపుత్రునిఁగాఁ గైకొంటిని ఇప్పుడు మీరు మహారాజునకుఁ జెప్పి వీనిని యువరాజుగాఁ జేసికొనుఁడు. ఈ రాజ్యమున కధికారిగా నొనర్పుఁడు."

దుష్టబుద్ధి యిదివిని లోలోన మండిపడిపోవుచుండెను. ఆతని ఈర్ష్య మరల జాగృతి చెందెను. ఈ దుష్టుని నేదోవిధమునఁ జంపింపవలయునని ఆతఁడు మనస్సున నిశ్చయించుకొనెను. ఇప్పుడు బహిరంగముగఁ జంపుటెట్లు? అందువలన నాతఁడు తనమనోగతభావములను దాచుకొని, పైకి యానందమును బ్రకటించుచు నిట్లనెను:- "మంచిది, బాలకుఁడు మిక్కిలి సుశీలుఁడుఁ యోగ్యుఁడుఁ తెలివిగల వాడు. నేను నా పుత్రుని

పేరనొక లేఖ నొసంగెదను. దీనినిఁ దీసికొని యాతఁడొంటరి గఁ బోవలయును. అచ్చట నా పుత్రుఁడీతని మహారాజు దగ్గఱకు గొనిపోఁగలఁడు. మహారాజీతని యువరాజుగా నంగీకరించి, బహుశః సామంతరాజునుండి స్వతంత్ర రాజుగఁ జేయగలఁడు"

పాపమా యమాయకపురాజునకు మంత్రి కపటమేమి యును దెలియదు. ఆతఁడీ విషయమును సహర్షముగ స్వీకరించెను. మంత్రి తన పుత్రునిపేర నొక గుప్త పత్రమును లిఖించెను. దానిలో నీ శ్లోక మొకటియే యుండెను.

శ్లో॥ విషమస్మై ప్రదాతవ్యం త్వయా మదన శత్రవే।
కార్యా కార్యం నకర్తవ్యం కర్తవ్యం కిల మే ప్రియమ్॥

దీని యర్థమిది....పుత్రా! మదనా! నీవీ శత్రువునకు వెంటనే విషము నొసంగవలయును. ఈ సమయమున నీయఁ గూడదని నీవు కర్తవ్యాకర్తవ్య విచార మొనర్పరాదు. నీవు నాయీ ప్రియకార్యము నవశ్యముచేసి తీరవలయును."

ఈ విధముగఁ పత్రమును లిఖించి సంచిలోఁబెట్టిబిగించి, దానిపై సీలుముద్రవైచి, దానిమీఁద మదనుని పేరును లిఖించి చంద్రహాసున కొసంగి యిట్లనెను:- "నీవు ప్రాతఃకాలముననే లేచి పోయి మధ్యాహ్నమున కచ్చటికిఁ జేరవలయును. నా పుత్రుఁడు నిన్ను పొమ్మను వఱకచ్చటనే యుండుము. తిరిగి రాఁగూడదు."

మహామంత్రి వాక్యములను విని రాజోచిత వస్త్రాలంకారము నలంకరించుకొని, సుందరశ్వేతాశ్వమునెక్కి కుంతలపురమునకుఁబోయెను. ఆతఁడు స్వాభావికముగనే సుందరుఁడు. పైఁగా నేఁడాతఁడు రాజదర్బారునకు బోవుటకైఁ చక్కఁగనలంకరించుకొనెను. యువావస్థలోని లావణ్యమాతని ముఖమండలమునుండి వెల్లి విఱియుచుండెను. ఆతఁడు మన్మథుఁడున్నట్లుండెను. ఆతని యంగప్రత్యంగములనుండి సౌందర్యముట్టిపడుచుండెను. ఆతఁడు మూర్తీభవించిన సౌందర్యమా యను నట్లుండెను. పోగా పోగా నాతనికి రెండు జాములయ్యెను. ఎండాకాలము, మార్గశ్రమచేనాతఁడు శ్రమితుఁడయ్యెను. దప్పికయును వేయుచుండెను. సమీపముననే ఆతనికొక పుష్పవాటిక కనఁబడెను. అచ్చట స్వచ్ఛజలముతో నిండిన నొక సరోవరమును నుండెను. ఒక పెద్ద చెట్టుమానుకు తన గుఱ్ఱమును గట్టెను. సరోవరములోనికి దిగి, చేతులు కాళ్ళు కడుగుకొని, పొట్టనిండ నీళ్లు త్రావి, అచ్చట సమీపముననే ఒక వృక్షము క్రింద విశ్రాంతి కొఱకు పరుండెను. మార్గమున నలయుటచేఁ బరుండఁగానే గాఢనిద్ర పట్టుటచే నచ్చటనే నిద్రపోయెను.

విషయకు పదునాలుగు సంవత్సరములు దాటి పదునైదవ సంవత్సరములోఁ బ్రవేశించెను. యౌవనముతోఁబాటు వయ్యారము కూడ హెచ్చెను. ఆమె సిగ్గు బిడియములు కలదైనప్పటికిని నొక అవ్యక్త ప్రేరణముచే నాడుట కారంభించెను. ఆమె లక్ష్యపెట్టని వైఖరిలో మాదకతకలదు. నేత్రములలోఁ

జంచలత యినుమడించెను హృదయము నెవరికొఱకో తట పటలాడుచుండెను. అంతఃకరణము నుండి యేదో అవ్యక్తమగు మనోవేదన వెలువడుచుండెను. అది ఆమె అంగప్రత్యంగము లనుండి ఒక విధమగు వణఁకు నుత్పన్నము కావించుచుండెను. మన్మథునిఁ దిరస్కరించుచు సాకారసౌందర్య స్వరూపుఁడైన యాయువకుఁడు శయ్యలేకయే వృక్షఛాయలో భూమిపైఁబరుండి యుండుటను నామె కాంచెను. కరుణా, స్నేహోత్సుకతాది భావము లొక్కసారిగా నుదయింప సంకల్పము లేకయే ఆమె ఆతని సమీపమునకు వచ్చెను.

యువకుఁడు గాఢనిద్రలో నిద్రించుచుండెను. పూర్ణచంద్రునిలో రెండు కమలములు ముకుళించినట్లుండెను. ఆతని యంగ ప్రత్యంగములనుండి సౌందర్యకిరణములు బయలుదేరి ఆ పుష్పవాటికను బ్రకాశింపఁ జేయుచుండెను. తన సౌందర్య సుధను రహస్యముగ నెవరు నిశ్చింతతోఁ బానమొనర్చు చుండిరో ఆయువకున కేమియునుదెలియదు. ఆతని ముఖమండ లమును జూచుచుండఁగా విషయయొక్క దృష్టి ఆతని పాగాలో ముడుచుకొనిన నొక పత్రముపైఁబడెను. అట్లే కుతూహలవశ మున నామె మెల్లమెల్లఁగా నా పత్రమును దెఱచెను. చూడఁగా నామెకు మహాశ్చర్యము కలిగెను. దానిమీఁద ఆమె తండ్రిగారి అంగుళీయకపు ముద్రయుండెను.

వెళ్ళుటకుఁబూర్వము దుష్టబుద్ధి తన భార్యతో విషయ పెద్దదైనది. యీ సంవత్సరము పెండ్లిచేసి తీరవలయును. నేను

కళింగదేశము వైపునకుఁబోవుచున్నాను. అచ్చట నెవఁడైన యోగ్యుడగు వరుఁడులభించినచో నిశ్చయముచేసికొని వచ్చెద నని చెప్పిపోయెను. తల్లితండ్రులీమాటలనుకొనునప్పుడు విషయ దాగి అ మాటలనన్నిటిని వినుచున్నాను. తన తండ్రి ముద్రను గాంచఁగానే ఆమెకా సంగతులన్నియును స్మరణము నకు వచ్చెను. ఇప్పుడామె యుత్సాహమినుమడించెను. తండ్రి గారు నాకే వరుని నిర్ణయించి నాఁడు? నాకొఱకీతనినే నాతండ్రి పంపియుండినచో నా జీవనము సఫలముకాఁగలదు. ఈతనిఁ దప్ప అన్యునితో నాకు సంబంధమును గుదిర్చియుండినచో నేని ప్పుడే రవ్వనుమ్రింగి ప్రాణత్యాగము గావించెదను."

ఇట్లనుకొనుచు నీమె మెల్ల మెల్లగా నా పత్రముయొక్క ఆవరణమును దెఱచెను. దానిలో నిట్లు వ్రాయఁబడియుండెను.

శ్లో॥ విషమస్మై ప్రదాతవ్యం త్వయా మదన శత్రవే।
కార్యాకార్యం నకర్తవ్యం కర్తవ్యం కిలమే ప్రియమ్॥

విషయ ఒక్కసారి చదివెను. రెండుసార్లుచదివెను. మూఁడుసార్లు చదివెను. తన తండ్రి యింతటి సుందరసుకుమా రుఁడగు నీతనికి విషమేల నొసంగదలఁచెనో ఆమెకుఁదెలియ లేదు. మరలనామెయిట్లనుకొనెను:- "ఒకవేళ వ్రాయుటలోఁబొర పడి యుండవచ్చును. అతఁడు 'విషయాస్మై ప్రదాతవ్యం త్వయా మదన శత్రవే' అని వ్రాయఁదలఁచియుండవచ్చును. తండ్రిగారి పొరపాటును నేను సవరించెదను; అనిభావించి ఆమె తనగోటితో

నేత్రములలోని కాటుకను దీసి 'మ' అను నక్షరమును 'యా' గా నొనర్చెను. మదన శత్రవే అను రెండు పదములను గలిపి సమాసాంతపదముగా నొనర్చెను ఇప్పుడు దాని యర్థ మిట్లయ్యెను....'మన్మథునిగూడ తన సౌందర్యముచేఁ దిరస్కరించు నీ యువకుని విషయకొసంగుము." అనఁగా విషయనిచ్చి యాతనికి వివాహ మొనర్పుమని అర్థము, ఇందు కర్తవ్యాకర్త వ్యవిచార మొనర్పవలదు. నా సంతోషముకొరకీ కార్యమును శీఘ్రముగ నొనర్పవలయును."

ఈ విధముగ వ్రాసి మరల యథాప్రకారముగఁగనఁబళ్లకుండ యువకుని పాగలో నుంచి అచ్చటినుండి వెడలిపోయెను. కొంచెము సేపటికి యువకుఁడు మేల్కాంచెను. అతఁడు గబ గబ లేచి గుఱ్ఱము నెక్కిపోయెను. ఇల్లాతనికిఁదెలియును. ఆతఁడు వెడలి మంత్రి పుత్రుఁడగు మదనునిఁగలిసికొనెను. చంద్రహాసుని రాజవేషమునఁ జూడఁగానే మదనునకు మిక్కిలి యానందము కలిగెను. మదనుఁడు సజ్జనుఁడు. ప్రేమగల వాఁడు. తనతండ్రి పంపిన పత్రమునుగాంచి మిక్కిలి యానందమును జెంది వెంటనే తన పురోహితునిఁబిలిచి విషయా వివాహ ముహూర్తము నడిగెను.

పురోహితుఁడిట్లనెను :- "రేపే సర్వశ్రేష్ఠమగు ముహూర్తము కలదు. మీతండ్రి యొక్క ఆజ్ఞ వెంటనే తనకుఁబ్రియమగు నీ కార్యమును జేయవలయుననిని, కావున వివాహము రేపే

జరగవలయును. ఉత్సవాదులు తరువాతఁ దండ్రిగారు వచ్చిన తరువాత జరుపవచ్చును."

మదనుఁడు కోరుకొనుచున్నదిదియే. ఆతఁడు వెంటనే అన్ని యేర్పాటులను గావించెను. మఱనాఁడతి వైభవముతో విషయకును జంద్రహాసునకును వివాహము జరిగెను.

చంద్రహాసుఁడు చచ్చియుండివచ్చునని మంత్రి అచ్చట ననుకొనుచుండెను. అందువలన నాతఁడు తన సేనను దీసికొని కుంతల పురమునకు వచ్చెను. మహామంత్రి నగరములోనికిఁ బ్రవేశించునప్పటికి సూత, మాగధ, వందీ భిక్షుక వేదజ్ఞులగు బ్రాహ్మణులు నాతనికి జయజయ కారములొనర్చి పుత్రికకు మంచి వరుఁడు లభించినందులకు స్వాగత మొసంగిరి.

దుష్టబుద్ధి ఆశ్చర్యచకితుఁడయ్యెను. తన పుత్రికకు వరుఁడెట్లు లభించెనని ఆశ్చర్యమును జెందెను. ఆతఁడు తన కుల పురోహితునితో నిట్లనెను :- "పురోహితా ! ఏమి జరిగినది ?"

పురోహితుఁడిట్లనెను :- "అన్నదాతా ! నిన్న మిక్కిలి వైభవముగ సౌభాగ్యవతియగు విషయకు పాణిగ్రహణ సంస్కారము జరిగినది. చిరంజీవియగు మదనుఁడందఱకును యథేష్టముగ దానదక్షిణల నొసంగెను. అందఱును నాతని యుదారతకు సంతోషించిరి. ఇది యంతయును మీపుణ్య ప్రతాపమే."

ఇదివిని ఆతడు కింకర్తవ్యతావిమూఢుఁడయ్యెను భవనము నఁ బ్రవేశింపగానే అందఱును బ్రణామము కావించిరి. చంద్ర హాసుడును తన నవ వధువగు విషయతోఁ దన శ్వశురుని

చరణములకుఁ బ్రణామ మొనరించుటకు దాసదాసీజనపరివేష్టితుఁడై వచ్చెను. దుష్టబుద్ధి పైకి యిద్దర నాశీర్వదించెను; కాని లోలోనఁ బ్రబలద్వేషాగ్ని ప్రజ్వలించుచుండెను. అతఁడు లోలోనఁ దన కూఁతురు విధవయైనను దన శత్రువునంతము కావింపవలయును. బ్రదుకనీయఁగూడదని నిశ్చయించుకొనెను.

ఇట్లాలోచించుకొని అతఁడు తలారులను బిలిచి యిట్లు చెప్పెను :- నేఁడు చీఁకటి పడిన తరువాత రాత్రియందు భద్ర కాళీ మందిరమునకుఁ బూజించుటకెవరు పళ్ళెరమును దీసికొని వచ్చెదరో వాని శిరస్సును దెగఁగొట్టవలయును."

తలారులు నౌకరులుకదా, వారంగీకరించిరి. ఇచ్చట దుష్టబుద్ధి చంద్రహాసునిఁ బిలిచి యిట్లనెను: "మాయింట నౌక లోకాచారముకలదు. వివాహము జరిగిన మఱునాఁడల్లుఁడు ఒంటరిగ భద్రకాళికడకుఁబోయి విధ్యుక్తముగఁ బూజింపవల ను. కావున నీవు సూర్యాస్తమానమయమైన తరువాత నెవ్వ రికినిఁ జెప్పకుండ భద్రకాళీ మందిరమునకుఁబోవలయును అచ్చట భద్రకాళినిఁబూజించి, కొంచెముసేపు స్తోత్రమొనర్చి రావలయును. చంద్రహాసుని మనసున కల్లకపట మేమాత్ర మును లేదు. సూర్యాస్తమానముకాఁగానే మెదలక మంత్రియొసం గిన పళ్లెరమును గైకొని ఒంటరిగ భద్రకాళి మందిరమునకు బోవుచుండెను. భద్రకాళీ మందిరము దూరముననరణ్యమునఁ గలదు అయినను. మంత్రియును గాలినడకన వెడలుచుండెను.

ఇచ్చటఁ గుంతల నరేశునికడకు కొందఱుపోయి మహా మంత్రి భాగ్యమునుగూర్చి పొగడి, చంద్రహాసుని శీలస్వభావము లను గూర్చియును, సౌందర్య, సరళతను గూర్చియును రాజుతో నధిక ప్రశంసతోఁజెప్పిరి. మంత్రిని తనకుమార్తె సంబంధము నకై పంపిన సంగతి రాజునకు జ్ఞాపకమునకు వచ్చెను. మా పిల్ల పెద్దదైనది నాకు పుత్రులెవరును లేరు. త్వరగా నీమెకు పెండ్లి యొనర్చి భగవద్భజనము చేసికొనవలయును. మంత్రి యింతవఱకు నాకడకు రానేలేదు. సరిగా నా సమయమునకే అచ్చటికి లోమశమహాముని వచ్చెను.

మునినిఁగాంచి మహారాజాతని స్వాగత సత్కారము లొనర్చెను. శాస్త్రీయవిధిచేఁ బూజ జరిగినమీదఁట, పరస్పరము కుశల ప్రశ్నలు జరిగెను. రాజు తన పుత్రికను బిలిపించి, ఆ ఋషి చరణములకుఁ బ్రణామ మొనరింపఁజేసి, చేతులు జోడించుకొని యిట్లనెను: "స్వామీ! నేను వృద్ధుఁడనైతిని, ఈ పుత్రిక ఒక్కతెయే నాకు సంతానము. ఎవడైన యోగ్యుఁడగు వరుఁడు లభించినచో నీమెను నాతనికొసంగి వివాహమొనర్చి, రాజ్యభారము నాతని కొప్పగించి భగవదారాధన మొనర్చుకొన వలయునని యున్నది. నా కెంతగా నాయుశ్శేషమున్నదో మీరు శలవీయవలయును."

సర్వజ్ఞుఁడగు ముని ధ్యానమునఁజూచి యిట్లనెను:- "రాజా! నీ ఆయుస్సు సమాప్తమైనది, ఇఁక రేపటివఱకే నీ కాయుస్సు కలదు.

ఇదివిని రాజు మిక్కిలి భయపడి, కింకర్తవ్యతా విమూఢుఁడై మిక్కిలి శోకముతో నిట్లనెను :- "స్వామీ ! నేనింత వఱకేమియును జేయలేదు. నా యీ బిడ్డకు తరువాత నెవరు వివాహము చేయఁగలరు. యోగ్యుఁడగు వరుని నెవరు వెదుకఁగలరు? ఇంతపెద్ద రాజ్యమును సంబాళించి కొనఁగలవారెవరు? ఇంత వఱకు నేను భగవద్భజనము జేయలేదు. సంసారసాగరమును దాటుట కేసాధనమును చేయలేదు. ఏమిచేయవలయునో యేమియును దోఁచుటలేదు.

అంత లోమశ మహాముని ధైర్యమునుజెప్పుచు నిట్లనెను: "రాజా! నీవు చింతింపకుము, భక్తభయహారియగు వాసుదేవుఁడందఱకును మేలొనఁగూర్పఁగలఁడు. ఆతడేర్పఱచిన విధానమన్యథాకాఁబోదు. నీ రాజ్యమున కధికారియును, నీ యీకన్యకనురూపుఁడునగు వాఁడీ రాజధానికి స్వయముగ వచ్చియే యున్నాఁడు. మహామంత్రి పుత్రికను వివాహముచేసికొనిన చంద్రహాసుఁడే నీ కన్యకకు భవిష్యత్తులోఁ బతికాఁగలఁడు. ఆతని తోడనే నీ పిల్లకు వివాహము జరుగును. ఈ రాజ్యభారమును నాతఁడే వహింపఁగలఁడు. ఆతఁడు సర్వవిధముల నీమెకుఁదగినవాఁడు. ఇప్పుడు మంచి శుభలగ్నము, వెంటనేపిలిపించి ఆతనికి వివాహమొనర్పుఁడు లగ్నమును జారవిడువరాదు. రాజ్యాభిషేకమును రేపు ప్రొద్దున చేయవచ్చును."

ఇది వినఁగానే రాజుయొక్క ఆనందమునకు మేఱలేకుండెను. మంత్రి పుత్రుఁడగు మదనుఁడు రాజు సమీపముననే

కూర్చుండి యుండెను. మంత్రి తిరిగివచ్చిన సంగతి మదనునకు దెలియదు, రాజునకును దెలియదు. అందువలన రాజుమదనునితో నిట్లనెను:- "నీ విప్పుడే త్వరగాఁబోగల రథమును గైకొనిపోయి నీ బావమఱఁదినిఁ బిలుచుకొని రమ్ము. ఈ లోగా నేను గన్యాదాన సామగ్రిని సమకూర్చెదను. జాగ్రత్త, లగ్నము దాటనీయకుము."

మహారాజాజ్ఞను బొందగానే మదనుని హర్షమునకు మేఱ లేకుండెను. ఆతఁడిట్లనెను :- "ఇప్పుడు రాజ్యము మాయింటిలోనికే వచ్చినది." ఇట్లాలోచించుకొని ఆతఁడు త్వరగాఁబోగల రథమునెక్కి తన భవనమునకుఁ బోయెను. దైవికముగ నదే సమయమునకుఁ బూజా సామగ్రులను గైకొని చంద్రహాసుఁడు వచ్చు చుండెను. దూరమున నుండియే తన బావమఱఁది పాదచారియై చేతఁ బళ్లెరమును బట్టుకొని వచ్చుచుండుటను గాంచి విస్మయముతో మదనుఁ డిట్లనెను :- "నీ వెచ్చటికిఁ బోవుచున్నావు ?"

చంద్రహాసుఁ డిట్లనెను :- "తండ్రిగారిప్పుడే వచ్చినారు. వివాహానంతరము భద్రకాళికిఁ బూజలొనర్చుట మీకులాచారమని నా కాజ్ఞాపించినారు. కావున నేను బూజచేయఁ బోవుచున్నాను."

మదనుఁడు నవ్వుచు నిట్లనెను :- "పూజచేయకయే నీకు భాగ్యోదయముకానున్నది. నిన్ను మహారాజిప్పుడే పిలుచుచున్నాఁడు ఇఁకఁ బూజయందుమా ? అది లౌకికాచారము, నీకు

బదులుగా నేనే పూజించి వచ్చెదను, ఆలస్యము చేయవలసిన పనిలేదు" ఇట్లు పలికి మదనుఁడు చంద్రహాసుని రథముపై గూర్చుండఁ బెట్టి స్వయముగఁ బూజాసామగ్రిని గైకొని ఒంటరిగా భద్రకాళీ మందిరమునకు బోయెను.

చంద్రహాసుఁడు రథముపై గూర్చుండి రాజభవనమునకు బోయెను. రాజు ద్వారమునఁ బ్రతీక్షించుచుండెను. ఆతనికి క్షణ క్షణము భారమగుచుండెను. ఆతఁడు తన పుత్రికా వివాహమును దన కన్నులతోఁజూడఁ దలఁచెను. మహాముని నిర్ణయించిన లగ్నము దాటిపోవునేమోనని ఆతని భయము. చంద్రహాసుఁడచ్చటకుఁజేరి రాజు చరణములకుఁ బ్రణామము కావింపఁగానే ఆతనిని వెంటనే లేవనెత్తి కౌఁగిలించుకొనెను, చంద్రహాసుని శీల స్వభావమును.సదాచారమును, రూపలావణ్యములను భవ్యాకృతినిఁగాంచి రాజు అత్యధికముగ నానందించెను. చంద్రహాసుఁడు లోమశమహాముని చరణములను బట్టుకొనెను. బ్రాహ్మణులు వేదధ్వనినిఁ గావించిరి. వివాహ మంగళ వాద్యములు మ్రోగెను. పుణ్యాహవాచన సుమధుర ధ్వనిచే రాజమహాలు ప్రతిధ్వనించెను. రాణియొక్క హర్షమునకు మేఱలేకుండెను. ఆమె వరుని ముఖమునుగాంచి తృప్తిచెందకుండెను, రాజకుమారి కంటె నాతఁడతి సుందరుఁడుగ నుండెను, నూతన దంపతులను గాంచి తల్లిదండ్రులును, మునిజన, పరిజన, పురజన, మంత్రి పురోహిత జనులందఱును నత్యధిక సంతోషమును జెందిరి, శాస్త్రీయ విధిచే రాజకుమారికినిఁ జంద్రహాసు

నకును వివాహము జరిగెను. ప్రాంతఃకాలమున మంగళ కృత్యములలొనర్చిరాజుచంద్రహాసునకుఁ దనమకుటమునుధరింపఁజేసి రాజ్యభారము నాతని కప్పగింపి ముని యాజ్ఞచే వనమునకుఁ బోయెను.

ఇచ్చట మదనుఁడు పూజా సామాగ్రులను గైకొని భద్రకాళీ మందిరములోఁ బ్రవేశింపఁగనే మహామంత్రిచే నియుక్తులైన తలారు లాతని శిరస్సును ఖండించి యా సమాచారమును మహామంత్రికి విన్నవించిరి. మొదట జరిగిన సంఘటనముచే వీరాతని వదలివచ్చియుండరుగదాయను సందేహమువైచెను. ఈ విషయమున నిజానిజములను గనుఁగొనుటకు తానొంటరిగా భద్రకాళీ మందిరమునకు బోయెను. అచ్చటికి వెడలి చూచునప్పటికి ఆతని హృదయము బ్రద్దలయ్యెను. అచ్చట తనప్రియపుత్రుఁడు చచ్చిపడియుండుటను గాంచెను. ఇంతలోనే కొందఱు వచ్చి మహామంత్రికి జయజయధ్వానము లొనర్చి, అత్యంతానందమును బ్రకటించుచు నిట్లనిరి :- అన్నదాతా ! మీరిచ్చట నొంటరిగానేల యుంటిరి ? మహారాజు మీ అల్లునకుఁ దన కుమార్తెనొసంగి వివాహమొనర్చినాఁడు. రాజ్యభారము నొసంగుచున్నాఁడు. మేమిప్పుడే దాన దక్షిణలను గైకొని వచ్చుచున్నాము."

ఇది వినఁగానే దుష్టబుద్ధికి పెద్ద బాధకలిగెను. ఆతఁడిట్లనుకొనెను :- "ఛీ ! ఛీ !! నాబ్రదుకుమండ. నేనెవనినిఁ జంపఁ

దలంచితినో అతఁడు రాజైనాఁడు. నా ప్రాణ సమానుఁడగు పుత్రుఁడు మరణించి నాఁడు. ఇంక నేను జీవించి యేమిచేయుదును." అని అనుకొని యాతఁడు వానిని వీడ్కొలిపి స్వయముగఁదన బాకు తీసికొని పొడుచుకొని చచ్చెను. పితాపుత్రుల కళేబరములు రెండును భద్రకాళీ మందిరాంగణమునఁ బడియుండెను. తలుపువేయఁబడెను.

ప్రాతఃకాలమున రాజ్యాభిషేక కార్యములు పూర్తికాఁగానే, తన నూతన వధువుతోఁ జంద్రహాసుఁడు తనకు పితృతుల్యుఁడగు శ్వశురుఁడునగు దుష్టబుద్ధికిఁ బ్రణామమొనరింప బాజాభజంత్రీలతో మంత్రి భవనమునకుఁ బోయెను. అచ్చటకుఁ బోగానే దుష్టబుద్ధియును, మదఁనుడును నిద్దరును నచ్చటలేరని తెలిసెను, ఇంతలోనె చాలమందివచ్చి చంద్రహాసునకిట్లుచెప్పిరి: "ప్రభూ ! రాత్రియెవరో మహామంత్రిని మంత్రిపుత్రుని హత్యకావించిరి ఇద్దరును భద్రకాళీ మందిరమున దెగిపడియుండిరి." ఇది వినఁగానే చంద్రహాసుని దుఃఖమునకు మేరలేకుండెను. ఆతఁడు దుఃఖించుచు భద్రకాళీ మందిరము వైపునకుఁబోయెను

మందిరమునకుఁజేరుకొని అతఁడు తన శ్వశురుని, బావమఱఁదినిఁ జచ్చియుండుటనుగాంచిరి. ఆతఁడేడ్చుచుఁగరుణాస్వరమున భద్రకాళినిస్తుతించెను. ఆతనిస్తుతికిఁబ్రసన్నురాలై భద్రకాళి ప్రత్యక్షమై యిట్లనెను. :- "వత్సా ! నేను నీభక్తికి మెచ్చుకొంటిని, నీవు భగవద్భక్తుఁడవు. భగవద్భక్తులను ద్వేషించువారికెన్నటికిని మేలు జరుగదు. ఈ దుష్టబుద్ధి నిన్నులోలోన

ద్వేషించెడువాఁడు, దానివలన నాతఁడే చంపఁబడినాఁడు. మద నుఁడు నిన్ను ద్వేషింపకున్నను శత్రుపుత్రుఁడగుటచేఁ జంపఁ బడినాఁడు. నీవు నావలన నేదైనవరము కోరఁదలఁచినఁ గోరు కొనుము!"

భద్రకాళి మాటలనువిని చంద్రహాసుఁడిట్లనెను : అమ్మా ! నీవు నిజముగ నాయెడల బ్రసన్నురాలవగునెడల నేను నాశ్వశు రుని, బావమఱఁదిని బ్రదికింపగోరుచున్నాను. నా శ్వశురుని అంతఃకరణము శుద్ధముకావలయును. ఈతని మనస్సునుండి ద్వేషభావము నశించుఁగాక !"

చంద్రహాసుని యీనిష్కపటభావమునుగాంచి భద్రకాళి మిగుల సంతసించెను. వెంటనే వారిద్దరి శిరస్సులు మొండెమున కంటుకొనెను. వెంటనేవారు నిద్రిచినవారు లేచినట్లు లేచి నిలు చుండిరి. దుష్టబుద్ధియొక్క అంతఃకరణము పవిత్రమయ్యెను ఏదురుగాఁజంద్రహాసుఁడు నిలుచుండియుండుటను గాంచి వరు విడిపోయి ఆతనిఁగౌఁగిలించుకొనెను. బిగ్గఱగానాతండేడ్వసాగెను. ఏడ్చియేడ్చి అతఁడుతన యశ్రువులచేఁజంద్రహాసుని రాజ్యాభి షేకముచేఁదడిసిన వెంట్రుకలను మరలఁ దడిపెను. ఆతని నశ్రువులచే స్నానమొనరింపఁజేసెను. నేఁడు మామ అల్లుండ్రు ప్రేమపూర్వకముగఁ గలిసికొనిరి. మదనుఁడును శ్రద్ధాసహిత ముగఁ జంద్రహాసునభినందించెను. ప్రజలను జంద్రహాసు నభి నందించిరి. అందఱేకైకస్వరముగ నాతనిఁదమ సామ్రాట్టుగఁ జేసికొనిరి. సమాచారము తెలియఁగానే కుళింద దేశాధీశ్వరుఁడును

రాణియును బరునిడివచ్చిరి. తమ పుత్రుఁడు రాజ్యసింహాసమున గూర్చుండుటను గాంచఁగానే వారి యానందమునకు మేఱలే కుండెను. దుష్టబుద్ధియును దన యల్లున కాశీర్వాదములను గావించి, మంత్రి పదవిని వీడి తపస్సుచేసికొనుటకు వనమునకుఁ బోయెను. ఆతని స్థానమున మదనుఁడు మహామంత్రియయ్యెను. బావమఱఁదులిద్దరునుగలిసి ధర్మపూర్వకముగఁగుళిందకుంతల రాజ్యములను బాలించుచుండిరి.

సూతుఁడిట్లనెను:- "మునులారా! మీరడుగఁగానేనీచంద్ర హాసుని మనోహరకథను జెప్పితిని చూడుఁముదుష్టబుద్ధిఆతనిఁ జంపుట కెన్నెన్ని యుపాయములో చేసెను. కాని చంపఁజాలక పోయెను. శుద్ధ జలవాయువులే మాత్రమును బ్రవేశింపని గర్భ ములోనున్న పిండమును రక్షించెడువాఁడు ప్రపంచములో నిన్ని వస్తువులుండఁగా రక్షింపఁడా? ఆయుస్సెంతవఱకుండునో అంత వఱకు భోగింపవలసినదే. మృత్యువు వచ్చినపుడు వానిని రక్షిం పఁగలవా-డెవఁడుండును. సుయజ్ఞుని పత్నులతో బాలక వేష ధారియగుయమరాజిట్లనెను:- "రాజపత్నులారా! మిరీ మృతుఁ డగు సుయజ్ఞునికొఱకు దుఃఖింపకుఁడు. ఆతని కింతవఱకే ఆయుస్సు, ఇప్పుడీతఁడు జీవింపఁజాలఁడు."

ఈ దృష్టాంతమునొసంగి హిరణ్యకశిపుఁడు తన తల్లికి మఱఁదలకు, తమ్ముని కొడుకులకు నిట్లుజెప్పెను :- దైవగతి యని భావించి మీరిప్పుడు హిరణ్యాక్షుని కొఱకు శోకింపకుఁడు."

....o....

# దైవరక్షితుఁడే యథార్థ రక్షితుఁడు

౪౫౩

శ్లో॥ పథిచ్యుతంతిష్ఠతి దిష్టరక్షితమ్
గృహేస్థితం తద్విహతం వినశ్యతి।
జీవన్యనాథోపి తదీక్షితో వనే,
గృహేపి గుప్తోస్యహతో నజీవతి॥

....శ్రీ భాగ. ౭ స్కం, ౨ అ. ౪౦ శ్లో॥

ఆ॥ ధనము వీథిఁబడిన దైవవశంబున
నుండుఁబోవు మూలనున్ననైన
నడవి రక్షలేని యబలుండు వర్థిల్లు
రక్షితుండు మందిరమునఁజచ్చు॥

....శ్రీ మదాంధ్ర భాగవతము

భగవత్సంకల్పమమోఘమైనది. మానవునిసంకల్పములు కొన్ని నెఱవేరును. కొన్ని నెఱవేరవు. కాని భగవంతునకు ఇచ్ఛ, పూర్తియనునవి రెండుగాలేవు. ఆతనికే యిచ్ఛకలిగినదో అది పూర్తి అయినట్లే యెంచవలెను. ఈ సమస్త జగత్తును భగవంతుఁడు సంకల్పమాత్రముననే ఖేలనముగ నొనర్చును. దీనిలో నాతనికి శ్రమగాని, ఆయాసముగాని లేదు. ఈ చరాచర విశ్వము ప్రభువుయొక్క యిచ్ఛమీఁదనే ఆధారపడి యున్నది.

చతురుఁడగు తోటమాలి వృక్షములన్నిటిని నెట్లు కనిపెట్టియుం డునో అనఁగా నేది యెంతగాఁ బెరుగుచున్నదియు, ఏది చిగురు పెట్టుచున్నది, దేనిని వేఱొకచోటకుఁదీసి నాటవలయును. దేనికి బోదెను ద్రవ్వవలయును, ఎప్పుడు నీరు చల్లవలయును. ఈ అన్ని విషయములను సావధానముగఁ బాలనపోషణము జరుపును. దానిలోఁ బొరపాటేమియునుండదు. తోటమాలి కార్యములలో నేవైనఁ బొరపాట్లుండునేమోకాని భగవంతుని కార్యములలోఁ బొరపాట్లుండవు. ఆతని యీ యఖండ క్రీడావ్యాపారము నిరంతరము ప్రవాహరూపమున జరుగుచుండును. దీనికాద్యంతములు లేవు. ఆదికాలమునుండియు నిది యిదేప్రకారము వ్యవస్థితరూపమున నడచుచున్నది. ఈ వ్యవస్థారహస్యము నెఱిఁగినవారు జ్ఞానులనఁబడుదురు. వారే సంఘటనమునకును హర్షవిస్మయములను జెందరు. ప్రభువుయొక్క యిచ్ఛకు వ్యతిరేకముగ నేమియును జరుగదని వారికి తెలియుటచే నా సంఘటనమట్లే జరుగవలయునను కొందురు. కాని అజ్ఞాని యగువాఁడు వాని నన్నిటిని నూతనముగ భావించి, అకస్మాత్తుగ జరిగినవని భావించి ఒక్కొక్కప్పుడేడ్చును, ఒక్కొక్కప్పుడు నవ్వును, ఒక్కొక్కప్పుడు సుఖించును. వేఱొకప్పుడు దుఃఖించును. ఇదియే అజ్ఞానము, ఇదియే మూర్ఖత.

బాలకుఁడా సుయజ్ఞుని రాణులకుఁజెప్పుచుఁ నిట్లనెను :-

"అబలలారా ! మీరేడ్వకుఁడు సర్వరక్షకుఁడా శ్రీహరియే, ఇప్పుడీ మృతశరీరము మిమ్ములనేమి రక్షింపఁ గలదు.

అయచ్యుత, ఆజ, అవి నాశియగు శ్రీహరి తనయిచ్ఛా మాత్రము చేతనే యీ సమస్త సృష్టిని జరుపుచుండును. తానే రచించి దీనినిఁ బాలించుచుండును. తన కిష్టమువచ్చినపుడు సంహార మును గూడ చేయుచుండును. ఈచరా చర ప్రపంచము ఆతని కాటస్థలము. ఇది ఆతని మనోరంజనమునకును ఖేలనమునకును నొక సాధనమాత్రము. పిల్లలు బంతినిఁజేయుచుందురు. ఆడి ఆడి బ్రద్దలు చేసి పాఱవేయును. దానినిఁ జేయుటకును, నాశం చేయుటకును బాలుకునకెట్లు స్వాతంత్ర్యము కలదో అట్లే శ్రీహరికి సృష్టిస్థితి సంహారములను కావింప సర్వథా స్వాతం త్ర్యము కలదు. సమస్త విధముల నాతఁడు సమర్థుఁడు.

అంత రాజపురోహితుఁడిట్లనెను :- "వత్సా! నీవు గొప్ప గొప్ప మాటలు మాటలాడుచున్నావు. తమ ప్రయత్నముచే నెవరును దన మృత్యువును దప్పించుకొనలేరా ? నశించిపోవు వస్తువును రక్షింపజాలరా ?"

అంత బాలకుఁడిట్లనెను :- "పురోహితా ! ప్రారబ్ధ మను కూలమైనపుడే పురుషార్థము పనిచేయును, దైవము విపరీత మైనచోఁ బురుషార్థము విఫలమగును. అయినను బురుషార్థము నిరంతరము చేయుచునే యుండవలయును. ఏలననఁగాఁ బురు షార్థమొనర్చుట చేతనే ప్రారబ్ధము సంగతి బయటపడును. తన యదృష్టములో నది యున్నదియును లేనిదియును నప్పుడుకాని తెలియదు. ప్రతి వస్తువునకును నవధికలదు. ఏ వస్తువున కెంత యవధికలదో, ఎన్ని దినములుండవలయునో అంతవఱకది

నశింపదు. ఎవరును నశింపఁజేయజాలరు. వానిని గోతిలోఁబడ వైచినను, గాళ్ళక్రిందఁబడవైచి త్రొక్కినను నాతఁడెప్పటి వలెనే యుండును. దీనికి విపరీతముగా నేదైన నశించిఁబోవు నపుడు దాని కేడుతాళములువైచి లోపల బంధించిననునది నశించితీరును. ఆయువు మిగిలియున్నచో వానిని సింహవ్యాఘ్రా దులకడఁబడవైచినను జీవించియుండును. ఆయువు లేనపుడు వాని నేడు ప్రాకారములమధ్య సురక్షితముగఁ బుష్పశయ్యపై శయినింపఁజేసినను నాతఁడు చచ్చితీరును. అకృతవ్రణుని భగ వంతుడెట్లు రక్షించినది తెలియును గదా !"

ఇదివిని శౌనకుఁడిట్లనెను :- "సూతా ! అకృతవ్రణున కేవిపత్తు సంభవించినది. వానిని భగవంతుఁడెట్లు రక్షించినాఁడు. ఈ కథను నీకు ఉచితమని తోఁచిన మాకుచెప్పుము."

ఇది విని సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఇది యద్భుత పౌరాణికాఖ్యానము. ఇది త్రేతాయుగమునాటి మాట ఆ దినములలో బ్రాహ్మణులందఱును స్వధర్మనిరతులై యుండి తపస్స్వాధ్యాయమందు సంలగ్నులై యుండెడివారు. ఆదినము లలో నొకసుశీలుఁడును శాంతిదాంతులు కలవాఁడు నగు నొక ముని అరణ్యమునఁ దన భార్యతో నొక పర్ణకుటియందు తపస్సు చేసికొనుచుండెను.ఆతని కొక సుందరపుత్రుఁడుదయిం చెను. ఇట్టి సుందరపుత్రుని ముఖమును గాంచిన నాదంపతుల హర్షమునకు మేఱలేకుండెను. ఒక దినమున సాయంకాలమున మునిసంధ్యావందన మొనర్చుకొనుచుండెను. మునిపత్ని నదీ

తీరమునకు జలమును దేఁబోయెను. ఇంతలోనే ఒక తోడేలు వచ్చెను. అది యాపిల్లవానినిఁ దీసికొని వెడలిపోయెను. ముని చూచి చాలవఱకు దానిని వెన్నంటెను గాని ఆతని పరిశ్రమ మంతయును వ్యర్థమయ్యెను. తోడేలా పిల్లవానిని దీసికొని పాఱి పోయెను. ఆపిల్లవానికింకను మృత్యువాసన్నము కాలేదు. అందు వలన నా తోడేలునకు మనస్సులోఁ గొంచము దయగలిగెను. వానినిఁగొనిపోయి అది అడతోడేలున కొసంగెను. అది ఆతని గుహలో నుంచుకొని వానితో నాడసాగెను. తన పిల్లలవలె నీతనిఁగూడ ప్రేమింపసాగెను. తోడేళ్ళు జంతువులనుజంపి మాంసమునుదినుచుండును. అది ఆమాంసమునే యీ పిల్లవానికిఁ బెట్టుచుండెను. ఇప్పుడీపిల్లవాఁడు దాని పిల్లలతోఁ గలిసిపోయెను. తోడేలుపిల్లలవలెఁ జేతులుకాళ్ళతో నడుచుచుండెను. తోడేళ్ళ వలెనే పలుకుచుండెను.

ఒకనాఁడు పరశురాముఁడా ప్రక్కగాఁ బోవుచుండెను. ఒక మనుష్యబాలకుఁడు తోడేళ్ళవలెను. బళువులవలెను. బోవు టను, అవి చేసినట్లే పనులుచేయుటను గాంచి ఆతఁడు మిక్కిలి యాశ్చర్యమును జెందెను. ముందునకుఁబోయి ఆఁతడా పిల్ల వానినిఁ బట్టుకొనెను. ఏవ్వఁడిఱువదొక్కసార్లు సమస్త భూమం డలమందు రాజన్యులను సంహరించెనో అట్టివానికి తోడేళ్లేమి లెక్క తోడేళ్ళు భయపడి పారిపోయెను. ముని యీ పిల్లవానినిఁ దీసికొని తన యాశ్రమమునకుఁబోయెను.

పిల్లవాఁడిన్ని దినములు తోడేళ్ళలో నున్నను నాతని శరీరమున కొక్క వ్రణమైనను కాకుండటను పరశురాముఁడు గ్రహించి ఆతనినేమియును బాధింపలేదు. అందువలన నాతనికి “అకృతవ్రణుఁడను పేరువచ్చెను.”

ఈ యకృతవ్రణుఁడే తేజస్వియు, దపస్వియు. బరశు రాముని కనుయాయియు నయ్యెను. పరుశురాముఁడు భీష్మునితో యుద్ధము చేసినపుడీతఁడే రథమును నడిపెను.

సూతుడిట్లనెను :- “స్వామీ ! అకృతవ్రణున కాయువు కలదు. అందువలనఁ దోడేళ్ళలో నున్నను బ్రదికెను. దీనికి విపరీతముగల జిత్రకేతుని పుత్రునకాయుస్సు లేకుండెను. ఎన్ని ప్రయత్నములొనర్చినను జచ్చియేపోయెను. అభిమన్యుడు జచ్చినతర్వాత నర్జునుడు శూర్యాస్తమానములోగా జయద్రథు నిఁ జంపనిచోఁ దానే అగ్నిలోఁబడి చచ్చెదననెను. ద్రోణాచార్యు డును, దుర్యోధనుడు, పదునొకండక్షౌహిణులు సైనికులును నెట్లైనా జయద్రథుని రక్షించెదమని ప్రతిజ్ఞఁగావించిరి. “మును లారా ! మీరే యాలోచింపుఁడు· పదునొకండక్షౌణీల కొక్క వ్యక్తిని నొక్కపగలు దాచుటెంతటిపని. అనేకులగుమహారథికు లనేక వ్యూహములను బన్ని వారిమధ్య జయద్రథునిదాచిరి. కాని వానికిఁ గాలము సమీపించినది. కాలనియంతయగు శ్రీకృ ష్ణుని మనస్సున సూర్యాస్తమానమునకుఁ బూర్వమే పరలోకము నకుఁ బంపవలయునను దలంపువుండెను. ఆతఁడు సూర్యాస్త మానమునకు బూర్వమే అర్జునుని బాణములచేఁ జచ్చెను.

ఒక్కటికాదు, ఇట్టి దృష్టాంతములు వేలకొలఁదిగను, లక్షల కొలఁదిగను గలవు. అనేకమందిఅసురులమరులగుటకనేక వరములను గోరుకొనిరి. వారు తామేలోకములో బలవంతుల మనియుఁ బరాక్రమ వంతులమనియుఁ దలఁచిరి. కాని వారు సాధారణవ్యక్తులచేఁ జచ్చిరి. ఈ విషయములన్నిటినిఁ గాంచిన మృత్యువు రానంతవఱకు ఎవరెన్ని యుపాయము లొనర్చినను నెవ్వరు నెవరినిఁ జంపఁజాలరు. మృత్యువాసన్నమైన వాఁడెన్ని యుపాయములు చేసికొన్నప్పటికిని రక్షింపఁబడఁడు.

ఆ జ్ఞానియగు బాలకుఁడు సుయజ్ఞుని భార్యలకును సంబంధులకును జెప్పుచు నిట్లనెను :- "రాణులారా ! ఈ రాజర్షికి కాలము సమీపించినది. అందువలననే ఈతఁడు శత్రువులచేఁ జంపఁబడినాఁడు. లేకున్న నీతఁడు సదా విజయలాభమునే పొందెడువాఁడు. కాలమే అన్నియును జేయఁగలదు. కావునమీరు చింతనుమాని యీ రాజర్షికి ఔర్ధ్వదైహిక క్రియ లొనర్పనిండు. ఈతని మృతశరీరముపై మోహము నుంచుట వ్యర్థము. శోకించుట వలనఁ బ్రయోజన మేమియును లేదు."

నారదుఁడిట్లనెను:- "మహారాజా! ఈ విధముగ హిరణ్యకశిపుఁడు తన తల్లికిని, ఇతర సంబంధులకును జెప్పుచు సుయజ్ఞుని కథను జెప్పెను." హిరణ్యకశిపుఁడిట్లనెను:- "సుయజ్ఞుని సంబంధుల కాజ్ఞాని బాలకుఁడింకను శోకశాంతి విషయములను జెప్పెను. వానిని గూడ మీరందఱును నేకాగ్రచిత్తులై శ్రవణ మొనర్పుఁడు."

# ఆత్మశరీరనకు భిన్నమైనది

౪౫౦

శ్లో॥ యథానలో దారుషు భిన్న ఈయతే
యథానిలో దేహగతః పృథక్స్థితః
యథా నభః సర్వగతం సుసజ్జతే।
తథాపుమాన్ సర్వగుణాశ్రయః పరః॥

--శ్రీభాగ, ౭ స్కం. ౨ అ. ౪౩ శ్లో॥

ఆ॥ దారువుల వెలుంగు దహనుని కైవడి
గాయములఁజరించు గాలిభంగి
నాశలీనమైన నభము చాడ్పున వేఱు
దెలియవలయు దేహి దేహములకు॥

--శ్రీమదాంధ్రభాగవతము.

తామరాకు నీటిలో నున్నను వానికంటనట్లు, ఆత్మశరీర మందున్నను శరీరముయొక్క సుఖదుఃఖములకుగాని, వృద్ధిక్షయములకుఁగాని, హాని లాభములకుఁగాని, చింతాశోకములకు గాని, జనన మరణములకుగాని సంబంధించియుండదు. దేహాత్మలకు భేదమునెంచక, రెంటిని నేకముగభావించుచు, శరీరమునే ఆత్మగాభావించి నిరంతరము దానిపాలన పోషణమొనరించుటయందే వ్యగ్రులైయుండెడు వారే అజ్ఞానులనఁబడుదురు. ఆత్మకు దేహసంబంధమగు సుఖదుఃఖములతో సంబంధములేద

సియు, ఆత్మ నిత్య, శాశ్వత, ద్వంద్వరహిత సంగరహితమైన దను జ్ఞానముకలవాఁడే బ్రహ్మజ్ఞానియనఁబడును. బ్రహ్మజ్ఞానికి హర్షశోకములుండవు. ఏకత్వభావనవలన నాతఁడు శోకమోహములు బొత్తులేనివాఁడై యుండెను.

హిరణ్యకశిపుఁడు తన తల్లికిఁజెప్పుచు నందఱుకును జెప్పుచు నిట్లనెను:- "అమ్మా! ఆ జ్ఞానియగు బాలకుఁడు సుయజ్ఞుని పత్నులకు జ్ఞానోపదేశమొనర్చుచు నిట్లనెను. "రాణులారా! మీరెవరికై యేడ్చుచున్నారో ఒక్కసారి విచారింపుడు"

ఒకరాణి యేడ్చుచు నిట్లనెను:- "మాపతి పరలోకమునకుఁబోయినాఁడు; ఆతని వియోగమునకు దుఃఖమునుజెందుట స్వాభావికమే. దుఃఖమున రోదనము ప్రాయికముగ వచ్చుచునే యుండును."

ఆ బాలకుఁడిట్లనెను:- "నేనిదియే అడుగుచున్నాను. నీ పతియెవరు? దేహము, జీవాత్మరెండుకలవు. నీవు దేహముకొఱకే యేడ్చుచుంటివా దేహముయెదుటనే పడియున్నది. ఇది మృత శరీరముకదా! దీనిలోనుండి జీవాత్మపోయినదని నీవనవచ్చును. జీవాత్మ యెన్నటికిని మరణింపదు మనమొకవస్త్రమునువిడిచి వేఱొక వస్త్రమును ధరించినట్లు, జీవాత్మయును నొక శరీరమునువిడిచి వేఱొక శరీరమును ధరించును. ఈ శరీరము పంచభూతములచే నేర్పడినది. ఇది తనకుఁగారణరూపమగు లింగదేహముయొక్క ధర్మాధర్మములు, పాపపుణ్యాది కర్మానుసారముగ నప్పుడప్పుడు పుట్టుచుఁజచ్చుచుండును. కాని శరీర

ముయొక్క జనన మరణములుగాని, క్రియలుగాని ఆత్మకు సంబంధింపవు. జీవాత్మ శరీరములలోనున్నను శరీరముయొక్క జనన మరణములతో దానికేమియును సంబంధములేదు."

అప్పుడు వృద్ధమంత్రి యిట్లడిగెను :- "బాలకా ! నీవు బ్రహ్మజ్ఞానివిగాఁగనఁబడుచున్నావు. మంచిది, ఆత్మకు శరీరముయొక్క సుఖదుఃఖములతోఁగాని, జనన మరణాదులతోఁగాని యేమియును సంబంధములేనప్పుడు పురుషుఁడీ శరీరమును దనదిగా భావించి యింతగా మమకారము జెందనేల ?"

బాలకుఁడు దృఢతాస్వరమున నిట్లనెను :- "మంత్రీ ! ఈ మమత్వమునకుఁ గారణము మాయామోహము. మీ గ్రామమునకుఁజాల దూరమున నొక చెఱువున్నదనుకొనుఁడు. అచ్చటి మట్టితో ఇటుక రాళ్ళు చేయఁబడినవి. ఒకానొకనికడ లక్ష రూపాయలు కలవుఁ నిన్న నేఁటివఱకు వాటిని నావి నావి యనుచుండెను. ఏదోకారణముచే నవి నాకడకు వచ్చినవనుకొనుఁడు. ఇప్పుడా రూపాయల మీఁద నాకు మమత్వము కలిగినది. ఆ రూపాయలను నేను నా రూపాయలనుకొనుచుంటిని ఇటుకకాలి తయారైన తరువాత నా రూపాయలనుండి కొన్ని రూపాయల నొసంగి నేనిటుకలను గొంటిని ఇంతవఱకు నావద్ద నుండిన రూపాయలమీఁద మమత్వముపోయినది. కాని ఆరూకల స్థానమున నా మట్టిమీఁద మమకారము కలిగినది. కొన్ని రూపాయల నొసంగి యినుము, కఱ్ఱ తెచ్చితిని, కొన్ని రూపాయలతో సున్నము, ఇసుక, సిమెంటు తెచ్చితిని, వీనితో నాకేమియును

సంబంధములేదు. కాని యిల్లు తయారైన తరువాత మనము మంచి అభిమానములతో నిట్లందుము "నాయిల్లు, నాభవనము, నేను దీనికి యజమానిని." "ఏమయ్యా ! దీనిలో నీదేమి పడినది, ఏ శరీరము యొక్క అంగములతో నీవు దీనిని నిర్మించితివి ?" అని యెవరైన నడిగినచో నిందులో మాదేదియునులేదు, కేవలము మమకారమే కలదని చెప్పవలసివచ్చును, కొంత కాలమునకు మనము దివాలాయెత్తి యింటిని విక్రయించితిమి. అప్పుడింటితోఁగూడ మనము కూడ అమ్ముడుపోలేదు. ఇల్లు కట్టకముందు నేనెట్లుంటినో ఇప్పుడును నట్లేయుంటిని, భవనమును యథాప్రకారముగనే యుండెను. కాని దాని నుండి మన మమకారముపోయినది. నాదను నదిపోయినది. గృహము స్వామికెటుల వేఱుగనున్నదో అట్లే ఆత్మయును దేహమునకు సర్వథా వేఱుగనే యున్నది. అజ్ఞాన వశమున నీజీవుఁడే దేహమును ఆత్మగా భావించుచున్నాఁడు.

జలమునుండి అలలు పుట్టును, బుద్బుదములును బుట్టును, అయినను నవి జలమని పిలువఁబడవు. జలముతో వానికి సంబంధము లేనేలేదు. జలములు యథాప్రకారముగ నిర్మలముగ నుండును అదే విధముగ దేహసంయోగ వియోగములకును, జనన మరణములకును సంబంధములేదు. దీనిని ధ్యానపూర్వకముగఁ దెలియును మట్టిచేఁ గుండ, పిడత, మూఁకుడు, ప్రమిద అయినది. ఇంకనెన్నో అగును. చక్కెరతో గుఱ్ఱము, ఏనుఁగు, ఒంటె, గూడ అయినవి. లక్కచే

చూడామణులు, గాజులు మొదలైనవెన్నో అయినవి. బంగార ముచే కుండలములు, కమ్మలు కంకణములు, కడియములగు చున్నవి. వెండిచేఁ గడియములు, మురుగులు, పట్టాలు, వంకెలు అగుచున్నవి. ఇట్లగుటకుఁ బూర్వమును మట్టిగా, చక్కెఱగ, బంగారుగా, వెండిగా, లక్కగానే యున్నవి. అవి యీ వస్తువు లుగా నైనప్పుడు కేవలము నామరూపములను వదలినచో నట్లే మిగిలియున్నవి. కుండ, మూఁకుడు, చట్టి, ప్రమిద వీనియందు మట్టితప్ప వేఱులేదు. పంచదార గుఱ్ఱము కాక పూర్వమును జక్కెరయే, యా కృతులైన తరువాతను జక్కెరయేయున్నది. అవి పగిలిపోయినను జక్కెర మిగులును. నామరూపములు వచ్చుటవలనఁ జక్కెరలో నెట్టు మార్పులేదో అదే విధముగ నానాదేహములను ధరించినను నాత్మకు పరివర్తనము లేదు. దాని నిస్సంగత్వమునకు నిత్యత్వమును నశింపదు.

అతఁ బురోహితు డిట్లనెను:- "అయ్యా ! ఆత్మశరీరమం దుండి దానికి వేఱుగ నెట్లుండఁగలదు?"

బాలకుఁడిట్లనెను:- రెండు కట్టెలను మంథనమొనర్చు టచే నగ్ని యుత్పన్నమగును. దీనినిఁబట్టి యిదివఱకే కాష్ఠ ములో నగ్నియున్నదని తెలుచున్నది. మంథన మొనర్చుటచే నది ప్రకటనమైనది. అయినను గాష్ఠము నగ్నియని యెవ్వరు ననరు. అగ్ని కాష్ఠమునకు వేఱుగనే యున్నది. వాయువు శరీ రమున రోమ రోమమున వ్యాపించి యున్నది. వాయువు లేక శరీరముందనే యుండదు. అయినను వాయువు దేహముకాదు.

దేహమునకు వాయువు వేఱుగనేయున్నది. ఇదేవిధముగ నాకాశము సర్వగతమైనది. ఆకాశములేని స్థానమే లేదు. వ్యవహారములోనిది ఘటాకాశమనియు మఠాకాశమనియు నీదేహమందిరములలోని యాకాశమనియుఁ బలుకుచుందుము. అనేకభేదములుగఁ బిలువఁబడుచున్నను నాకాశమునకు భేదములేదు. అది యెల్లప్పుడును నసంగముగనున్నది. ఇదేవిధముగ నాత్మలేక శరీరసత్తాయే లేదు. అయినను నాత్మ శరీరముకాదు. అది శరీరమున నిర్లేపముగను స్వతంత్రముగనున్నది. నీవు దేహము కొఱకే యేడ్చుచుంటివా దేహము నీ యెదుటనే యున్నదికదా! ఆత్మ కొఱకేడ్చు చుంటివందువా ఆత్మ చచ్చునదియునుగాదు, బ్రదుకునదియునుకాదు. దానికొఱకై విచారించుట వ్యర్థము ఆత్మ యెవ్వరికినిఁ గనఁబడదు."

అంత రాణులిట్లనిరి;- "ఆత్మ కనఁబడదుకాని, దేనిచే నీ శరీరము జీవించియున్నదో ఆ ప్రాణ మీ శరీరమునఁ గనఁబడుచున్నది. ఈ ప్రాణము లేకున్న నిది నిష్ప్రాణముగఁబడి యుండును. మా శోకము దానికొఱకే."

ఇది విని బాలకుఁడిట్లనెను:- "ప్రాణము మాటలాడదు, వినదు. ఈ మహాప్రాణము ఇంద్రియములన్నిటిలోఁ బ్రధానమైనదైనను బ్రాణ మాత్మకాదు, ఈ శరీరమున కాశ్రయము ప్రాణమే. ప్రాణముకూడ దేని ప్రేరణచే నడుచుచున్నదో అట్టి ఆత్మ దేహ, మన, బుద్ధి ప్రాణములకు వేఱుగనేయున్నది.

ఆత్మ సర్వగతమైనను దేహాదులకు భిన్నమైనది అయినను బృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశము కర్ణము, ముక్కు, నోరు, కన్నులు, నాలుక, వాక్కు, పాణి, పాద, శిశ్న, గుద, మానసాదులచేఁ గోచరించు ఉత్తమాధమ, ఉచ్ఛ, నీచయోనులను దన తేజముచేఁ దాను సాక్షిగానుండి సమయమునధరించి, కాలము తీరగానే త్యజించును.

ఇది విని పురోహితుఁడిట్లనెను:- "అయితే ఆత్మ కర్మాను సారముగ నుత్తమాధమ యోనులందేల జన్మించును. ఏల సుఖ దుఃఖములను, నరకస్వర్గములందు భోగించును?"

ఇది విని బాలకుఁడిట్లనెను:- "ఆత్మలింగ శరీరమున నున్నట్లంతవఱకది కర్మసంబంధమునఁబడినట్లు తోచును. అందువలన నది శోకమోహములను, నానాక్లేశములను మరల మరలఁ బొందుచుండును. వాస్తవమున నివి ఆత్మకు లేనేలేవు. మాయాకారణమున నిట్టి విపరీతభావనలు కలుగుచుండును. ఈ సుఖదుఃఖములు సత్వరజస్తమో గుణములయొక్క పరిణామములు, ఇవి సత్యములుకావు. మిథ్యాభినివేశములు."

పురోహితుఁడిట్లనెను :- "అయ్యా ! ఈ విషయము కేవలము తలక్రిందుగ నున్నది. అసలు వస్తువే లేకున్న దానిలో మిథ్యాభినివేశము కలుగుటెట్లు ?"

బాలకుండిట్లనెను :- "అయితే వినుఁడు. ఈ విషయమున నేనొక దృష్టాంతము నొసంగెదను. ఒకానొక చదివిన శిష్టపురుషుఁడు బజారునుండి నున్నని మట్టికడవలోఁ దైలమును గొని

తెచ్చుచుండెను. శిష్టపురుషుడు తైలభారమును స్వయముగ నెట్లు తెచ్చినాఁడని లోకులందఱు పరిహాస మొనర్చెదరు. అది ఆతని పదప్రతిష్టకు విరుద్ధమగు విషయము. ఒక నిర్ధన వ్యక్తితో నాతఁడిట్లనెను :- "అబ్బాయీ ! దీనిని మా యింటి వఱకును దెమ్ము. నీకెనిమిదణాల నొసంగెదను."

ఆతఁడిట్లనెను :- "అయ్యా ! నేను పంద్రెండణాలను గైకొందును." చివరకు పదియణాలకు కుదిరెను. ఆ నౌకరాతని తైలఘటమును దీసికొనిపోయెను. ఇల్లు చాల దూరముగనుండెను అందువలన నాతఁడు దారిలో నిట్లనుకొనెను :- "నేఁడు నాకు పదిఅణాలు లభింపగఁలవు. వానిని నేనేమిచేయవలెను." ఆలోచించి మరల నిట్లనుకొనెను :- "నేను తోటలోనికిఁబోయెదను. ఆ తోటలోని పండ్లతిచౌకగ లభింపఁగలవు. అచ్చటి తోటమాలియును నాకు పరిచితుఁడే. పది అణాలకు మామిడిపండ్లను తెచ్చెదను. బజారునకు రాగానే అవి యన్నియును రూపాయ కమ్ముడుపోఁగలవు. మరునాఁడు మరలఁ దెచ్చినవి రూపాయన్నర కమ్ముడుపోఁగలవు. ఎనిమిదణాలు నాతిండికుంచుకొని మిగిలిన రెండు రూపాయలకు మరలఁబండ్లను దెచ్చెదను. అవి నాల్గు రూపాయలకుఁ బోఁగలవు, ఆ నాలుగు రూపాయలకుఁదెచ్చినవి ఎనిమిదిరూపాయల కమ్ముడుపోఁగలవు. అందులో నాఱురూపాయల కొక మేకను దెచ్చెదను. మరల రెండు రూపాయలకు మామిడిపండ్లను దెచ్చి నవి నాల్గురూపాయలు కాఁగలవు. ఇట్లు

రూపాయలు పెరుగఁగలవు. అచ్చట మేఁకకు రెండు మూఁడు పిల్లలు పుట్టును. పాలనమ్మెదను, మేఁకల నుంచుకొందును. నాలుగు మేఁకలైన తరువాత వాని నిరువదైదు రూప్యముల కమ్మి ఒక గోవును కొనెదను. గోవు ప్రతి సంవత్సర మొక దూడను బెట్టును. పాలును లభించును. రెండు దూడలనమ్మి ఒక గేదెనుగూడ కొనఁగలను. పది పదునైదు శేర్లపాలు నిత్యమువచ్చును. సంవత్సరమునకు అయిదువందల రూపాయల పాలు అమ్ముడుపోఁగలవు. అప్పుడు వివాహమునుచేసికొందును. ఇంటిలోనికి తళుకు బెళుకులతో భార్యవచ్చును. పాలనమ్మి ఆమెకు వెండి, బంగారు నగలను జేయించెదను. ఆమెకు పంచ రంగుల పైట పావడమును గొనిపెట్టెదను. అందఱును నన్ను ధనికుఁడందురు. దానని ధనికురాలందరు. తరువాత నేను పెద్ద మేడ నొకదానినిఁ గట్టించెదను. ఐదారుగురు పిల్లలుకలుగఁ గలరు. వారు పెద్దవారు కాఁగానే వారికి వివాహములు కావించెదను. చిన్నచిన్న కోడండ్రు చాలమంది రాఁగలరు. నన్నుఁ జూడఁగానే ముసుఁగులు వైచుకొని దాగుదురు. నేనింటిలోనికిఁ బోయెదను. తర్వాత నింకేమియును బనిచేయను. డాబామీఁద నామంచము మీఁద గూర్చుండి పొగఁద్రావుచుఁ గూర్చుండెదను. నా పిల్లలకుగూడ పిల్లలు పుట్టగలరు. వారువచ్చి నాతో నిట్లన గలరు :- "తాతయ్యా ! భోజనమునకు రండు. నాయనమ్మ పిలుచుచున్నది." అప్పుడు నేను మిక్కిలి గర్వముతోఁ దల నూపెదను."

బాలకుఁడిట్లనెను :- "పురోహితులవారూ! ఇట్లాలోచించు చుండఁగా నాతఁడు తన శిరస్సునఁగల తైలభాండము సంగతినే మఱచిపోయెను. తలనూపఁగనే తలపైనున్న కుండ నేలపైఁ బడి బ్రద్దలయ్యెను. నూనె అంతయును బోయెను."

అంతనా శిష్టసజ్జనుఁడు మిక్కిలి క్రుద్ధుఁడై యిట్లనెను :- "నీవతి మూర్ఖుఁడవు నాలుగురూపాయలు నాశనముచేసినావు. నూనెనంతయును బారపోసితివి."

అంత నాతఁడేడ్చుచునిట్లనెను :- "స్వామీ! మీకు నాలుగు రూపాయలు నష్టమైనవి. నేనేర్పఱచుకొనిన గృహజీవనమంతయును జెడిపోయినది." ఇట్లుపలికి ఆతఁడు వెక్కి వెక్కి యేడ్చెను. భార్యాబిడ్డలు జ్ఞాపకమునకు రాఁగానే ఆతని కత్యంత దుఃఖము కలిగెను.

జ్ఞానియగు బాలకుఁడిట్లనెను :- "చూడుఁడు. ఆ తైలమును మోయువానికిఁబెండ్లియును గాలేదు. ఇంక బిల్లల కథ విషయములోఁ జెప్పవలసినదేమున్నది. కాని మనోరథము ద్వారా ఆతఁడు పూర్ణగృహస్థుఁడయ్యెను. అది విఫలముకాఁగానే యేడ్వనారంభించెను. ఇదియే అసత్తునందు సత్తుయొక్క మిథ్యాభినివేశము. మనము నిద్రించుచున్నాము. స్వప్నములో మనము రాజైనట్లును, గుఱ్ఱమునెక్కి పోవుచున్నట్లును, ఛత్రమును బట్టినట్లును. చామరముచే వీచుచున్నట్లును జూచితిమి, మెలకువ రాఁగానే ఏనుగునులేదు, ఛత్రచామరములునులేవు. సగము విఱిగిన కుక్కిమంచము మాత్రమున్నది. మాసిన దుప్పటినిఁగప్పి

కొని గుడిశెలో నిద్రించుచుండెను. ఆ గుడిశెలోనికి ఏనుఁగు దూరుట అట్లుంచుఁడు, గాడిదయైనను దూరఁజాలదుఁ స్వప్నములోని యాయేనుఁగు లేనేలేకున్న స్వప్న కాలముననెట్లు సత్యముగ గోచరించుచున్నదో అదే విధముగ నవిద్యాకారణముననాత్మ దేహమునకు విలక్షణముగనున్నను విషయభోగము మిథ్యయైనను సత్యముగ గోచరించును. కావున నాత్మకొఱకు శోకించుచోనది సర్వథావ్యర్థము ఏలననఁగా నాత్మ నిత్యమైనది. అది జన్మింపదు. మరణింపదు. దేహమునకై శోకించుచున్నామందుమా దేహము క్షణభంగురమైనది, అనిత్యమైనది, దీని నాశమవశ్యంభవిగానున్నది. దానినెవరైనఁదప్పించుకొనఁదలచినను దప్పించుకొనజాలరు. ఎంతగా శోకించినను నేవస్తువునకేస్వభావమో అది మారఁజాలదు. నిత్యము, అజరామరమైన ఆత్మ యెంత ప్రయత్నించినను ననిత్యము, నాశనము కాఁజాలదు. కావున నీవు అన్నిటి విషయమున శోకించుట వ్యర్థము. మీ దుఃఖమును గాంచగానే నాకు దయకలిగినది. కావున నీ సంబంధమున నేను మీకొక చక్కని శిక్షాప్రదమును, రోచకమునగు కథను జెప్పెదను. మీరందఱును సావధానపూర్వకముగ శ్రవణము చేయుఁడు."

.... )o( ....

# స్వపరాభినివేశమజ్ఞాన జన్యము

శ్లో॥ తతఃశోచత మా యూయం పరం చాత్మానమేవ చ।
క ఆత్మా కః పరోవాత్ర స్వీయః పారక్య ఏవవా॥
స్వపరాభినివేశేన వినాజ్ఞానేన దేహినామ్॥

--శ్రీ భాగ. ౭ స్కం ౨ అ. ౬౦ శ్లో,

క॥ పరులెవ్వరు దామెవ్వరు
పరికింపఁగ నేకమగుట భావింపరు త
త్పరమ జ్ఞానములేమిని
బరులును నేమనుచుఁదోఁచు ప్రాణులకెల్లన్॥

--శ్రీమదాంధ్రభాగవతము.

సింహమునుగాంచి భయభీతుఁడైనవాఁడు దానినుండి యితరులను నెట్లు రక్షింపగలఁడు; పాముచేఁ గాటుబడినవాఁడు ఇతరులనుండి బామును యెట్లు రక్షింపఁగలఁడు. అదే విధముగ స్వయముగ మరణధర్మముగల ప్రాణి, ఒకనొక దినమునఁ దాను జచ్చువాఁడితరులను మృత్యుముఖమునుండి శాశ్వతముగ నెట్లు రక్షింపఁ గలఁడు. చచ్చినవారికొఱకేడ్చుట వలన నేమియును బ్రయోజనము లేకపోఁగా పైగా హానికూడ కలదు. అజ్ఞానకారణమున శరీరమున మిథ్యాభినివేశము కలిగియుండుటచే శోక మోహములు కలుగుచున్నవి.

హిరణ్యకశిపుఁడు తన సోదరుని భార్యను సంబోధించుచు నందఱకు నిట్లు చెప్పుచుండెను:- కళ్యాణీ! నీవేడ్చు నందువల నఁ బ్రయోజన మేమున్నదో ఆలోచించుకొనుము సుయజ్ఞుని భార్యలు చచ్చిన తనపతి శరీరమునుగొని వివిధవిధముల విల పించుచున్నారు. వారికి జ్ఞానియగు నా పిల్లవాఁడు రాత్రియంత యును నోదార్చుచు నిట్లనెను:- మరణశీలమగు శరీరము అమ రము కాఁజాలదు. అమరమగు నాత్మ యెన్నటికి నశింపదు. ఈ విషయమున నీవు శోకించుట వ్యర్థము. దీనివలనఁ బ్రయోజన ములేదు. హానికలదు. ఈ విషయమున నేను మీకందఱకును చక్కని దృష్టాంతము నొసంగెదను. దానిని మీరందఱును దత్తచిత్తులై శ్రద్ధగా వినుఁడు.

ఒకానొక వనములో నొకకోడిదంపతులు నివసించు చుండెను. అవి పరస్పరము ప్రాణములకన్న మిన్నగఁ బ్రేమించు కొనుచుండెడివి. అవి రెండును నొక దట్టమైన వృక్షముమీఁదఁ దమ గూటినిఁ గట్టుకొనెను. ఆ రెండును నొక్కసారిగా గింజ లేఱుకొనుటకుఁ బోయి మరలఁ దోడుగాఁ దిరిగి వచ్చుచుండెడివి ఒకదాని ముక్కులో నింకొకటి ముక్కుపెట్టుకొనుచుఁ దినుచుం డెడివి. పరస్పరము కేకలువేసికొనుచు,ఆనందవిహార మొనర్చుచు సుఖపూర్వకముగఁ గాలమును గడుపుచుండెను. ఆ దినములలో వానికిఁ బరస్పరమెప్పుడు ప్రొద్దుక్రుంకుచున్నదో యెప్పుడుతెల్ల వారుచున్నదో దెలియదు. వానికి రాత్రింబవళ్ళు తెలియ్వ

నంతగా నున్మత్తమదాంధులుగ నుండెను. ఈ విధముగ నవి దినములను మిక్కిలి ఆనందముగ గడుపుచుండెను.

అల్పకాలమునకే పెట్టనాలుగు తెల్లనిగుడ్లను బెట్టెను. ఇప్పుడది మిక్కిలి ప్రేమతో ఱెక్కలతోఁగప్పి నిద్రించును. కాలాంతరమున నా గ్రుడ్లు చిట్లి దానిలోనుండి ఱెక్కలురాని పిల్లలుద్భవించెను. పక్షహీనములై మాంసపుముద్దలుగా నతికోమలములుగ నున్న నా పిల్లలను జూడఁగానే ఆ తల్లిదండ్రులకు కలిగిన ఆనందమునకు మేఱలేకుండెను. అవి కిచ కిచమనుచుఁ తల్లిశరీరమున కంటుకొనఁగానే ఆ కోడి తన్నుఁదా మఱచెడిది. ఇప్పుడు రెండును గలిసి మేతకుఁ బోవుటమానెను. ఒకటి గూటిలోనుండి పిల్లలను గనిపెట్టుకొని నుండెడిది. ఒకటి గింజలను దెచ్చెడిది. సాధారణముగ పెట్టయే పోయి గింజను దెచ్చి, తన పిల్లలకుఁ దనముక్కుతో నోటిలోఁబెట్టి మేపుచుండెడిది. ఇంతలో పుంజుపోయి యింకఁ గొన్ని గింజలను దెచ్చెడిది. పెట్టయును బుంజును బరస్పరము మోహమమకారములలో మునిఁగి తమ పిల్లలను బోషించుకొను చుండెడివి; కాని కాలదేవుఁడొకవైపునఁ నవ్యగ్రభావముతోఁ బొంచుకొని ప్రతీక్షించుచుండెను. కాలుని లెక్క యిప్పటికిఁ పూర్తియైనదని తోచుచుండెను.

ఆ సమయముననే ఒకానొక పిట్టలవేటగాఁడు భుజముపై వలను ధరించి వచ్చెను. ఆతఁడు సాక్షాత్తుగ యముఁడే వేటవాఁడుగవచ్చినాఁడా యనునట్లుండెను. ఆతని శరీరము కాటుకవలె నల్లగనుండెను. వెండ్రుకలు నిక్కఁబొడుచుకొని తామ్రవర్ణ

ముగ నుండెను. ముక్కు గట్టిగనుండెను. ఆతని తల చిన్నది. గ్రుడ్లు గుండ్రముగ నెఱ్ఱగనుండెను. ఆతని ముఖమున క్రూరత్వము మూర్తీభవించియుండెను. ఆతని అంగప్రత్యంగ ములన్నియును గర్కశముగను భయానకముగను నుండెను. ఆతడచ్చటకువచ్చి వలనొడ్డి దానియందు బియ్యపుగింజలను జల్లెను. పెట్ట దగ్గఱలోనే భగవంతుఁడవ్వారిగ నాహారమునొసం గెనని దూరమునుండియే కాంచెను. అది వెంటనే ఆ గింజలమీఁ దగల నాశచేనచ్చట వ్రాలెను. గింజలను ముక్కుతోఁబొడవఁ గానే అది వలలోఁ దగుల్కొనెను. అది తట తటఁ గొట్టుకొని భయపడెను, కాని వలలోఁ దగుల్కొనెను.

దూరముననుండి పుంజు చూచెను :- అయ్యో ! నాపత్ని వలలోదగుల్కొనినది ఇప్పుడేమి చేయుదును ఈవ్యాధుడు దీనిని జంపివేయఁగలఁడు. నేనొంటరివాఁడనయ్యెదను భార్యలేక ఒంటరిగా జీవించుట మృత్యువునకు మించిన దుఃఖకరమైనది. ఇల్లాలు యింటికి లక్ష్మి, ఇల్లాలివలననే యింటికి శోభ అదియే యింటిపనులన్నియును జూడ గలదు. అదిలేకున్న నీపిల్లలను జూచువారెవరు ? దుఃఖములో నాకు ధైర్యమును జెప్పఁగల వారెవరు ? నాకు మనోరంజనమును గావింపఁగలవారెవరు ? ఆమె నాతో నెన్నో విధముల మధుర వచనములు పలికెడిది, ఎంతో ప్రేమించెడిది. నేఁటితో నాభాగ్యము పోయినది. నేన ర్ధాంగి విహీనుఁడనై, అనాథుఁడనై, ఆశ్రయహీనుఁడనెడను. నా ప్రియపత్ని లేక నేనెట్లు జీవింపగలుగుదును. ఆమె నాకు

ముందుపెట్టి తాను దినుచుండెడిది. నా సంకేతముల నన్నిటి నెఱిఁగెడిది. ఆమెలేక నాజీవనము శూన్యమును శుష్కమును నీరసమునై యున్నది."

బాలకుఁడిట్లనెను:- "రాణులారా! ఈ విధముగ నాపుంజు వివిధ విధముల శోకించుచు నేడ్చునంతలోఁ జెట్టుక్రిందనున్న వ్యాధుడొక్క బాణముచే నాపుంజును గుఱిచూచి కొట్టెను. బాణము పుంజు ఱొమ్మున దిగఁబడెను. వెంటనే అది చచ్చి క్రిందఁబడెను. క్షణము క్రిందటఁ దన భార్య మృత్యువునకై దుఃఖితుఁడైననాతఁడు తానే మృత్యువాతఁబడవలసి వచ్చెను. తానే అసువులను బాసెను. అదే విధముగ మీరును నీరాజర్షి కొఱకు దుఃఖించుచున్నారు. ఒకానొకప్పుడు మీరును నిదే విధమునఁ బోవలసివచ్చును. ఒకానొక దినమున మీరును మృత్యు జాలమునకు గ్రాసము కాఁగలరు. నీవీ విధముగ నూఱు సంవత్సరములు కూర్చుండి యేడ్చినను మీకు మరల సుయజ్ఞుఁడు లభింపఁడు."

హిరణ్యకశిపుఁడు తన తల్లిని సంబోధించుచు నిట్లనెను:- "అమ్మా! అదే విధముగ నీవెంతగా విలపించినను నీ పుత్రుఁడగు హిరణ్యాక్షుఁడిప్పుడు తిరిగి రాఁజాలఁడు. ఆతనిఁగాల రూపుఁడగు గృష్ణుఁడు సూకరరూపమునఁ జంపిపరలోకమునకుఁ బంపినాఁడు. ఆ బాలకుని మాటలు వినుచుండఁగా నారాత్రి యంతయును గడిచిపోయెను.

రాత్రి గడవఁగానే అందఱకును మెలకువవచ్చెను. ఆ జ్ఞానియగు బాలకుని మాటల ప్రభావమందఱిపైఁబడెను. ఇంత వఱకును జచ్చిన తమ పతినిఁ కౌగలించుకొనుచు నేడ్చుచుండిన నారాణులాతని వదలివైచిరి రాజుయొక్క బంధువులు చితినిఁ బేర్చి శాస్త్రీయ విధిచే నాతనికి దహనసంస్కారములు కావించెను. అనంతరము సమస్త ఔర్ధ్వదైహిక కర్మల నొనర్చెను. చూచుచుండఁగనే ఆ బాలకుడంతర్ధానమయ్యెను.

శౌనకుఁడిట్లనెను:- "సూతా ! ఐదారేండ్ల పిల్లవానికింతటి జ్ఞానము కలుగుటచే నాకు చాలా ఆశ్చర్యమైనది. ఆ బాలకుఁడెవరు ?"

అంతసూతుఁడిట్లనెను :- "మహాభాగా ! ఈ బాలకుఁ డెవరోకాదు సాక్షాత్తుగ యమధర్మరాజే బాలక వేషము ధరించి దయావశమున సుయజ్ఞుని కొఱకు విలపించుచున్న బాంధవులకు ధైర్యము చెప్పుటకై వచ్చినాఁడు."

ఈ విధముగ హిరణ్యకశిపుఁడు తన తల్లికినిఁ మఱదలకును, తమ్ముని కొడుకులకును గూడ జ్ఞానోపదేశము నొసంగెను. ఆతఁడిట్లనెను :- "మీరు ద్వైతభావమును వీడుఁడు తన వారి కొఱకును, బరాయివారి కొఱకును జింతనొందకుఁడు ప్రపంచములో నందఱును దనవారే, అందఱును బరాయివారే ఆత్మ తప్ప మిగిలిన వన్నియును పరాయివే, త్యాజ్యములే, ఆత్మ కతిరిక్తముగ నీ ప్రపంచములో నింకొకటి లేనేలేదు. కావున

నన్నిటిని(దమయాత్మగా(జూడుడు. అన్నిటియందును స్వాత్మనే దర్శించుకొను(డు."

దేవర్షియగు నారదు(డు ధర్మరాజగు యుధిష్ఠిరునితో( జెప్పుచున్నా(డు :- "రాజా ! ఈ విధముగ హిరణ్యకశిపు(డు తన తల్లికిని మిగిలిన వారందఱకును దెల్పు(గా నందఱును ధైర్యమును వహించిరి. హృదయమునుండి అజ్ఞాన జన్యమగు శోకమోహములను దీసివైచుకొనిరి,

దితియిట్లనెను :- "వత్సా ! నీవు గొప్ప అత్మతత్వమయ మగు గూఢ విషయములను జెప్పితివి. ఇప్పుడు నా శోకము చాలా వఱకు తగ్గిపోయినది. శోకమును ద్యజింపుమని నేను నా కోడలికి గూడ చెప్పు(గలను, ఈ పిల్లలింకను, జిన్నవారే కదా : వీరికిని నేను తెలియ(జెప్పెదను. నీవిప్పుడు ముందు నీ కల్యాణమును గూర్చి చింతించుకొనుము. అట్లొనర్పకుండిన నీ దేవతలు నీ మీదను శత్రుత్వమును వహించెదరు."

అంత హిరణ్యకశిపు(డిట్లనెను :- "అమ్మా ! నీవు నాచింతను బెట్టుకొనకుము. నేను నాపురుషార్థము చేత మృత్యువునుగాల(దన్న గలను."

నారదు(డిట్లనెను :- "రాజా ! ఈ విధముగ(బలికి హిరణ్యకశిపు(డు భవిష్యత్కర్తవ్యమునుగూర్చి గంభీరముగ నాలోచించుచుండెను.

ఛప్పయ

కితనో హూదుఖ కరో భూపకూ అబనహిఁపాట।
తాతేఁ తజికేశోక మోహ అపనేఘర జాట॥
సునిబాలక కీ బాత శోక సబనే తజి దీన్హోఁ।
మిలి సంబధీ సవిధి దాహ నృపశవకో కీన్హోఁ॥
హిరణకశిపు సబతేఁ క హేఁ, బంధుశత్రుకూఁమారిహమ॥
బదలోవధ కోలేఇంగే, తజో శోక సంతాపతుమ॥



## హిరణ్యకశిపుని తపస్సు

ళ౩౯

శ్లో॥ హిరణ్యకశిపూ రాజన్నజేయ మజరామరమ్।
ఆత్మానను ప్రతిద్వంద్వ మేకరాజం వ్యధిత్సత॥
సతేపే మందర ద్రోణ్యాం తపః పరమదారుణమ్॥
ఊర్ధ్వబాహుర్నభో దృష్టిః పాదాంగుష్ఠాశ్రితావనిః॥
--శ్రీభాగ ౭ స్కం ౩ ఆ. ౧-౨. శ్లో

క॥ అజరామర భావంబును
త్రిజగద్రాజ్యంబు నప్రతిద్వంద్వము దో
ర్విజితాఖిల శాత్రవమును
గజరిపు బలమును హిరణ్యకశిపుఁడు గోరెన్॥

వ॥ ఇట్లు గోరి మందరాచల శ్రేణికిం జని యందుఁగాలి పేను
వ్రేల నిలువంబడి యూర్ధ్వబాహుండయి మిన్నుసూచుచు
వాఁడిమయూఖంబుల తోడి ప్రళయంకాల భానుండున్ను
బోలె దీర్ఘ జటారుణ ప్రభా జాలంబులతోడ నెవ్వారికిం దేఱి
చూడరాక పరమదారుణంబైన తపంబు సేయుచుండె॥

....శ్రీ మదాంధ్ర భాగవతము

మనము చేయుశుభాశుభకర్మలకు ఫలము లభించితీరును. వస్తువొక్కటే, పాత్రభేదము చేతను, దాని ఫలములో విపర్యయము సంభవించును. వర్షజల మొక్కటియే. నదిలోఁబడినచోఁ నుత్పన్నమగు. కల్పవృక్షమందఱకు నొకేవిధమగు ఫలము నొసంగును. దానిక్రింద కూర్చుండి యేదికోరిన నదిలభించును. కాని భావనా భేదముచే ఫలములోనంతరము కలదు. ఒక కథ కలదు. ఒకానొక అజ్ఞాని అకస్మాత్తుగ నొక కల్పవృక్షము క్రిందకుఁ బోయెను. అచ్చట అతఁడిట్లనుకొనెను:- ఇచ్చటమంచి సుఖముగనున్నది. నీరుండినచో స్నానముచేసి నీరుత్రాగుదును. తత్క్షణము అమృతోపమానమగు స్వచ్ఛజలాశయ మచ్చట నేర్పడెను, ఆతఁడు స్నానముచేసి జలమును ద్రాగెను. మరల నిట్లనుకొనెను :- "ఈ స్థానమున నొక సుందరభవనముండి, శయ్యకూడనమకూడిన హాయిగనిద్రించెదను." వెంటనే భవన మేర్పడెను. సుందర స్వచ్ఛశయ్యయేర్పడెను. అంత నిచ్చటసుందర భక్ష్య పదార్థంబుండినచోఁబొట్టనిండ భోజనము చేయుదునను

కొనెను. నిమిషములో ఆఱు పిండివంటలతో భోజన మేర్పడెను. ఆతఁడు కడుపునిండఁ దినెను. "ఇంత చక్కని భవనములో నేకాకిగా నుండుటేమిటి ? ఒక్క స్త్రీకూడ నుండినచోఁ దానితో మాటలాడుకొనుచు నుందును." అనుకొనెను. చూచుచుండఁగనే స్త్రీకూడ వచ్చెను. ఇప్పుడాతనికి సందేహము కలిగెను :- "అనుకొన్నవన్నియు నగుచున్నవి. ఇదేమియు మాయకాదుకదా ! నన్నుఁ దినుటకిచ్చటికి రాక్షసి రాలేదుగదా! తక్షణ మా స్త్రీ రాక్షసియై వానినిఁ దినివై చెను. కోరికలన్నిటిని నెఱవేర్పఁగల కల్పవృక్షము క్రిందకు వెడలినప్పుడు దివ్యాతి దివ్య భోగముల నడుగుటయే శ్రేయస్కరము. అచ్చట నేదైనఁ బెద్దవస్తువు నడిగినచో నదియును లభించును. ఇదేవిధముగఁ దపమొనరించి భగవద్భక్తినిఁ గోరుటయే సర్వోత్కృష్టమగు ఫలము తపస్సుచేసి యీ జడశరీరమును గాపాడుకొనుటకు యాచించుటను, పరులను బీడించుటకై శక్తి నడుగుటయును దపస్సును దుర్వినియోగ మొనర్చుటయే. దొఱకిన వస్తువులే కదా. తపస్సును వ్యర్థముకానీయఁగూడదు. కాని యీ వస్తువులచే శాంతి లభింపదు, చిత్తమెల్లప్పుడు నుద్విగ్నము చెంది యుండును. సర్వదా శత్రుచింత యుండనే యుండును,

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లనెను:- "రాజా! ఈ విధముగ తన తల్లిని, మఱదలను, తమ్ముని కొడుకులను నోదార్చి హిరణ్యకశిపుఁడిప్పుడు తాను ప్రపంచములో శూర వీరుఁడును, బలవంతుఁడునగుటకై యుపాయమును వెదుకు

చుండెను, ఆతఁడిట్లనుకొనెను :- "నాదేహము శాశ్వతముగ నజరామరముగ నెట్లుండఁగలదు ? నేనేయుపాయముచేఁ ద్రిలోకములందేకఛత్రాధిపతిగను, నజేయుఁడుగను, సమరవిజయుఁడుగను,అందఱికంటెను త్తముఁడుగను సమ్మాననీయుఁడనుగాఁగల్గుదును ఏ యోధుఁడును నాముందు నిలువఁ జాలకుండవలెను. నన్నెవఁడును జంపరాదు, పరాజితు నొనర్పరాదు. ఇట్లాలోచింపఁగా సమస్తమును దపముద్వారాలభించుననిఆతఁడు తెలిసికొనెను. తపస్సువలన దుర్లభవస్తువు సులభము కాఁగలదు. అసంభవము సంభవము కాఁగలదు. కావున మందరాచలమునకుఁబోయి తపస్సు చేయవలయును."

ఇట్లాలోచించుకొని ఆతఁడు మందరాచలమున నొక. లోతు గుహలోనికిఁబోయి ఘోరతపంబొనర్ప నారంభించెను ఆతఁడేక పాదాంగుష్ఠమున నిలుచుండి చేతులను బైకినెత్తి ఆకాశమును జూచుచు, కొయ్యమొద్దువలె నిశ్చేష్టభావముతో నిలుచుండెను. ఆతఁడుకదలుటయునులేదు, మెదలుటయునులేదు. ఆతని శిరస్సునఁ పెద్ద పెద్ద జడలు పెరిగెను. తపఃకారణమున నాతని ముఖమండలము మెఱసిపోవుచుండెను. ఆతఁడు ప్రళయకాల సూర్యుఁడు మయూఖ మాలలచే సుశోభితుఁడైనట్లు వెలుఁగుచుండెను. అంజనపర్వత శిఖరమువలె నాతఁడు స్థిరభావముతో సహస్రాధిక వర్షముల వఱకు నిలుచుండియే యుండెను.

హిరణ్యకశిపుఁడు తపస్సులో నుండుటను గాంచి దేవతలు సంతసించిరి. ఆతఁడు సమస్తదేవతలను బదవీచ్యుతులఁ

గావించెను. తాను స్వయముగ నింద్రాసనమునఁ గూర్చుండి త్రిలోకములను శాసించుచుండెను. ఇప్పుడు దేవతలు మరలఁ దమతమ పదవులలోనికి వచ్చిచేరిరి. అందరు నిట్లనుకొనిరి;- "మంచిది, యీ దుష్టుఁడిట్లే తపస్సును జేయుచు మరణించు గాక! ఆతని తపస్సు సాధారణమైనదికాదు. ఫలపుష్పములను గ్రహించుట యట్లుంచుడు, ఒక్క జలబిందువునైనను గ్రహించుటలేదు. ఆతని రక్త మిగిరి పోయినది. మాంసచర్మములను బురుగులుఁ దినివైచినవి. కేవల యెముకలగూడు మిగిలినది; కాని ఆతఁడు తన చిత్తమును దపస్సు నుండి మర్పలేదు. ఇట్లు వేలకొలది దివ్యవర్షములు ఘోరతపం బొనరించెను.

ఆతని తపస్సు పరపీడనిమిత్తముగఁ దమోగుణమైనది. అందువలన నాతని కపాలమునుండి తమోమయము, ధూమ యుక్తమునగు నగ్నిజ్వాల ఒకటి ప్రకటమయ్యెను. ఆ యగ్ని త్రిలోకములందు వ్యాపించి ప్రాణులనందరును సంతప్తులఁగావించుచుండెను. ఆతమోమయాగ్నివలన దశదిశలందును దుర్ధర్ష దాహము వ్యాపించెను. ద్వీపపర్వత, నదీనదములతో నుండిన పృథివి గజప ; నౌకమీఁద నెక్కిన నటునిటు నూగినట్లూగెను. కూప, నదీ, నద, సముద్రములలోని జలము తొణికిసలాడుచుండెను. గ్రహనక్షత్ర తారలుతెగి భూమిమీఁదఁ బడుచుండెను. సర్వత్ర హాహాకారములు చెలరేగెను. ప్రాణులాతని తమోమయ తేజఃప్రభావమును సహింపఁ జాలకపోయెను. మానవలోకము లోని ప్రాణులు దీనికిఁ గారణమును గ్రహింపఁజాలకపోయిరి.

దేవతాగణము తమోమయజ్వాలా సంతప్తులై యాలోచింపసాగిరి. అందఱునొక్క సభను జేసికొనిరి. దానిలో దీనికిఁ బ్రతీకార మేమి చేయవలయునను విచారణవచ్చెను. ఆ దుష్టుఁడు తన ప్రయత్నములోఁ దానుండెను. వీనిని మనము తపస్సుచే నివారింపఁజాలము. ఇప్పుడేమి చేయవలయును. ఈ విషయమునఁ జాల సేపటివఱకు వాదవివాదములు జరిగెను. చివరకింద్రుఁడిట్లనెను:- "ఈతనిని దపస్సునుండి నివర్తింపఁజేయుట మనకుఁజేత గాని పని. అందఱమును గలిసి లోకపితామహుని కడకుఁబోవుదము. ఆతఁడే యీ సమస్త బ్రహ్మాండమునకును స్వామి మన మాయనచే సృజింపఁబడినవారము. ఆతనికే నివేదించెదము. తరువాతఁ నాతడేదియుచితమని తోఁచిన నట్లుచేయఁగలఁడు."

నారదుఁడిట్లనెను:- "రాజా! ఇట్లు నిశ్చయించి యింద్రుని ముందుంచుకొని సమస్త దేవతాగణము బ్రహ్మలోకములోఁబితామహుఁడగు బ్రహ్మసభకుఁబోయిరి. దండ ప్రణామ, కుశల ప్రశ్నలనంతరము బ్రహ్మ నవ్వుచు నిట్లడిగెను. "దేవతలారా! నేఁడు మీముఖములన్నియును మ్లానములై యున్నవేల ! నేఁడు మీరందఱును జింతితులై యున్నారేల ? మీ చింతకుఁగారణమును నాకుఁజెప్పుఁడు."

అంతఁజేతులను జోడించుకొని దేవతల పక్షమున దేవేంద్రుఁడిట్లనెను :- "స్వామీ ! ఇప్పుడడుమేము స్వర్గమున నివసించుట అసంభవమైనది."

సంభ్రమముతో బ్రహ్మయిట్లడిగెను :- "ఏమేమి ? ఏమైనది ? అసురులేమైన నుపద్రవములు కావించిరాయేమి ?"

ఇంద్రుఁడిట్లనెను : "ఉపద్రవములుకావించుటేమిటి ? మేమందఱమును దైత్యేంద్రుని తపస్సుకే సంతప్తులమగుచున్నాము. కావున దేవాధిదేవా ! భూమా ! బ్రహ్మన్ ! సర్వ సమర్థుఁడవగు ప్రభూ ! మీరకాలమున ప్రళయమొనర్పఁదలఁపకున్నచో వానిని శాంతింపఁజేయుఁడు."

బ్రహ్మయిట్లడిగెను :- "అది యెట్లు శాంతించును?"

దేవతలిట్లనిరి :- "స్వామీ ! ఇది మీకే తెలియవలయును. ఆతఁడడిగినది మొసంగుఁడు. మాకేమి యుపాయమును చెప్పెదరు ?"

బ్రహ్మయిట్లనెను :- "ఆతఁడేమి యడుగుచున్నాఁడు. ఏ వస్తువు కావలయునని ఆతఁడిట్టియుగ్రతపము నొనర్చుచున్నాఁడు ?"

దేవతలిట్లనిరి :- స్వామీ ! మీకంతయును దెలయును. మీరు సర్వజ్ఞులు, మీకు తెలియనిదేముండును ? అయినను నాజ్ఞయొసంగుచోమేము వాని సంకల్పమును జెప్పెదము. లోక పితామహుఁడగు బ్రహ్మ తన యోగప్రభావముచేసమస్త చరాచర జగత్తునెట్లు పాలించున్నాఁడో అట్లు తాను పాలింపవలయుననియును, బ్రహ్మాండములో నాతఁడెట్లు సర్వశ్రేష్ఠుఁడుగ నెన్నఁబడుచున్నాడో అట్లే తానును నెన్నఁబడవలయుననియును అందఱచే మీరెట్లు పూజింపఁబడుచున్నారో అట్లే తానును

బూజింపబడవలయుననియును, తాను తన ప్రవృద్ధతపోయోగ సమాధులచేఁగ్రమముగ సమస్తోత్కృష్ట లోకములయందాధిపత్యమును బొందవలయుననియు నాతఁడు కోరుచున్నాడు."

ఇది విని బ్రహ్మ నవ్వి యిట్లనెను :- "దేవతలారా ! నా లోకమును బొందుట సాధ్యముకానిపని. ఆతఁడు తన అల్పాయువులో నింతటి ప్రతిష్ఠితపదమును నీ యల్పతపస్సుచే నెట్లు పొందఁగలఁడు ?"

అంత దేవతలిట్లనిరి :- "ఒక్క జన్మలోఁగాకున్న రెండు జన్మలలోఁగాఁగలదు. పది, యిరువది, వంద, రెండువందలు, ఐదువందలు, పదివందలు ఎన్ని దినములలోనైనఁ గానిండు, దీనికాతనికి చింతలేదు. ఈ కాలము నిరవధియనియు, దీని కెన్నటికిని అంతములేదు. ఆత్మ నిత్యము, అజరామరమైనది. దానికెన్నటికిని నాశములేదు. ఎన్ని జన్మలైనఁగానిండు ఆతఁడు సిద్ధినిఁబొందక విడువఁడు. స్వామీ ! ఆతఁడు మీ బ్రహ్మపదవిని గ్రహింపఁగోరుచున్నాఁడు. మీ సింహాసనమున నధికారము వహింపఁదలఁచుచున్నాఁడు. ఆతనికిశివపదముగాని విష్ణుపదముగాని అక్కఱలేదు. బ్రహ్మపదమేకావలయునఁట, ఆతఁడు మీ పదవినిఁబొంద వెఱియెత్తినవానివలె నున్నాఁడు."

బ్రహ్మ నవ్వుచు నిట్లనెను :- "మంచిది, దీనహాని యేమి కలదు ? బ్రహ్మయును మారుచుండును. బ్రహ్మపదముననుండి ధర్మపాలన మొనరింపఁగలఁడు."

అంత నింద్రుఁడిట్లనెను:- "స్వామీ! మీరీ భావములలో నుండవలదు, ఆతనికింకొక యభిప్రాయము కలదు. తాను బ్రహ్మయై యీ సమస్త నియమములను మార్చవలెనని ఆతని యూహ ధర్మము నధర్మముగాఁజేయగలడు స్వర్గములో దేవతల స్థానమున దైత్యులుండఁగలరు. పృథివినుండి జలమును జలమునుండి తేజమును, తేజమునుండి వాయువును, వాయువు నుండి ఆకాశమును నుత్పన్నము కావించెదను, వృక్షములనుండి పురుషుల నుత్పన్నము కావించెదననుచున్నాఁడు. ఈ విధముగ నాతఁడు సృష్టిలోని పాపపుణ్యాదులను విపరీతమొనర్పఁజూచుచున్నాఁడు. జగత్తును గలతపఱచి ప్రాకృతిక నియమములందు సమూలముగఁ దలక్రిందులుగఁ జేయఁదలచుచున్నాఁడు. ఆతఁడు మిమ్ముఁదొలిగించి, మీ పదవియందుండి విపరీతములు చేయఁదలఁచుచున్నాఁడు. స్వామీ! ఇవి మేము వినిన మాటలను జెప్పుచున్నాము, ఇందులో సత్యమెంతయో దాని నెంతవఱకు సఫలతను జెందఁగలమో సర్వజ్ఞులగు మీకే తెలియవలయును."

అంత బ్రహ్మగంభీరుఁడై దేవతలతోనిట్లనెను:- "మంచిది, ఈ విషయములలో మీ అందఱ యభిప్రాయమేమి?"

దేవతలిది విని యిట్లనిరి:- "మాకు మీకు సలహానొసంగ సామర్థ్యమెక్కడిది? దీనిని మీరే నిర్ణయింపఁగలరు. మా యభిప్రాయ మేమనఁగా మీరాతనికిఁ గోరిన వరముల నొసంగి తపస్సునుండి మరలింపవలయుననియే. ముందేమి యుపద్రవ

మును గావింపఁగలఁడో. స్వామీ! మీ పదము నసురులుకూర్చుం డుటకు యోగ్యమైనదికాదు. ఈ స్థానముచే సదా గోబ్రాహ్మణు లకు హితము కలుగుచున్నది. అన్నిటికిని మూలకారణమగుటచే బ్రహ్మపదము కళ్యాణము, విభూతి, కుశల విజయములకుఁ గారణమగుచున్నది. ఆసింహాసనమునకు మీరే శోభ, మీవలననే యిట్టి ప్రతిష్ఠిత పదము నిర్వహింపఁబడుచున్నది. దీనిమీఁద హిరణ్యకశిపు రాక్షసుఁడువచ్చి కూర్చుండెనా పేడ బెల్లమేకము కాఁగలదు.

దేవతల వాక్యములను విని గంభీరుఁడై బ్రహ్మ యిట్లనెను:- "మంచిది, మీరందఱును నిఁకఁబొండు. నేను దీనికేదో ఉపాయమును జూచెదను. ఎట్లు వీలుగానుండిన నట్లు వానిని దపమునుండి నివృత్తికావించెదను. మీరే విషయమునకును జింతింపకుఁడు."

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను:- "రాజా! ఈ విధముగ దేవతల నోదార్పి ఆభవుఁడసురుని కడకుఁ బోవుటకు ద్యుక్తుఁడగు చుండెను.

....o....

# హిరణ్యకశిపుఁడు దుర్లభవరములను బొందుట

౪౨౭

శ్లో॥ తాతేమే దుర్లభాః పుంసాం యాన్వృణీషే వరానమ।
తథాపి వితరామ్యంగ వరాన్యదపి దుర్లభాన్॥

....శ్రీ భాగ. ౭ స్కం, ౪ అ. ౨ శ్లో॥

శా॥ అన్నా! కశ్యపపుత్ర దుర్లభము లీ యర్థంబు లెవ్వారికిన్
మున్నెవ్వారలు గోరరీవరములన్ మోదించితిన్ నీయెడన్
నన్నుంగోరిన వెల్ల నిచ్చితిఁ బ్రవీణత్వంబుతో బుద్ధి సం
పన్నత్వంబున నుండుమీ సుమతివై భద్రైకశీలుండవై॥

....శ్రీ మదాంధ్ర భాగవతము.

తపమెన్నటికిని వ్యర్థముకాదు, తపస్సునకు ఫలమవశ్యము కలుగును. కాని దేహమునే ఆత్మగా భావించి, దేహము నజరామరముగ నొనర్చుకొని లౌకికైశ్వర్యము కొఱకు చేయుతపస్సు రాక్షస తామసతపస్సు. భగవత్ప్రాప్తికొఱకు చేయఁబడుతపస్సే యథార్థమగు తపస్సు. అసురులును దపస్సునుజేయుదురు. భక్తులును దపస్సును జేయుదురు. ఇద్దరికిని తపఃప్రభావమున నిష్టదైవము ప్రసన్నఁమగును. అసురులిట్లు కోరుకొందురు. :- "మా శరీరములు శాశ్వతముగ నుండవలయును. మమ్ముల

నెవరును జయింపరాదు. మేమెవరి శిరస్సుపైఁ జేతినిఁబెట్టెదమో వారు చచ్చిపోవలయును. ఇత్యాది వరములను గోరుకొందురు. కాని భక్తగణమున కిష్టదైవముఁ బ్రసన్నుఁడైనపుఁడిట్లనును. "మాకు ధనమక్కఱలేదు. మాకు వైభవవాంఛలేదు. మాకు ప్రసన్నులై ప్రఖరప్రతిభ నొసంగుఁడని కోరము. మాకు పరివార. దారా, పుత్ర, ప్రియజనములు కావలయునని బాధింపము. ఆ కోరికయును మాకులేదు. కమలనయనా ! హృదయేశా ! మీపాదపద్మములందు మాకహైతుక భక్తి కలుగవలయునని కోరుచున్నాము.

ధర్మరాజగుయుధిష్ఠిరునితో నారదుఁడిట్లు చెప్పుచున్నాడు. "రాజా ! హిరణ్యకశిపుని తపోవిషయమును బ్రహ్మతోఁజెప్పి దేవతలు తమతమ లోకములకుఁబోయిరి. అప్పుడు లోకపితామహుఁడగు బ్రహ్మ తనపుత్రులగు మరీచాదులచే వెంబడింపఁబడుచు హిరణ్య కశిపుఁడు తపుస్సునుజేయు స్థలమునకువచ్చెను. బ్రహ్మ తన హంసమీఁద గూర్చుండియే హిరణ్యకశిపునిఁ జూడఁదలఁచెను. కాని ఆతఁడు కనఁబడలేదు. ఎచ్చటచూచినను దట్టముగ గడ్డి పెరిగియుండెను. వెదురు పొదలు అచ్చటచ్చటఁ జెదలు పుట్టలు పెట్టి యుండెను. విశేషాన్వేషణమొనర్పఁగా నాతనికొక చెదలపుట్టకనఁబడెను దానిమీద వెదురు పొదయుండెను. పెద్దగాపెరిగియుండెను, చెదలచ్చటఁజాల రంధ్రముల నేర్పఱచెను. ధ్యానముతోఁబరికింపగా నచ్చటనే హిరణ్యకశిపుఁడునట్లు నిశ్చయించుకొనెను. ఆతని రక్తమాంసములను చర్మ

మును జెదలును జీమలును బీల్చివేసినవి. కేవలమాతని అస్థులు మాత్రము మిగిలినవి. ఇదిచూచి దయావశమున లోకపితామహుఁడగు బ్రహ్మ ఆతనితో నిట్లనెను :- "దితినందనా! కశ్యపకులకేతూ! లెమ్ము, లెమ్ము, ఇప్పుడు నీ తపస్సు పూర్తి అయినది. నీ సాధనశ్రమ సఫలమైనది. నీవిప్పుడు సిద్ధుఁడవైతివి. లేలెమ్ము. ఇప్పుడిఁక నధికకష్టమును సహింపనవసరము లేదు. నేను నీకు వరము లొసంగవచ్చితిని, నీవు చేసినట్లు తపస్సింతవఱకెవరును జేసియుండలేదు. ముందెవ్వరును జేయఁబోరు నీధైర్యము విలక్షణమైనది. చూడుము. నీ శరీరము తనంను జెదలును, జీమలును, దోమలును, దినివైచినవి అయినను నీవు తపస్సును వీడలేదు. నూఱు దివ్యవర్షములు నీవేమియునుదినక, నీరుత్రాగక, శరీర స్పృహనువీడి తపస్సును జేసితివి. ఇట్టి తపస్సునుజేయఁగలవారెవరు ? నేను నీ దుష్కరకర్మకును. బొగడదగిన సాహసమునకును, తీవ్రతపోనిష్ఠకును, సుదృఢనిష్ఠకును, సుదృఢనిష్ఠకును మిక్కిలిసంతసించితిని, నీవునన్ను నీయిష్టము వచ్చిన వరమును గోరుకొనుము. నన్ను నీవు కోరిన వరము నొసంగెదను. నన్ను దేవాసుర యక్ష గంధర్వాది సమస్తవరదాతలలో శ్రేష్ఠునిఁగజెప్పుచుందురు. నేను నీ మనోరథమును దీర్చెదను. నీవాలస్యమొనర్పక నిస్సంకోచముగఁ గావలసిన వరములను గోరుకొనుము. నీవుమరణ ధర్మముగలవాఁడవు. నేను నిత్యామరుఁడను కావున నాదర్శనము నిష్ఫలముకాదు.

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లనెను:- "రాజా! బ్రహ్మ వివిధ విధముల హిరణ్యకశిపునకుఁ జెప్పెను; కాని అతఁడేమియును వినలేదు. ఆతఁడు చెదలపుట్టలో నట్లే పడియుండెను. తాను వచ్చిన సంగతియును దెలియదని ఆతఁడు గ్రహించి ముందాతనికిఁ జైతన్యము కలిగించవలయునను కొనెను. ఆతఁడు తన దివ్యకమండలములోని అమోఘజలమును నాతనిపై జల్లెను. ఆ దివ్యజలము తాఁకఁగనే అరణిలో నుండి అగ్ని వెలువడినట్లూ వెదురుపొదలలో నుండి ఆతఁడు వెలువడెను. మందాగ్నియందు ఘృతముపడినఁ బ్రజ్వలించినట్లును. ఎండిన మోడుపై నమృతము పడఁగానే చిగిర్చినట్లును, ముడిచిన కమలముపై నమృతము పడఁగానే చిగిర్చినట్లును, ముడిచిన కమలముపై జలము పడఁగానే ప్రఫుల్లితమైనట్లు నయ్యెను. ఏ కమండలమునుండి త్రైలోక్యపావనియు, మనోహారిణియు, జగద్వందితయు నగు భాగీరథి ప్రకటమైనదో ఆ పాపనాశనతరమగు జలస్పర్శకాఁగానే హిరణ్యకశిపుని శరీరము పూర్వముకంటె నధిక దివ్యముగను, సుదృఢముగను దర్శనీయముగను నయ్యెను. ఆతఁడుతేజో బలయుతుడై దర్శనీయముగను, హృష్టపుష్టముగనునై, ఆ వల్మీకమునుండియు, వెదురుపొదనుండియు, గడ్డినుండియు నాతఁడు నిలుచుండెను. అతని శరీరము సువర్ణమువలె మెఱయుచుండెను. దివ్యాభరణము లాతని శరీరమున తళతళలాడుచుండెను. ఆకాశమున హంసపైనున్న లోక పితామహుఁడగు బ్రహ్మను నాతఁడు

గాంచఁగానే ఆతఁడు నిర్ఘాంతపోయెను. సంభ్రమములోఁ బ్రేమ వేగముతో నేమియును జేయఁజాలక భూమిమీఁద దండమువలెఁ బడిధాతకు సాష్టాంగ నమస్కారమును గావించెను. చాలా సేపటివఱకాతఁడట్లే పడియుండెను. ప్రేమావేగము కొంచెము తగ్గఁగానే ఆతనికి బాహ్యజ్ఞానము కలిగి లేచి నిలుచుండెను. ఆతని శరీరమంతయును రోమాంచితమయ్యెను. ప్రేమకారణమునఁ గంఠము గద్గదమయ్యెను. మిక్కిలి కష్టముతో నశ్రువులను దుడుచుకొని ఆతఁడు గద్గదస్వరముతో బ్రహ్మను స్తుతించెను.

సూతుఁ డిట్లనెను :- "మునులారా ! హిరణ్యకశిపుఁడు బ్రహ్మను అవ్యక్త బ్రహ్మభావముతోఁ జాల చక్కగ స్తుతించెను. అందులో నాతఁడు బ్రహ్మనే సృష్టి స్థితిలయములకుఁ గారణముగఁ జెప్పెను. ఆతనినే అవ్యక్త, పురాణపురుష, నిరుపాధిక, చేతనా చేతన శక్తియుక్తుఁడును, జగన్నియంతయును, సర్వజ్ఞుఁడును, సర్వగతునిగను స్తుతించెను. ఆ దివ్యస్తుతిని నేను మరల స్తుతి ప్రసంగమునఁ జెప్పెదను, ఆతని స్తుతికిఁ బ్రసన్నుఁడై బ్రహ్మ మరల నిట్లనెను :- "వత్సా ! నేను నీ తపస్సునకుఁ బరమసంతుష్టుడనైతిని, ఇప్పుడు దివ్యస్తుతి నొర్చి నన్నింకను సంతుష్ఠ నొనర్చితివి, ఇప్పుడు నీవు నీ మనోభిలషితవరము నడుగుము."

బ్రహ్మవాక్యములను వినిహిరణ్యకశిపుఁడిట్లనెను :- "స్వామీ! మీరు సర్వజ్ఞులు; సర్వసమర్థులు. మీరునాయెడలఁ బ్రసన్నులైతిరేని నన్న జరామరునిఁగ నొనర్పుఁడు."

అంత బ్రహ్మ యిట్లనెను :- "ఏ వస్తు వెవరికడనున్నదో దానిని వారి నడుగవలయును. ఒకానొకఁడు శీతలాదేవి నారాధించెను. శీతలాదేవి వాహనము గాడిద. కొంతకాలమున కాతని యారాధనమునకు సంతుష్టయై గార్దభవాహినియగు శీతలాదేవి ప్రత్యక్షమై ఆతనిని వరమును గోరుకొమ్మనెను. ఆ వ్యక్తి యిట్లనెను :- "దేవీ ! నీవు నాయెడల సంతుష్టురాలవగుచో నాకొక చక్కని గుఱ్ఱము నొసంగుము."

ఇది విని కోపముతోనిట్లనెను :- "నేను స్వయముగ గాడిదపై నెక్కితిని, నీకు గుఱ్ఱము నెచ్చటనుండి తెచ్చియివ్వఁ గలను ? గుఱ్ఱమున్నయెడల నేను దానిపైననే కూర్చుండక పోవుదునా ?" కావున నాయనా ! నేను నజరామరుఁడనుగాను. నా ఆయువు నూఱుసంవత్సరములు నిండఁగానే నేనును మారిపోవుదును. ఇంకొక బ్రహ్మ రాఁగలఁడు నా పదవియును స్థిరమైనది కాదు. ఇది నా శక్తికిమించిన పని. భగవానుని మాయ అచింత్యమైనది. దానిని నేనును దాటఁజాలను. నాశక్తిలో నున్నది నేను జేయఁగలుగుదును. నాస్వాధీనములో నున్నది నేను జేయఁగలుగుదును. నీవెంతవఱకు రక్షించుకొనఁదలచుచున్నావో అంతవఱకు రక్షించుకొనుము. నీరక్షణము కొఱ

కెంతగా నాలోచించుకొనుచుంటివో అంతగా నిర్భయుఁడవు కమ్ము."

ఇది విని హిరణ్యకశిపుఁ డిట్లనెను :- "మంచిది, స్వామీ! ఇప్పుడుఁనే నే వరములడిగెదనో వానిని నాకొసంగుము."

బ్రహ్మ యిట్లనెను :- "మంచిది, అడుగుము,"

అంత హిరణ్యకశిపుఁడిట్లనెను :- మంచిది ప్రభూ ! వీరి నుండి నాకభయమొసంగుఁడు."

1. నీచే సృజింపఁబడిన నేప్రాణిచే నేను జావరాదు.
2. ఏ యింటిలోఁగాని, మఠమందుగాని, భవనమందుగాని నేను లోపలఁగాని బయటఁగాని చావరాదు.
3. నాకు పగలుగాని రాతిరిగాని చావురారాదు.
4. ఇతరులచే సృజించేఁబడిన వానివఁగూడ నేను జారరాదు
5. ఏ ధాతువుచేఁగాని, కాష్ఠముచేఁగాని చేయఁబడిన వస్త్రశస్త్రములచే నాకు మృత్యువు రారాదు.
6. భూమిపై నాప్రాణము పోరాదు.
7. ఆకాశమున నెగురుచుండఁగా, వ్రేలాడుచు నాకు చావు రారాదు.
8. మానవులవలనను, పశుపక్ష్యాదులవలనను, సమస్త జాతి జీవులవలనను నాకు మృత్యువు రారాదు.
9. భూమియందుగాక స్వర్గాదిలోకములలో నివసించు దేవాసుర యక్ష, రాక్షస, నాగ, గుహ్యక, కూష్మాండ,

వైతాల, భూత, ప్రేత, పిశాచ, శాకినీ, ఢాకినీ, గంధర్వ, కింపురుష, కిన్నరాది దేవోపదేవతా జాతులచేఁ జావ రాదు.

10. యుద్ధమందస్త్రశస్త్రములను ధరించి నన్నెదుర్కొన జాల కుండవలెను.

11. త్రిభువనములకును నేనే యధీశ్వరుఁడను గావలయును.

12. ఇంద్రాది లోకపాలకులు మీయాజ్ఞను మన్నించెదరు. మిమ్మాదరించుచుందురు. నాకును నట్టి మహిమ రావలెను. నాయాజ్ఞనుగూడ అట్లేనను, నచ అనక మన్నింపవలయును. సర్వత్ర నాయజ్ఞ అప్రతిహతముగఁ జెల్లవలయును. మీకు గల నణిమాది సమస్త సిద్ధులు నాకును గలుగవలయును. యోగాది ప్రభావముచే యోగి జనులకు లభించు నక్షీణైశ్వర్యము నాకును బ్రాప్తింప వలయును. సారాంశమేమనఁగా నేనేవిధమునను మీకు తగ్గిపోరాదు."

ఇన్ని వరముల నొక్కసారిగా విని బ్రహ్మ భయపడెను. ఆతఁడిట్లనుకొనెను :- "ఈతఁడు నన్ను మించదలఁచు చున్నాఁడు. నా సంపూర్ణవిభూతిపై నధికారమును వహింపఁ జూచుచున్నాఁడు." కాని యేమిచేయఁగలడు. మాటనిచ్చి యున్నాఁడు అందువలన నిట్లనెను :- "వత్సా! నేను నీతపము నకు సంతసించితిని. నీవడిగిన వరములు మరణ ధర్మముగల జీవులకుఁ బరమ దుర్లభములు. అభూత పూర్వముగ నీవు తప

మొనరించితివి. నేను నీకు మాటనిచ్చితిని. అందువలన దుర్ల భములైనను నేనన్ని వరములను నొసంగఁదలఁచినాను, నేను వరములన్నిటి నొసంగుచునాన్నాను. తర్వాత భగవంతుని యిష్టము."

నారదుఁడు ధర్మరాజగుయుధిష్ఠిరునితో నిట్లనెను :- "రాజా ! ఈవిధముగ బరమదుర్లభము లైనను నావరములన్నిటిని హిరణ్యకశిపునకొసంగి అమోఘానుగ్రహుఁ డగు బ్రహ్మ దైత్యరాజుచేఁ బూజితుఁడై తనలోకమునకుఁ బోయెను.

హిరణ్యకశిపుఁడు మొదటినుండియు గర్విష్ఠి. ఆతఁడిట్టి శ్రేష్ఠవరములనుబొందఁగానే అతనియభిమానమునకు మేఱలే కుండెను. ఇప్పుడాతఁడు ప్రపంచములో సర్వశ్రేష్ఠుఁడగు శూర వీరుఁడు, పరాక్రమవంతుడు, నిగ్రహానుగ్రహసమర్థుఁడనను కొనుచుండెను. ప్రపంచములో నందఱను దుచ్ఛముగ భావించు చుండెను. తపస్సుచే నాతని శరీరము సువర్ణమువలె సుందర ముగను, తేజోయుక్తముగను నుండెను. ఆతని అంగప్రత్యంగ ముల నుండి దర్పము వెలువడుచుండెను. ఆతఁడందఱను దృణములవలెఁ జూచుచుండెను. ఇప్పుడాతఁడు సమస్తజగత్తును దనవశమున నుంచుకొన నిశ్చయించుకొనెను. ఆతడిట్లకొనెను: "ఈవిష్ణువే దేవతలకు మూలము. ఈతని బలముననే దేవత లెగిరిపడుచుందురు. దేవతలు చెప్పుకొనుట చేతనే నాతమ్ముని వరాహరూపమున విష్ణువు సంహరించినాడు. కావున నే నీవిష్ణువును జంపి నాతమ్ముని జంపినందులకు ప్రతీకార మొనర్చె

దును. దేవతలనాశ్రయహీనులఁ గావించి నాదాసులుగా నొనర్చు కొందును." అని యిట్లాలోచించుకొని భగవంతుని ద్వేషింప సాగెను. ఆతనిఁ దనశత్రువుగా భావించుచుండెను.



# హిరణ్యకశిపుని అనుపమైశ్వర్యము

౪౫౮

శ్లో॥ సర్వసత్త్వపతీన్ జిత్వా వశ మానీయ విశ్వజిత్ ।
జహారలోక పాలానాం స్థానాని సహతేజసా॥

....శ్రీ భాగ. ౭ స్కం, ౪ ఆ. ౭ శ్లో॥

ప్రపంచములోఁ బ్రాణులు ప్రేమచేనైన వశపడుదురు. లేక భయముచేనైనను వశపడుదురు: ప్రేమచేత హృదయముతో వశమదుదురు. భయముచేఁ గేవలము శరీరముచేతను వాక్కుచేతను వశపడుచుందురు. ప్రేమవలనఁ గలిగిన అధీనత తనలో శక్తి లేనంతవరకును నిర్బలత యున్నంతవఱకు నుండును. మరల బలముకలిగి విరోధించుటకు శక్తిరాగానే అధీనత సమాప్తినిఁ జెంది పరాధీనులనొనర్చిన యాతని స్వనాశమొ

నర్పఁ బ్రయత్న మొనర్చుచుందురు. పాశవికశక్తి కొన్ని దినములు సాగును. ఒకానొక దినమున వానికిమించిన బలవంతుడు వచ్చి వానిని హతమార్చును. ఆతఁడుచావఁగానే అందఱును సుఖము నొందెదరు. ప్రపంచములో సర్వత్ర వానిని గూర్చిన నిందవ్యాపించును, కాని భక్తుఁడు మరణించినచో నందఱును వానికొఱకై దుఃఖించెదరు. వానియశసౌరభము ప్రపంచమున సర్వత్ర వ్యాప్తిచెందును. వారు యశముచే నజరామరులగుదురు. ఇది సాధారణులకు సంబంధించిన సిద్ధాంతము. భగవంతుని ద్వేషించువారును నజరామరులగుదురు. ఆతనితోఁ గామముచేఁగాని, ద్వేషముచేఁ గాని, లోభముచేఁ గాని ఇంకెట్టి సంబంధమును బెట్టుకొన్నను నాతఁడమరుఁడగును. ఏదో విధముగ మనస్సును శ్రీకృష్ణునియందుఁ జేర్చవలయును.

ధర్మరాజగు యుధిష్ఠిరునితోఁ నారదుఁడిట్లనెను :-"రాజా బ్రహ్మచే నిట్టి దుర్లభవరములను బొంది హిరణ్యకశిపుఁడు తన యింటికివచ్చెను. తాను విశ్వవిజయము కొఱకు దిగ్విజయమునకుఁ బోవనుద్యమించెను. ఇదివినఁగానే రథ, గజ, తురగ. పదాతిసేన సన్నద్ధమై ఆతని వెంట నడువ నుద్యుక్తమయ్యెను, ఆతఁడు గద్దించి యిట్లనెను:- "బాహుబలము లేనివాఁడు వెంట సేనను గొనిపోవలయును. నేనొంటరిగానే పోయి విశ్వవిజయమును బొందెదను.

నారదుఁడిట్లనెను:- "రాజా! ఇట్లుపలికి ఆ శూరమానియగు దైత్యుఁడు చేతనుగదనుధరించి దిగ్విజయముకొఱకు

బయలుదేరెను, ముందుగా నాతఁడు సమస్తాసురులకుఁ దన బలమును జూపించెను. అసురులేకకంఠమున నాతనినిఁ దమ చక్రవర్తిగా నొనర్చుకొనిరి. అసురులను జయించి ఆతఁడు స్వర్గముపైకి దండెత్తెను. దేవత లీతని పేరు వినఁగానే స్వర్గ మును వదలి పారిపోయిరి. సమస్త స్వర్గీయ వస్తువులపై నాతని కధికారము లభించెను. దేవతలే ఓడిపోఁగా నిఁకనుపదేవతల విషయము చెప్పవలసిన దేమున్నది? గంధర్వ, నాగ, గరుడ, సిద్ధ, చారణ విద్యాధర, పిత, యక్ష, రాక్షస, భూతప్రేత, పిశాచ, వైతాల, గుహ్యక, కూష్మాండ, మనుష్య, ఋషి,ముని, మను, ప్రజాపతి, గణాధిపతులందఱు నాతని ప్రభావమును గాంచి హతప్రభలైరి. అందరును లొంగిపోయిరి. ఈ విధముగ నాతఁడు దశదిశలను, త్రిలోకములను దనవశము కావించుకొనెను. ఎవరెవరి కేయే మంచి స్థానములు కలవో వానినన్నిటిని నీ దైత్యుఁడు లాగివైచెను. ప్రపంచములోగల నుత్తమ రత్నముల నన్నిటిని నేరికోరి ఈతఁడు తనభవనమునఁ గూడబెట్టెను. ఇప్పుడీతఁడు భూమిపై నివసించుటమానుకొనెను.ఇంద్రుని అమరావతినే తనరాజధానిగాఁ జేసికొనెను.

బ్రహ్మయొసంగిన వరములవలన దైత్యునకు భయమే లేకుండెను. ప్రపంచములో దనకెవరును శత్రువు లేకపోవుటచే నాతనికే విషయమునను జింతలేదు. మానవునకుఁ జింతా భయ ములు లేనప్పుడు వానికిఁగళాకౌశల వృద్ధియు, నానా విధము

లగు నలంకారములు ఇంద్రియసుఖములుస్ఫురించును. ఇప్పుడా దైత్యుఁడు స్వర్గమందుండి సుఖోపభోగములొనర్చుచుండెను.

స్వర్గశోభనుగూర్చి, చెప్పవలసినదేమున్నది. దివ్యనందన వనమందెన్నడునువాడని కల్పవృక్షములలోని దివ్యపుష్పములు స్వర్గమునంతను సువాసితమొనర్చుచుండ, అమరావతీ నగరమందు విశ్వకర్మచే స్వయముగ నిర్మింపఁబడిన నసుపమోద్యానవనములుండు, త్రైలోక్య శోభాశ్రయమును, నిఖిల వైభవసంపన్నమునగు స్వర్గమందు దేవాంగనలతో నాతఁడు విహరించుచుండెను.

నవయౌవన మదమత్తలగు స్వర్గ సురలలనలు సరస సంగీతముచే నాతనిమేల్కొలుపుచుండెడువారు. దేవతలును, ఋషులును, మునులును, సూతమాగధులవలె నాతని స్తుతించు చుండిరి. ఆతఁడుండు మేడయును శయనగృహమును, పాన గృహమును, క్రీడాగృహమును నన్నియును సుందరముగనలంకరింపబడి కళాకౌశలపూర్ణముగ నుండెను. కనకముచేఁగట్టబడిన యిండ్లలో విద్రుమ నిచ్చెనలు వేయబడియుండెను. వాని వానిపాంగణము మరకతమణులచే నిర్మింపబడియుండెను. దూరమునుండిచూచిన నముద్రములోని అలలెగురుచున్నట్లుండెను. భవ్యములగు భవనభిత్తికలు స్ఫటికమణి నిర్మితములు, వాటినిఁ జూడఁగానే కన్నులు మిరుమిట్లుకొల్పును. దానిలోని స్తంభములు వైడూర్యములఁజేయఁబడినవి. ఆ భవనమేమో కాదు మణి ముక్తాలయమా శోభాసముద్రమా యనునట్లుండెను. దాని

కలంకారము కళాకోవిదులును, సౌందర్యవిశారదులునుమిక్కిలి శ్రద్ధతో చేసిరి. చాందినీ, ముత్యాలసరములచేఁ జేయఁబడిన నలంకారము యొక్క చాకచక్యమున మిఱుమిట్లుకొలుపు చుండెను. వానిలొ నచ్చటచ్చట పద్మరాగమణులతోఁజేయఁబడిన వాసనము లమర్పఁబడినవి. ఆ భవనములుసమస్త ఋతువు లందును సుఖాదాయకముగ నుండెను. వానిలో నెల్లప్పుడును వాసంతిసుషమావిరాజిల్లుచుండెను. అచ్చట వేడియునులేదు• చలియునులేదు.వాయువు మందముగను, సుగంధితముగను వీచు చుండెను. అచ్చట శయ్యలు సుఖదముగను, స్వచ్ఛముగను, సుందరముగను, సమస్త సుందర సామగ్రులచే సుసజ్జితములై యుండెను.వానియందు మిక్కిలి కోమలములుగను మెత్తగనున్న పరుపు పరుపఁబడియుండెను. దుగ్ధఫేనమువలెను, శ్వేతశంఖ మువలెను, కొంగ ఱెక్కవలెనున్న శుభ్రవస్త్రములు వానిపైఁ బరువఁబడియుండెను. సుందరసుగంధిత పుష్పములయొక్క సుకోమల కవిలచే నవి పనితనముతో నలంకరింపఁబడియుం డెను. వానిలో ముత్యాలసరములు వ్రేలాడుచుండెను. అత్యంత సుఖస్పర్శనౌసంగు సుకోమల వస్త్రములు కప్పుకొనుటకుండెను. తలయంపిని పుష్పదళములకంటెను గోమలములుగనున్న దిండ్లుండెను. అచ్చటనున్నవి నూనెతో వెలిగింపఁబడు దీపములు కాదు ప్రకాశవంతములగు మణిదీపములచే నవి వెలుఁగుచుం డెను. సన్నని నడుములు, మృదుహాసములు, సుందరదంత ములు కలిగిన మదవతులు తమ యౌవన మదముచే మధుపాన

మదమత్తలై అసంఖ్యాకములుగఁదమ నూపురయుక్త పదమ్ముల యొక్క లలితగతిచే సదా సంగీతమయమొనర్చుచుండెను. వారి నూపురధ్వనులచేతను, కరకంకణాది ఆ భూషణ ఝుంకారమ్ములచే నా సురభవనము మాటలాడుచున్నట్లును, పాడుచున్నట్లుండెను. కులుకుచు, బెళుకుచు రత్నస్థలములందుఁదమ మనోహర ముఖములను జూచుకొనుచు గిలకిలనవ్వుచు, పరియాచకమ్ములాడుచు, గనుబొమ్మలెగుర వేయుచు దేవాంగనలా భవనమ్ములందు విహరించుచుండెను. వారికే వస్తుచింతయునులేదు. సమస్త సామగ్రులువారి సంకల్పము మాత్రముననే ప్రాప్తించుచుండెడివి. ఇదివఱకు వారు దేవేంద్రుని సంతోషపెట్టెడివారు. ఇప్పుడు సదా దైత్యరాజగు హిరణ్యకశిపునకుఁపరిచర్య చేయుచుండిరి.

దైత్యేశ్వరుడగు హిరణ్యకశిపు డెంతటి సౌందర్యప్రియుడో అంతటి కఠోరశాసకుఁడు ఆతనిముందు తలయెత్తుటకెవరికిని సాహసములేదు. ఆతఁడు మహాబలి, మనస్వి, ఓజస్వి, త్రైలోక్య విజయుఁడు, ప్రపంచములో సర్వశ్రేష్ఠుఁడగు శూర వీరుఁడు. వరప్రభావముననాతని సమ్ముఖమున సమర్థమ్మున్న న్నస్త్రములను గైకొని శత్రువులు నిలువఁజాలరు ఎవని తేజస్సమ్ముఖమున దేవతల ఓజోతేజములు వమ్మైపోయినవో అట్టి దేవతలిప్పుడాతనికి సేవలొనర్చుచుండిరి. ఆతని యెదుటఁగన్నెత్తి చూచుట కెవరికిని సాహసము లేకుండెను. ఆతఁడుత్కటగంధముగల మదిరాపాన మొనర్చెడు వాఁడు ఆ కారణమునాతని

యెఱ్ఱని విశాలనేత్రములు మత్తుచేనఱకన్నులు పడి కనుబొమ్మ లెత్త బడియుండెను. తప స్తేజ ఓజములందును, పానమునందును, బరాక్రమము నందును, శారీరకబలమునందును నాతనికి సమానులు త్రిమూర్తులు తప్ప యింకెవరును లేకుండిరి. ఇంద్రాగ్నియమవాయుకుబేరాది దిక్పాలురు చేతులలో నుపహారములను గైకొని యెదురుగా నిలువఁబడుచుంచురు. ఆతఁడెప్పుడాజ్ఞాపించిన నప్పుడుఁలేచును ఎప్పుడు కూర్చుండుమనిన నప్పుడు కూర్చుందురు. ఇంతటి కఠోరహృదయుఁడైనను నాయసురుఁడు సంగీతప్రియుడు, విశ్వావసు, తుంబరాది గంధర్వులు సదా ఆతని సభయందాతనిఁగూర్చి గుణగానమొనర్చుచుందురు. ఋషి, ముని సిద్ధ, విద్యాధరాదులాతనినిఁబ్రస్తుతించుచుందురు. రాజా! ఇన్నిమాటలేల? నేను నాతనిగూర్చి గుణగాన మొనర్చుచుందును."

ఇది విని నవ్వుచు ధర్మరాజిట్లనెను :- "స్వామీ ! మీరు భగవదవతారులు, మీరు దుష్టుని గుణములేల గాన మొనరించెదరు ?"

శీఘ్రముగ నారదుఁడిట్లనెను :- "రాజా ! బలవంతుని సమ్ముఖమున నవతారత్వము మొదలగున వన్నియును దిగతుడుపు. ఆ సమయమున రజస్తమ యుక్తమగు దామసావతారపు రోజులు అన్నియును వానివాని కాలము వచ్చినపుడు ప్రకాశించుచుండును. ఎందఱో బలవంతులగు క్షత్రియులముందు పరశురాముఁడెంతగా వెలిఁగినాఁడో మనకు తెలిసినదేకదా. సహస్ర

బాహువుకూడ అవతారమే కాని పరశురామావతారము ముందా తని తేజము హతమైనది, క్షత్రియ లెవరును నాతని నెదుర్కొనఁ జాలపోయిరి. ఇరువదొక్కసారి వెదకి వెదికి ఆతఁడు వృథివి యందలి క్షత్రియుల నందఱను జంపి నిఃక్షత్రియులను గావిం చెను. ఆతని రోజులు దాటిపోఁగా రామచంద్రమూర్తి యెదుటఁ బరాజితుఁడయ్యెను. లజ్జితుఁడై తేజోనిహీనుఁడై తపస్సునకు బోయెను. అదే విధముగ నా యసురునిముందర నా యవతార మును గూడ మఱచితిని. నేనుమ నాతని నామోదింప వలసి వచ్చెను,

ధర్మరాజు నవ్వి యిట్లనెను :- "స్వామీ ? మీరెట్లాతని సభకుఁబోయితిరి."

అంత నారదుఁడిట్లనెను :- "రాజా ! నీకు ? తెలియును గదా నేను సంగీత వ్యసనము కలవాఁడనని. గానమనిన నాకు ప్రీతి, ఎల్లప్పుడును నే నీస్వరబ్రహ్మవిభూషితమగు వీణమీఁద సుమధుర భగవన్నామములను గానము చేయుచుందును. తుంబుర గంధర్వునితో నాకు మైత్రికలదు, ఒక దినమున నా గంధర్వుఁడా దుష్టునితో నిట్లనెను :- "మహారాజా ! ఒక తాంబూర సాధువుకలఁడు. ఆతఁడు బాగుగాఁబాడఁగలడు." ఇంకేమున్నది. ఆతఁడు వెంటనే ఆ సాధువును బట్టుకొని రమ్మని యాజ్ఞాపించెను.

తుంబురుని స్వభావము నాకుఁ దెలియును. ఆతఁడు నావద్దకు వచ్చి యిట్లనెను :- "నారదా ! ఇప్పుడు స్వర్గములో

గొప్ప సంగీత గోష్ఠి జరుగుచున్నది. ఇప్పుడింద్రుఁడైన నసు రుఁడు మిక్కిలి సంగీత ప్రియుఁడు మంచి మంచి గాయక గంధర్వులను, అప్సరసలను నాతడు పిలిపించినాఁడు. ఒక దిన మున నీవును రావలయును."

రాజా! సంగీత ప్రియునకు సుందర సంగీతము శ్రవ ణములకుఁ దగిలెనా అట్టి యవకాశమును నాతఁ డెన్నటికిని వదలఁజాలఁడు. నేను వెంటనే వీణను బట్టుకొని తుంబురునితోఁ బోయితినిఁ నేను స్వర్గమునకుఁబోయి చూడఁగా నచ్చట సంగీత సాగరము ప్రవహించుచుండెను. అచ్చట నాకు స్వాగత మొసంగువారెవరు. నేను గంధర్వులలోనికిఁబోయి కూర్చుంటిని. అందఱును బాడుచుండిరి ? వినుచుండిరి నేనును దుంబురునితో నిట్లంటిని :- "నేనును బాడుదునా ?" ఆతఁడు సంకేతముతో నిప్పుడు కాదనెను.

మంచి సంగీతము పాడఁబడు చుండెను. నా హృదయము తట తట కొట్టుకొనుచుండెను; పాడవలెనను గుతూహల ముండెను, కాని తుంబురుఁడు నన్ను మాటి మాటికినిఁ గాదను చుండెను. ఆ సమయమున హిరణ్యకశిపుఁడు తుంబురునిపై పు చూచెను. తంబురుఁడు నిలుచుండి యిట్లనెను :- "ప్రభూ! ఈతఁడే దేవర్షి నారదుఁడు, చాల బాగుగాఁ బాడఁగలడు. ఆజ్ఞ యగుచో నీతఁడును బాడఁగలడు."

ఇదివిని యాతఁడు గర్వముతో నంగీకార సూచకముగఁ దలనూపెను. నేను నా వీణను సవరించుకొని దానిమీఁద నాలా పము చేయసాగితిని. నేను రామ కృష్ణ, హరియను నాలాప

మును జేయఁబూనఁగనె ఆతఁడు తన కుటిల భృకుటిని ముడిచి క్రోధకారణమున పెదవులను గొఱుకసాగెను. తుంబురుఁడు ముఖమున గుడ్డను వైచుకొని వేఱొక ప్రక్కకుఁద్రిప్పి నవ్వసాగెను. అప్సరసలు భయపడిరి. గంధర్వులుత్సుకతతో నా వైపు చూచుచుండెరి రాజా ! నేను నవకాశవాదినను సంగతి నీకు తెలిసినదేకదా ! సమయమును బట్టి పనులొనర్చుచుందును అసమయమున ననవసరపు పనులొనర్పను ఇప్పుడీ సమయమున నిచ్చట రామ కృష్ణ హారీయను గానము పనికిరాదను సంగతినిఁ దెలిసికొని, నేను నా రాగములను మార్చి "హిరణ్యకశిపుహారీ" అని ఆలాపించితిని.

తన నామ కీర్తనమును విని అసురుఁడు మిక్కిలి యానందించెను. ఆతఁడు తుంబురు నిట్లడిగెను :- "ఈతాంబూర సాధువు నా నామమును గీర్తించుచున్నాఁడు. ఈతఁడు చాలా మంచివాఁడు. కాని యీ పదమునకు చివర 'హారీ, హారీ' పెట్టినాఁడేమిటి ?"

తుంబురుఁడు విషయమును సర్దెను. ఆతఁడిట్లనెను :- "ప్రభూ ! ఈతఁడీ యప్సరసలను సంబోధించుచునో యప్సరసలారా! ఇది యెంతటి మంచినామమోచూడుఁడను చున్నాఁడు" ఇది వినఁగానే ఆ దుష్టుఁడు సంతుష్టుఁడయ్యెను. కావున రాజా ! నేను హిరణ్యకశిపుహారి శ్రీహరియని యేకీర్తన మొనరించితిని, కాని యాదుష్టుని సంతోషపెట్టుటకై మోసముతోఁ జేసితిని. భగవన్నామము నే విధముగ జేసినను నది కల్యాణప్రదమే.

ధర్మరాజుతోఁ నారదుఁడిట్లనెను :- "రాజా ! ఈ విధముగ నా దుష్టుఁడు స్వర్గసుఖము ననుభవించుటయేకాదు, కాని యజ్ఞాదులలో నింద్ర, వరుణ, కుబేరాది దేవతలకును, లోకపాలురకును లభించు హవిర్భాగములగూడ నాతఁడు హరించుచుండెడువాఁడు. గొప్ప గొప్ప దక్షిణల నొసగుచు నతివైభముగ విధి విధానముగఁ జేయఁబడు యజ్ఞభాగములనుగూడ ప్రబల ప్రభావమున నాతఁడపహరింపసాగెను. సమస్త జడచేతనములన్నియును నాతని భవముచే గడ గడ వణఁకుచుండెడువాఁరు.

ఒక దినమున నాతఁడు భూమిమీఁద దిరుగుచుండెను. ఒకచోటఁ జాలమంది కృషికులు హలములను దీసికొని నేలను దున్నుచుండిరి. అతఁడిట్లడెగెను :- మీరందఱు నింతగాఁ బరిశ్రమనేల జేయుచున్నారు ? ఈ యెద్దులనింతగాఁ గష్టపెట్టెదరేల ?"

కృషికులిట్లనిరి :- "ప్రభూ : భూమిని దున్నకున్నచో బీజములంకురింపవు. బీజములంకురింపకున్నచో నందఱు కన్నమెట్లు ? అన్నము లేకున్న నాఁకలితోఁ జావవలసివచ్చును. కావున భూమిని దున్నుచున్నాము ?"

అతఁడు క్రోధముతో నిట్లడిగెను. :- "దున్నకున్నచో ?"

కృషికులిట్లనిరి :- "అన్నదాతా ! దున్నకున్నచో భూమి ఉర్వరగ నుండక ఊసరగ నైపోగలదు. అప్పుడన్నము ఉత్పన్నముకాదు."

రోషస్వరమున నాదైత్య రాజట్లనెను :- "నారాజ్యములో బృథివికింతటి సాహసమా ? నే నాజ్ఞాపించుచున్నాను. నేఁటి నుండి హలముల నన్నిటిని విఱుగఁదీసి పాఱవేయుఁడు నేలను దున్నకుఁడు. దానిలో బీజములను నాటకుఁడు. మీకే ధాన్యము. ఏ ఓషధి కావలయునో దానిని సంకల్పింపుఁడు. పృథివి వానికి గావలసిన దీయకుండెనా నేను దీనిని ముక్కలు ముక్కలుగా వేసి పాఱవేయుదును."

ఆదైత్యునిఁ గాంచినఁ బ్రతివారికిని భయమే. ఆ దినము నుండి పృథివి దున్నకయే ఆతని రాజ్యమందు యథేష్టముగఁ గోరినఅన్నము నుత్పన్నము చేసెడిది. స్వర్గమున నేసవరికేవస్తువు కావలయునో వారికా వస్తువు లభించుచుండెడిది. పాతాళలోక మున సమస్త రత్నములు నిండిపోయి, అచ్చట ప్రదర్శనాలయ ముగ నేర్పడెను.

ఆతనికి రత్నములు కావలసినచ్చో సముద్రము కడకు బోయిన, సప్తసముద్రములును తమపత్నులగు నదుల ద్వారా ఆతని సమీపమునకు వివిధ రత్నములను జేర్చును సముద్రము వానికి మార్గము నొసంగెడిది. వృక్షము లాతఁడడుగ కుండఁ గనే సమస్త ఋతువులందు స్వాదిష్టములగు పక్వఫలముల నొసంగెడివి. దేవాంగనలతో నాయసురుఁని విహారమునకై పర్వతములు తమ గుహలను మణిజటితములుగ

నొనర్చెడివి సారాంశమేమనఁగా సమస్త జడ చేతనములు వాని తేజమునకు భయభీతలై అనుకూలాచర మొనర్చుచుండెను. ప్రపంచములో నాతడుచితముల ననుచితములుగ నొనర్చు చుండెను. కాని వానిని కాదనుట కెవరికిని సాహసము కలుగుట లేదు. ఆతఁడొక్కఁడే సమస్త లోకపాలుర విభిన్నగుణము లను స్వయముగ ధరించుచుండెడువాఁడు. ఇంద్రుఁడై స్వయ ముగ వర్షమును గురిపించును. కుబేరుఁడై సమస్త ధనముల మీఁద నాధిపత్యమును వహించును యముఁడై దండమునొసం గును, వరుణుఁడై జలచరములను శాసించును.

ఆతని కన్ని సుఖములున్నను, త్రిలోకములందు భోగము లాతనికి లభించుచున్నను, ప్రపంచములో సమస్త ధన, ధాన్య, వాహన, స్త్రీ, శబ్దఁరూప, రస, గంధ, స్పర్శజన్య విషయము లకేకైక స్వామియయ్యును త్రిభువనములకేక మాత్రమగు సామ్రాట్టయ్యును, లోకపాలాధీశ్వరుఁడయ్యును. నాతఁడీ విష యములకతృప్తినే చెందియుండెను. అజితేంద్రియులకెన్ని భోగసామాగ్రులు లభించినను వారెల్లప్పుడును సతృప్తులుగనే యుందురను శాస్త్రకారుల వాక్యము సత్యము.

నారదుఁడిట్లనెను :- "ధర్మరాజా ! ప్రపంచములోని యే ప్రాణికిని నింతటి బలము, ఇంతటి యైశ్వర్యము, ఇట్టి ప్రభావము; ఇంతటి భోగసామగ్రి యే విధముగను లభింపదు. ఈతఁడు ప్రభువునకుఁ బ్రియపార్షదుఁడు కదా ! విప్రశాపమున

నసురయోనియందుఁ బుట్టినాఁడుగదా ! అందువలన నాతని నెవరును నెదుర్కొనఁ జాలకుండిరి. ఈ విధముగ నైశ్వర్య మత్తుఁడై నాయసురుఁడు చాల సంవత్సరములు సంసార సుఖోపభోగములందే గడిపెను.

## దుఃఖితులగుదేవతల మీఁద దీనబంధుని కృప

శ్లో॥ తస్యోగ్రదండ సంవిగ్నాః సర్వేలోకాః సపాలకాః॥
అన్యత్రాలబ్ధ చరణాః శరణం యయురచ్యుతమ్॥
--శ్రీభాగ, ౭ స్కం. ౪ అ. ౨౧ శ్లో॥

ఉ॥ ఎన్నఁడు మాకు దిక్కుగలదెన్నఁడు దైత్యునిబాధ మాను
మే మెన్నఁడు వృద్ధిఁబొందఁగల మెవ్వరు రక్షకులంచు దేవతా
కిన్నర సిద్ధ సాధ్యముని ఖేచరనాయకు లాశ్రయించి రా
పన్నగ తల్పు భూరిభవబంధ విమోచనుఁబద్మలోచనున్॥
....శ్రీ మదాంధ్ర భాగవతము

భగవానున కింకొక రూపము కాలము. కాలస్వరూపుఁ డగు కృష్ణుఁడెప్పుడేది కోరునో అప్పుడు కాలము సిద్ధముగ

నుండును. ఒక్కొక్కప్పుడు సాత్త్వికకాలముగను. నొక్కొక్క ప్పుడు రాజసకాలముగను, మఱొకప్పుడు తామసకాలముగను నాకంసారియే క్రీడ నొనర్చుచుండును. ఆతనికి స్వపర భేదము లేదు. ఆతని శరీరములో ధర్మాధర్మములుకలవు. అన్నియు నాతని యిచ్ఛననుసరించియే జరుగుచుండును. ధర్మము నిర్మల మైనపుడధర్మము వృద్ధినొందును. గొప్పగొప్ప దుష్కార్యము లొనర్చు ప్రాణులీ భూమండలమునఁ బుట్టుచుందురు. ఆదుష్టులు ద్భవించి సాధువులను బాధించుచుందురు. ఆ దుష్టులను జంపుట టకును, సాధువులను రక్షించుటకును, మరల ధర్మమును సంస్థాపించుటకును స్వయముగ సాక్షాచ్ఛ్రీహరి యవతరించును అప్పుడాతఁ డధర్మమునణఁచి ధర్మవృద్ధినిఁ గావించును. అధ ర్మమును మూలమట్టముగ నాశనముకావింపఁడు, అధర్మమును బూర్తిగా నాశము గావించునో నాతని నడుము విఱిగిపోఁగలదు అప్పుడీ సంసార చక్రము నడువదు. అప్పుడెల్లప్పుడు కృత యుగమే యుండును. త్రేత, ద్వాపర, కలియుగములుండవు. అధర్మము తన స్థానములో నదియుండును. ధర్మాధర్మములు రెండును దమ తమ హద్దులను దాటకుండ నాతని యిచ్ఛచేతనే యుండును. అధర్మమును నాతని యిచ్ఛచేతనే హద్దునుదాటును అప్పుడు మరల నాతఁడే దానిని స్వాధీనములోనికిఁదెచ్చును. దేవతలు తమ హద్దులలోఁ దామున్నంతవఱకు వారిని రక్షించు చుండును. అసురుల వృద్ధిసమయము వచ్చినపుడు బలవంతు లగు నసురులు దేవతలను స్వర్గము నుండి గెంటివేయుదురు.

అప్పుడు దేవత లటునిటుఁ దిరుగుచుందురు. భగవంతుడప్పుఁడు క్షీరసాగరమున శేషశయ్యయందు మెదలకఁ బడుకొనియుండును, లక్ష్మీదేవిమ్మృదువగు దన యూరువునందు శ్రీహరి పాద పద్మములనుంచుకొని, అత్యంత కోమలములగు దన కరకమలములతోఁ బాదసేవ కావించును. యోగనిద్ర నాశ్రయించి రమారమణుడు నిద్రించును, ఎవరెంత గోలపెట్టినను లేవఁడు. పరుండియే యిట్లనును :- "కాలమును బ్రతీక్షించుచుండుఁడు." దీనిని బట్టి బలాబలులను జేయునది కాలమేనని తెలియవచ్చుచున్నది. కాలమనిననేదో వస్తువుకాదు. శ్రీకృష్ణుఁడే కాలస్వరూపుఁడు."

ధర్మరాజగు యుధిష్ఠిరునితో నారదుఁడిట్లనెను : "రాజా! హిరణ్యకశిపుఁడు స్వర్గమర్త్య పాతాళమున కేకఛత్రాధిపత్యమును వహించెను, ఆతఁడు స్వభావమున దేవద్వేషి. తన తమ్ముని విష్ణువు దేవతల ప్రార్థనముచేఁ జంపెనని ఆతని యూహ. ఈ దేవతలను విష్ణువును నసురకులమునకుఁ గంటకులు, వీరే అసురులవృద్ధిని జూడఁజాలరు. కావున నేదోవిధమున వీరిని నాశనముకావింపవలయునని ఆతఁడాలోచించుకొని సాధారణ ప్రజలను బ్రేమతోఁ బాలించుచుండెను. వారికి కావలసిన పదార్థములనన్నిటిని నొసంగుచుండెను. కాని యాతఁడు దేవతలను మిక్కిలి బాధించుచుండెను. వారితో విషమ వ్యవహార మొనర్చుచుండెను. ఇంద్ర, వరుణ, కుబేరాదిలోక పాలురతో నాతఁడు కఠోరతను వహించుచుండెను. వారిఁ గుణ

జిమ్మించును సదా వారి నవమానించుచుండుసు. త్రిలోకములను వదలి వారెచ్చటికిఁ బోఁగలరు ? హిరణ్యకశిపుని మించిన బలి యుండినచో వాని సమీపమునకుఁబోయి తమ దుఃఖమును జెప్పు కొనెడువారే, విపత్తును విన్నవించుకొనెడువారే, కానిఆతఁడందఱ కధీశ్వరుడయ్యెను. దేవత లొకసారి బ్రహ్మకడకుఁ బోయి దీనులై యిట్లు మొరపెట్టుకొనిరి :- "స్వామీ ! హిరణ్యకశిపు నేదోవిధమునఁ జంపుఁడు. వీఁడు మమ్ముల నత్యధికముగఁ గష్టపెట్టుచున్నాఁడు."

ఇది విని తన పొడుగాటి గడ్డమును నిమురుకొనుచు ధాత యిట్లనెను:- "నాయనలారా! నాకంతయును దెలియును. కాని నేను గొప్ప ధర్మసంకటములోఁబడియున్నాను. తన చేతితో నాటిన విషవృక్షమునైనను బుద్ధిమంతుఁడగువాఁడు నఱ కఁడు నేనే ఆతని కిట్టి దుర్లభ వరముల నొసంగితిని. ఇప్పుడు నేనే వానినెట్లు చంపఁగలను? పైగా చంపు పని నాదికాదు. నేను పుట్టించుటయును, వరములొసంగుటయు నెరుఁగుదును చంపు పని సదాశివునిది. ఆతని కడకుఁబొండు."

హతాశులై దేవతలు రుద్రునికడకుఁబోయిరి. అందఱును మొదటినుండి చివరవఱకు కథను వినిపించిరి. విని కామారి యగు కపర్ది యిట్లనెను:- "నాకెవరియెడలను రాగద్వేషములు లేవు. నేననవసరముగా నెవరినిఁ జంపను ఎప్పుడెవరికి గాలము

సమీపించినదో వానిని౹ జంపుదును. పైఁగా నేను బ్రహ్మసృష్టి కాదనలేను. ఆతని పుత్రుఁడను. నాతండ్రియే తాను జేసిన సృష్టినిఁ దాను అకాలమున నాశము నొనర్పననఁగా నేనెట్లు వానినిఁ బదచ్యుతు నొనర్పఁగలను?"

ఇద్దరు దేవతలిట్లు పలుకఁగా దేవతలు నిరాశనుజెందిరి. ఎవరును వారికి శరణమీయలేదు. ఎవ్వరును వారి దుఃఖములను దూర మొనర్ప నాశను జూపింపలేదు. అన్ని విధములను వారు నిరాశనుజెంది, యింకెక్కడను నాధారములేదని తెలిసికొని వారుశరణ శరణుఁడును, శరణాగత వత్సలుఁడునగువాసుదేవ భగవానుని శరణువేఁడిరి.

భగవంతుఁడాదినములలో క్షీరసాగరమున శేషశయ్య యందు శయనించియుండెను. వివత్కారణమున దేవతలు క్షీర సముద్రమును, ఇక్షుసముద్రమును, సురాసముద్రమును, ఘృత సముద్రమునుదాటి క్షీరసముద్ర తటమునకుఁజేరుకొని, నల్దిక్కు లను వారు తేరిపారఁజూచిరి. వారికి శేషశయ్యగాని, శ్రీహరి గాని కనఁబడలేదు. వారి మనస్సులు రాగద్వేషముచే నిండియు న్నవి, వారికి భగవద్దర్శన మెట్లగును? భగవద్దర్శన మత్యంత దుర్లభమైనది. అనన్యభావమున నాతఁడు కృపఁజూచినచో దర్శ నమొసంగుట నంభవమగును. దేవతలకక్కడ శ్రీహరిదర్శనము కాకపోఁగా దేవతలాసముద్రతీరముననే ఆసనమునఁగూర్చుండి ఘోర తపంబొనర్పఁ బూనుకొనిరి. పాలసముద్రముకడఁ

గూర్చుండిరి. అచ్చట యథేష్టముగఁ బాలతోఁ బెరువును జేసికొని అగ్నిద్వారా దానినిఁ దినుచుండిరి. కాని భగవద్దర్శనమెట్లుకాఁగలదు? విపత్తుతొలఁగుటెట్లు? అందువలన వారు భోజన పానీయములన్నిటినిఁ బరిత్యాగము కావించి కేవలము వాయుభక్షణమొనర్చుచు ఘోరతపస్సును జేయనారంభించిరి.

భగవానుఁడు నిద్రించుచుండెను. హిరణ్యకశిపు దిక్కైన కాతఁడు కన్నులుమూసికొనెను. దేవతలు భగవానుని ద్వారము కడకువచ్చి అనశనవ్రతము నవలంభించుచుండిన నింక భగవంతుఁడేమిచేయఁగలఁడు. ఆయన దయాసాగరుఁడు. కాని హిరణ్యకశిపుని కాలము సమాప్తముకాలేదు. ఆతనిపాపము పరాకాష్ఠనందుకొనలేదు. ఆతఁడాసమయమున నెవరినిఁ జంపఁడు. దేవతల నోదార్చవలసియుండెను. కాని యింకను నిద్రపూర్తికాలేదు. యోగనిద్ర ఆతని యాశ్రయమునఁబడియున్నది. అందువలన నాతఁడు శయ్యమీఁదఁ బరుండియే, కన్నులుమూసికొనియే దేవతలనాశ్వాసింప నారంభించెను. వారుచేసిన కర్మలకుఁ బ్రతిఫలమింకను ముట్టలేదనియే ఆతఁడింకను దర్శనమీయలేదు. వారింకను దర్శనమున కధికారులు కాలేదు. ఇప్పుడే దర్శనమిచ్చునెడల నెదుటఁబడఁగానే చిక్కులోఁబడి ఆసమయమున వీరిని రక్షింపవలసివచ్చును. దేవతలు మాటమాటికినిట్లుమొఱపెట్టుకొనుచుండిరి:- "మాకు శ్రీహరి కనఁబడుటలేదు. చరాచరములకును బ్రభువును సర్వాత్ముఁడునగు శ్రీహరియేదిక్కైన నున్నాఁడో ఆ దిక్కునకు మేము నమస్కారము చేయుచున్నాము. ఎవనిని

ప్రార్థించి నిర్మలశాంతచిత్తులగు సన్యాసులు మరల మరలిరారో అట్టి శ్రీహరికి నమస్కారము.

"యేయథామాం ప్రపద్యంతే తాం స్తథైవభజామ్యహమ్" ఏవరు నన్నే భావముతో భజింతురో, వారికి నేనా భావముతోడనే భజింతును, అని భగవానుఁడు చెప్పినాఁడు. దేవతల కకస్మాత్తుగ నొకి దినమున మేఘగంభీరధ్వనితో నాకాశవాణి వినఁబడెను, అది సాధువుల కభయప్రదాన మొనర్చునదిగనుండెను. అది గంభీరఘోషచే దశదిశలును ప్రతిధ్వనించుచుండెను. ఆకాశవాణి శబ్దము స్పష్టముగ వినఁబడుచుండును. "ఓ దేవతలారా! మీ కందఱకును మేలుకలుగుఁగాక! మీరు భయపడకుఁడు. నిర్భయులుకండు, నిశ్చింతతో ముసుఁగు కప్పుకొని నిద్ర పొండు." అను శబ్దము వినఁబడెను.

చేతులుజోడించుకొని యింద్రుడు డాదిశకుఁ బ్రణామమును గావించి యిట్లనెను :- "భయకారణమున్నంత వఱకు భయముండితీరును. మేమీ యధమాసురుని యుత్పాతములకు మిక్కిలి వ్యాకులతను జెందియున్నాము. అధీరులమై అశరణ శరణులగు మీసన్నిధికి వచ్చియున్నాము."

ఆకాశవాణి యిట్లనెను :- "ఏమియును బాధలేదు. నాశరణమునకు రానంత వఱకే మానవులకు భయము. నాశరణమునకు వచ్చి, నా దర్శనము చేసితిరా సమస్త దుఃఖములు దూరము కాఁగలవు. నా దర్శనము ప్రాణులకు సమస్తమంగళములకును సాధనముగ నుండును."

ఇంద్రుఁడిట్లనెను :- "స్వామీ ! దుష్టుఁడగు నా హిరణ్య కశిపుఁడు మాచేత నీరుపోయించు కొనుచున్నాఁడు, కసువు నూడ్పించుచున్నాఁడు. మా యజ్ఞభాగములను దినుచున్నాఁడు. వివిధ విధముల యాతనలను బెట్టుచున్నాఁడు. ఇంకను మా అందఱ అ........

మధ్యలోనే ఆకాశవాణి యిట్లనెను :- "నాయనలారా ! నాకు చెప్పవలసిన పనిలేదు. అధముఁడగు నా దైత్యుని దుష్టత్వము నాకుఁదెలియును, నేను వాని గర్వ మణంచెదను."

దీనతా స్వరమున నధీరులై దేవతల పక్షమున నింద్రుఁ డిట్లనెను :- "ఎప్పుడణఁచెదరు స్వామీ ! ఇప్పుడీ దుఃఖమును సహింపఁజాలకున్నాము. సహన శీలతకును హద్దుకలదు."

ఆకాశవాణి యిట్లనెను :- ఇంకను వానికి వినాశకాలము రాలేదు. అందువలన నేనిప్పుడేమియును జేయఁజాలకున్నాను. ఇంత కాలము సహించిన వారింకఁ గొంతకాలము సహింపుఁడు. సమయము రాఁగానే వానిని నేను హతమార్చెదను. వీనిని యమ సదనమున కతిథిఁగావించెదను."

దేవత లిట్లనిరి : "స్వామీ ! ఆ సమయమెప్పుడు రాఁగలదు ? వానికి వినాశకాలము సమీపించినదని తెలిసికొను టెట్లు ?"

ఆకాశవాణి యిట్లనెను :- "ఎవఁడైన నకారణముగ దేవతలను ద్వేషించినను, దేవతా పూజలాపించినను, దేవనింద

నొనర్చినను, గోవులకు బాధకలిగించినను, బ్రాహ్మణులతో హృదయముతో శత్రుత్వమును వహించినను, వారిప్రభావమును న్యూనతపఱచుటకు సదాప్రయత్నించినను, వారిని హృదయమున ద్వేషించినను, సాధువు లందశ్రద్ధకలిగి యున్నను, వారి నవాచ్య వచనములు పలికినను, ధర్మమును నభివృద్ధి నిరోధకమని బలికినను, ధర్మచ్యుతి కలిగినను, జగదీశ్వరుఁడనగు నన్ను ద్వేషించినను నాతఁడు త్వరలో నాశము కాఁబోవుచున్నాఁడని తెలిసికొనవలయును."

ఇంద్రుఁడిట్లనెను :- "వీని నన్నిటిని నాతఁడు చేయుచునే యున్నాఁడు."

భగవంతుఁ డిట్లనెను :- "చేయుచున్నాఁడు. ఇంకను బూర్ణముగఁ జేయుటలేదు. ఇంకఁ గొంత కొదువయున్నది. అల్పపాపమునకు శీఘ్రముగ వినాశము కలుగదు. మీరును నైశ్వర్యమదముననిట్టి కార్యము లొనర్చినవారే. నిజము చెప్పవలసి వచ్చినచో మీరు మీరు చేసిన దానికిఁ బ్రతిఫలముగ నిప్పుడు పదచ్యులై తిరి. అసురులును ఉపదేవతలే వారిని మీరు ద్వేషించుచున్నారు. వారి నవమానించుటకై వివిధప్రయత్నము లొనర్చుచున్నారు. ఒక్కొక్కప్పుడు పాషండ మతము నాశ్రయించి మీరును దేవవిరుద్ధాచరణము నొనర్చితిరి. పృథుయజ్ఞమందు పాషండ మతమును బ్రచారమొనర్చినవారు మీరే దేవవిరుద్ధులగు నాస్తికులవలె రూపమును ధరించినవారు మీరే శ్రీకృష్ణావతారమందు మీరే యైశ్వర్యమదమున నా గోవులను

నాశనమొనర్చుటకై సాంవర్తక మేఘములను బ్రేరేపించినది మీరే. గోవంశమును వినాశ మొనర్చుటకు సంకల్పించినదిమీరే. విశ్వరూపుఁడు బ్రాహ్మణుఁడు. అతఁడజాగ్రత్తగానున్న సమయమున మీరే ఆతని శిరస్సును ఛేదించినారు. సాధువుల తపస్సును భంగమొనర్చుకై మీరే స్వర్గమునుండి సుందరులగునప్సరసలను, వసంతుని, గామదేవునిఁ బంపుచుండిరి. మీ స్వార్థము కొఱకు ధర్మమునుగూడ నవహేళనమొనర్చుచుంటిరి. మీకు బుద్ధిచెప్పుటకే వ్రజమందు నీయజ్ఞమును మాన్పించితిని దీనికి నీవనేకవిధములదూషితివి, ద్వేషించితివి, ఈ పాపములన్నిటిని మీరును జేసితిరి, కాని భేదమేమనఁగా మీరు వీని నన్నిటిని వివశులై అల్పముగ నొనర్చితిరి. చేసి పశ్చాత్తామును జెందితిరి. పాప ప్రాయశ్చిత్తమునుగూడ కావించుకొంటిరి. అందువలన మీకు వినాశము కలుగలేదు. అల్పముగ విపత్తు సంభవించి అది అనుభవించుటను బూర్తిచేసికొంటిరి. ఈ హిరణ్యకశిపుని పాపము పరాకాష్ఠము నందుకొనఁగానే నేను వానినివధించెదను. ఇందులకు సందేహమేమియునులేదు."

అంత దేవతలిట్లనిరి :- "స్వామీ ! పాపము పరాకాష్ఠను బొందినట్టు గుర్తేమి కలదు ? దానికేదైన స్థూలమగు గుర్తును జెప్పుఁడు."

ఇదివిని ఆకాశవాణి యిట్లనెను :- "పాప పరాకాష్ఠను బొందుటకు స్థూలమగుగుర్తు భగవద్భక్తులను ద్వేషించుట, భగవద్భక్తులను సాధారణపాపులు ద్వేషింపఁజాలరు. అంతులేని

మహాపాపము లొనర్చినవాఁడే భక్తుల కరిష్టమును గావించును. అట్టివాఁడే వారిని ద్వేషించి బాధించును. నేను గొప్పగొప్ప పాపములను క్షమింపఁగలనుగాని, నాకపరాధ మెనర్చినను విడిచిపుచ్చెదనుగాని భక్తాపరాధిని నేనెన్నటికిని క్షమింపఁజాలను. వానిని నేనైన నవహేళన మొనర్పజాలను. జీవి భక్తులను ద్వేషించినాఁడనిన వాని పాపము పండినదని తెలిసికొనవల యును."

అంత నింద్రుఁడిట్లను :- "స్వామీ ! మేమందఱము మీ భక్తులమే. మమ్ములనాతఁడు ద్వేషించుచున్నాఁడు."

ఆకాశవాణి యిట్లనెను :- "మీరందఱును భక్తులే, భక్తాగ్ర గణ్యులుగారు ఈతడుభక్తాగ్రగణ్యుని ద్వేషించినప్పుడు, ఆతనికి వివిధయాతనలను గలిగించినపుడు నేను వానినిఁ జంపెదను."

ఇంద్రుఁడిట్లనెను :- "స్వామీ ! భక్తాగ్రగణ్యుఁ డెచ్చట పుట్టఁగలఁడు ? ఆతనికి నీతనికి సమావేశము కలుగదేమో ! ఏలననఁగా భక్తులు సాధ్యమైనంతవఱకు దుష్టులకు దూరముగ నుందురు. సాధ్యమైనంతవఱకు వారికడకుఁబోరు."

అంత నాకాశవాణి యిట్లనెను :- "భక్తాగ్రగణ్యుఁడు బయట వాఁడుకాఁడు. ఆతని యింటిలోనే పుట్టఁగలడు. ఈతని నాల్గవ కుమారుడఁగు. ప్రహ్లాదుఁడు. తన పుత్రుడును భగ వద్భక్తుఁడగు నాతని నెప్పుడు ద్వేషించునో నేను వానినప్పుడు చంపఁగలను."

దేవతలిట్లనిరి :- "స్వామీ ! మీరెట్లు చంపఁగలరు ? ఈతఁడు బ్రహ్మనుండి అనేక గొప్పవరములను బొందినాఁడు."

ఆకాశవాణి యిట్లనెను :- "దీనికి మీరు చింతింపకుఁడు. బ్రహ్మ నా కుమారుఁడే. నే నాతని సృష్టి కావలనుందును. కావున నాతఁడు బ్రహ్మవరములచేఁ దేజస్వియైనను నే నాతని వరములను దప్పించుకొనుచు నుపాయముగ నీతనిఁ జంపెదను. ఈతనిని మృత్యు ముఖమునఁ బడవైచెదను."

దేవర్షి నారదుఁడు యుధిష్ఠిరునితో నిట్లుచెను :- "రాజా ! ఇట్లు పలికి ఆకాశవాణి శాంతించెను. ఇఁక మరల నది వినఁబడ లేదు. ఆ దేవవాణిని వినఁగానే దేవతల దుఃఖమంతయును దూర మయ్యెను. వారి ఉద్వేగము శాంతించెను. వారికి భవభయ హరి యగు శ్రీహరి తమ్ముఁ గృపఁజూచుననియు, వారి శోకసంతాప ములను దూరము కావించుననియు విశ్వాసము కలిగెను. ఇంక నెంత దుఃఖ మనుభవింపవలసి యుండునో దానిహద్దు తెలి పెను, ఇప్పుడు మనము భక్తాగ్రగణ్యుఁడగు ప్రహ్లాదుని జన్మ మును బ్రతీక్షింపవలయును, ఈ ప్రపంచమాశమీఁద నిలిచి యున్నది. భక్తవరుఁడగు ప్రహ్లాదుని జన్మము సంభవించెనా మా దుఃఖములన్నియు నాశము కాఁగలవు. హిరణ్యకశిపుని భార్య గర్భవతియయ్యెను. ఆమె గర్భములో భక్తాగ్రగణ్యుఁ డగు ప్రహ్లాదుఁడుండెనని నారదుని వలనఁ దెలిసినది కదా !"

యని వారు నిశ్చింతతోనుండిరి. ఇఁక నీ హిరణ్యకశిపుఁడు చావనే చచ్చినాఁడని వారు తెలిసికొనిరి. కేవలమంతిమ శ్వాసలు మాత్రముకలవని భావించుచు వారందఱును వారి వారి నెలవులకు బోయిరి.

....౦....

# భక్తాగ్రగణ్యుఁడగు ప్రహ్లాదుఁడు

౪౯౦

శ్లో॥ తస్యదైత్యపతేః పుత్రాశ్చత్వారః పరమాద్భుతాః।
ప్రహ్లాదోఽభూన్మహాం స్తేషాం గుణైర్మహదుపాసకః॥

--శ్రీ భాగ. ౭ స్కం ౪ అ. ౩౦ శ్లో॥

వ॥ హిరణ్యకశిపునకు విచిత్ర చరిత్రులు పలువురు పుత్రులుద్భవించిరి. అందు బ్రహ్లాదుఁడు గుణములలో గొప్పవాఁడు, గొప్ప ఉపాసకుఁడు,

భగవద్భక్తికలచోట సమస్త సద్గుణములు సంఘంబులై వచ్చును. భక్తి సమస్తగుణములకు గని. సద్గుణములు భక్తి నాశ్రయించుకొనియుండును. అభక్తులలో గుణము లెక్కడివి అవి మనస్సు వెంటఁ బరువిడుచుండును. మనసుయొక్క స్వాభావిక రుచి విషయము లందుండును. విషయములు దుఃఖ

ములకు మూలము. కావున నభక్తుల నజితేంద్రియుల సమీప మున సద్గుణములెట్లుండఁగలవు. అట్టివాఁడు సదా అశాంతుఁడు గను, చింతితుండుగను, దుఃఖిగను నుండఁగలఁడు. భక్తుఁడెల్ల పుడు ప్రసన్నచిత్తుఁడుగనుండును. అతఁడు సద్గుణములకొఱకు ప్రయత్నింపఁడు. అతఁడు నిరంతరము భగవద్భక్తియందే తల్లీనుఁడగును. సద్గుణములు వచ్చి వాని స్వచ్ఛహృదయ మున నివసించును.

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను:- "రాజా! హిరణ్య కశిపునకు సంహ్లాద, అనుహ్లాద, హ్లాద, ప్రహ్లాదులను నలుగురు పుత్రులుదయించిరి. వీరిలోఁ బ్రహ్లాదుఁ డందరికంటెఁ చిన్నవాఁ డైనను గుణములలో సర్వశ్రేష్ఠుఁడు. అతఁడు బాల్యకాలము నుండియే సరళుఁడు, సుశీలుఁడు, అత్యంత నమ్రుఁడు. తన కంటెఁ జిన్నవాఁడుగా నున్న బ్రాహ్మణుఁడు కనఁబడిననునాత నికి శ్రద్ధతో నమస్కరించును. సదాచారమున కాతఁడు సజీవ సాకారమూర్తి అతఁడెగతాళికి ప్రతిజ్ఞ చేసినను దానినిఁ దప్పఁడు. నవ్వులకైనను బొంకఁడు. అతఁడు తన సమస్తేం ద్రియములను దనవశమందుంచుకొనునుగాని యింద్రియము లకు వశుఁడుకాఁడు. అతఁడు సమస్త ప్రాణులందాత్మభావ ముంచును.కటువచనములెవరైనఁబలికిన మనకు గష్టము కావునఁ బరులను గటువచనములు పలుకఁడు. మనకెవరైన సన్మానము గావించినచో నానందము కలుగును. గావున నాతఁడందఱను సమ్మానించును. అతఁడందఱకును బ్రియుఁడు. అతఁడెవరిని

ద్వేషింపడు. దుష్టులు తప్ప ఆతనిని ద్వేషించువారెవరునుండరు. ఆతఁడందఱకు ప్రియుఁడు ఆతనితో సంపర్కము కలవారందఱును నాతని సహృదయునిఁగ నెంచుచుందురు. సాధువులు, సజ్జనులు, శ్రేష్ఠపురుషులు, భగవద్భక్తుల చరణములకు దూరమున నుండియే సాష్టాంగప్రణామము కావించును. ఆతఁడెల్లప్పుడును వినయముగనుండును. తనకంటెఁ జిన్నవారును, దీనదుఃఖితులును, అనాథులు నగు వారినిఁ దండ్రివలె ప్రేమించును. యథాశక్తిగ వారి యవసరములను బూర్తిగావించును. చేతనైనంతవఱకు వారి కష్టములను బోఁగొట్టుటకుఁ బ్రయత్నించును. తన తోటి వారలను సోదరులవలెఁ జూచును. తాను రాజకుమారుఁడననియు, నైశ్వర్యశాలిననియు, సంపన్నుఁడనియుఁ దక్కువవారితోఁ గలిసి కొనుటకు నప్పుడు నభిమానపడఁడు. తన తోడివారలకీతఁడు రాజ కుమారుఁడు, తాము ప్రజలమను గుర్తేయుండెడిది కాదు. తన సహచరులందఱును దనసహోదరులను భావనతో దనేకలిసిమెలసి యుండెడు వాఁడు. తనకంటె విద్యయందును, దపమునందును తేజమునందును, గుణములనందును నెక్కుడుగనుండువారల నీశ్వరబుద్ధిచేఁబూజించును. వారి యాజ్ఞలన్నిటినిఁ బాలించుచు వారియందాదరబుద్ధినుంచును,

ఆతఁడు జన్మతో విద్వాంసుఁడు, చదువకయే ఆతనికన్ని విద్యలును వచ్చినవి. కాని ఆతనిని విద్యామదమంటనే లేదు. ధనము విషయమడుగవలసినదేమున్న. రాజపుత్రుఁడు కదా! అట్టి యిట్టి రాజకుమారుఁడు కాదు. త్రిలోకములను దన

బాహుబలముచే జయించిన హిరణ్యకశిపుని ప్రియపుత్రుఁడు. ఆతని నామముచే నింద్రాది లోకపాలకులును గడ గడ వణఁకుదురు. ప్రపంచములో బహుమూల్యములగు ననర్ఘ రత్నము లాతని యింటిలోఁ గలవు. అయినను నాతని ధనగర్వమంట లేదు. చూచుట కాతఁడు మన్మథ సుందరుఁడు. ఆతని అంగ ప్రత్యంగములన్నియును సుందరములు. సౌష్టవములు, సుదృఢములు, కండరములు మెలికలు తిరిగినవి. ఆతని నొక్కసారి కాంచినవారు ముగ్ధులుకావలసినదే. ఇంతటి యధిక సుందరుఁడయ్యును నాతనికి రూపగర్వములేదు. ఆతఁడు తన్ను సాధారణునిపలె నెంచుకొనుచుండును. ఆతఁడు కశ్యపమహర్షి వంశములోఁ బుట్టినవాఁడు. అయినను నాతనికి కులగర్వములేదు సాధారణ దైత్యబాలకులతో నాడుచుఁ బాడుచుండును. ఆతనికే విషయమునను గర్వాభిమానములు లేవు.

ప్రహ్లాదుఁడు గొప్పధైర్యశాలి, ఎట్టిదుర్ఘటనగాని, విపత్తుగాని సంభవించినను భయపడఁడు. అతనికి శబ్ద, స్పర్శ రూప, రస గంధములకు సంబంధించిన సాంసారిక సుఖములఁదిసుమంతైనను స్పృహలేదు. ఆతనికి స్వర్గ సుఖములనుగాని, విమాన,నందనవనవిహారాదులుగాని,అప్సరసా సంగమముగాని, అమృతాది పాన సుఖాపేక్షగానిలేదు. ఈ సమస్త సుఖముల కాతఁడుదాసీనుఁడుగ నుండెడువాఁడు. ఆతఁడు సిద్ధుఁడని యనవలయును. ఆతని సమస్తేంద్రియములు, ప్రాణము, మనస్సు, శరీరము ఇవన్నియును సంయతములే. ఆతఁడు కామనా విహీ

నుఁడు, నిష్కాముఁడు, సాంసారిక పదార్థములందు నిర్లిప్తుడు. ఇన్నిటినిఁ జెప్పనేల ? ఆతఁడసురుఁడయ్యెను. అసురభావములు బొత్తుగా లేనివాడు.

దేవర్షి నారదునివలన నిట్టి ప్రశంసా వాక్యములను విని ధర్మరాజగు యుధిష్ఠిరుఁడిట్లనెను :- "స్వామీ ! అసురకులమున వలనఁబుట్టిన వానికట్టి గుణములుండుట మిక్కిలి ఆశ్చర్యకరమగు విషయము. ఆతని కిన్ని గుణము లేసాధనమున లభించినవి ?"

అంత నారదుఁడిట్లనెను :- "ఏ గుణములైనను నేసాధనచేతను లభింపవని నే నిదివఱకే చెప్పియుంటిని, ఆతని కృపచేఁ గొందఱకు లభించుచుండును. ప్రహ్లాదుఁడు గతించి యెన్నేండ్లైనది. ? లక్షలు, కోట్లకొలది సంవత్సరములైనది. అయినను నాతని గుణములు, ఆతని విమలార్తి భూమిమీఁద నిప్పటికిని నిలిచియున్నదిఁ సదా అట్లేయుండును. భగవంతునకును భగద్భక్తులకును భేదమేమియునుండదు. భగవంతుని గుణములెట్లు నిత్యములో భక్తుల గుణములట్లే నిత్యములు, ప్రహ్లాదుని దివ్యగుణములను స్మరించి, పండితజనము నేఁటివరకు వాని ననుసరించుచు భక్తిమార్గమున నగ్రగసరులగుచుందురు. రాజా ! ప్రహ్లాదుని గుణముల సంబంధమున నిప్పుడు నేనేమని చెప్పఁగలను? శేషునివలె నాకును సహస్రజిహ్వాలుండినను నేను ప్రహ్లాదుని గుణములను వర్ణింపఁజాలను. నాకిప్పుడొక్కే ఊహకలదు. మహారాజా ! ఆతని గుణముల మహత్త్వము ఒక్కవిషయమునఁ

దెలిసికొనవచ్చును. ఆతనికిఁ బ్రతిపక్షులైన దేవతలను వారి వారి సభలందు భగవద్భక్తిప్రసంగము వచ్చినపుడు ప్రహ్లాదుని నుదాహరణముగఁ దీసికొందురు. వారును నాతని గుణములనే ఆశ్రయించెదరు. ఈవిషయమునఁ బ్రహ్లాదుని అభిప్రాయమేమి? ఈయవసరమున నాతఁడెట్టి యాచరణము నొనర్చినాఁడని దేవ సభయందుఁ బ్రమాణరూపమున గ్రహించుచుందురు. ఆతని శత్రువులే ఆతని నింతగా నాదరించుచుండఁగా, ఆతని యాచరణమును బ్రమాణగ గ్రహించుచుండఁగా నీవంటి నిర్వైర అజాత శత్రువాతని నాదరించి, ఆతనిఁబ్రమాణభూతముగ నెంచుకొని ననిందాశ్చర్యమును జెందవలసిన పనియేమున్నది ?

ప్రహ్లాదుని ప్రభావమనంతము. ఆతని గుణములనంతములు. వీని నన్నిటిని ననంతకాలమువఱకు వర్ణించుచుండినను బూర్ణముగవర్ణనము పూర్తికాదు. సంక్షేపముగ నాతనికి వాసుదేవభగవానునియందు సహజ స్వాభావిక ప్రీతికలదని చెప్పినఁ జాలును ఈ గుణములు కేవలము నిర్దేశమాత్రముగఁ జెప్పఁబడినవి. ఈగుణములచేతనే ఆతని మహాత్మ్యము సూచితమగును.

నారదుఁడిట్లనెను :- "రాజా ! ప్రహ్లాదుఁడు భక్తులకు ప్రతీకము. భక్తిశాస్త్రములో భక్తులకేయే గుణములు చెప్పబడినవో యెట్టి యాచరణ చెప్పఁబడినదో, యెట్టివైఖరిగూర్చి చెప్పఁబడినదో అవన్నియును ప్రహ్లాదుని దేహమందు ప్రకటమైనవి. ఆతని యాకారముచే భక్తుల యాకారము, ఆతని వ్యవ

హారముచే భక్తుల వ్యవహారములను దెలిసికొనవచ్చును. కావున నత్యంత సంక్షేపమున, సూచన ప్రాయముగ నాతని వేషభాషలను, మానసికస్థితిని దిగ్దర్శనముగఁ జెప్పెదను. ఏమనఁగా భక్తిమార్గ పథికులకు దీనివలన గొప్ప సహకారము లభింపఁగలదు. వారీ విషయములను బాగుగాఁ దెలిసికొని తమ జీవితములందు నిట్టిస్థితి నుత్పన్న మొనర్చుట కేడ్చియేడ్చి ప్రభువును ప్రార్థించుకొందురు. ప్రభువు వాంఛాకల్పతరువు గదా ? ఆతనినే వస్తువును హృదయపూర్వకముగ నడిగినదాని నాతండొసంగఁగలడు. కావున నీవిప్పుడు సంక్షేపమునఁ బ్రహ్లాదుని బాల్యకాల పరిస్థితినిఁగూర్చి చెప్పెదను వినుము."

....o....

## భగవద్భక్తుల స్థితి

౪౬౦

శ్లో॥ న్యస్త క్రీడనకో బాలో జడవ త్తన్మన స్తయా।
కృష్ణగ్రహ గ్రహీతాత్మా న వేద జగదీదృశమ్॥
అసీనః పర్యటన్నశ్నన్ శయానః ప్రపిబన్బ్రువన్।
నాను సంధత్త ఏతాని గోవిందపరిరంభితః॥

....శ్రీ భాగ. ౭స్కం, ౪ అ. ౩౮ శ్లో॥

తే॥ హరిపదాంభోజయుగ చింతనామృతమున
నంతరంగంబు నిండినదైయున నతఁడు
నిత్యపరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి
జడతలేకయు నుండును జడుని భంగి॥

శా॥ పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్‌హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీ నారాయణపాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁడే తద్విశ్వమున్ భూవరా॥

....శ్రీ మదాంధ్ర భాగవతము.

జీవి ప్రకృతిస్థుఁడై నపుడు, జీవస్వభావములో నున్నప్పుడును వానికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధజ్ఞానముండును. అతఁడు యథారీతిగఁ గ్రియలొనర్చును. ఆచారము ననుసరించి వ్యవహారమొనర్చును. లోకమర్యాదను బరిపాలించును; కాని వానిని భూత, ప్రేత. పిశాచాది అన్యగ్రహము లావేశించినపుడు తన స్వభావమును వీడి అస్తవ్యస్తముగ వ్యవహారమొనర్చును. వాని నావేశించిన గ్రహమేది పలికించిన దానినిఁ బల్కును. తనకు స్వాభావికముగనున్న ఆచరణమునకు విలక్షణమగు నాచరణ మొనర్చును.

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను:- "రాజా! మహాభాగవతుఁడగు ప్రహ్లాదుని స్వభావము జన్మచేతనే అలౌకికమైనది. సాధారణముగ బాల్యకాలముననందఱకునునాటలనిన ప్రియము: కాని ప్రహ్లాదుఁడు బాలకుఁడైనప్పటినుండి మిక్కిలి గంభీరుఁడు ఆతఁడు చరపట్టి, దాగుడుమూఁతలు, చెడుగుడు, బిల్లనగ్రోవి మొదలగు బాలుర కనువైన ఆటల కాతఁడెన్నడును బోయెడువాఁడు కాఁడు. ఆటలలోఁగూడ నాతఁడు గోపాలుని బొమ్మను జేసి దానికిఁబూజలొనర్చును, నివేదన మొనర్చునుఁ ప్రసాదమును బంచుచుండును. ఆతఁడేకాంతమునకుఁబోయి భగవంతుని ధ్యానించుచుండెను. జగత్తు నల్లనిదా? పచ్చనిదా, ఎట్టినిదా? ఇవి భోగ్యములా, ఇది అప్రియము అను జ్ఞానమేమియును లేనట్లుగఁ దన్మయతను జెందెడువాఁడు. ఆతఁడు జగత్తునంతను హరిమయముగఁజూచును. అందఱియందు భగవద్బుద్ధినుంచి నమస్కరించును. ఆతఁడన్ని కార్యములను స్వభావానుసారముగ యంత్రమువలె లేకయె క్రియలొనర్చు చుండును. కాని, వానివైపున కాతనికి మనస్సుపోయెడిదికాదు. మనము స్వభావానుసారముగ శ్వాసించునట్లును, గనుఱెప్పను వైచినట్లును, జిలపుట్టిన గోకుకొనినట్లును నాతఁడు శారీరక క్రియలొనర్చుచుండును. మనస్సు సదా మనోహరుఁడగు మాధవుని రూపమాధురియందు మదమత్తమైయుండును. వెఱ్ఱుట ప్రారంభించిన నట్లు వెఱ్ఱుచునే యుండును. బాలోన్మత్త పిశాచులవలెనే సంకల్పము లేకుండెను. గంతవ్య లక్ష్యములేదు. చేరుటకు

నిశ్చయములేదు. కాళ్ళు వానికవియే పోవుచుండును. ఎచ్చట నాగునో ఎప్పుడాగునో ఎంతసేపుండునో తెలియదు. కూర్చుండిన నట్లే కూర్చుండును. పరుండిన నట్లే పరుండును. తల్లిఅన్నము నుబెట్టినఁ దినును. ఆతనికి మంచి చెడ్డ, స్వాదు అస్వాదు, సరస నీరసములను వివేకములేదు, విచారములేదు, జలము లభించెనా త్రాగును, గానముచేయుట ప్రారంభించినచో భగవంతుని మంగళమయ మధుమయ మధురనామములను గుణములను గానమొనర్చును, మౌనమును వహించినచో జాముల కొలఁది సమస్తేంద్రియములను బంధించి మెదలక మౌనధారణ మొనర్చును.

వైకుంఠుఁడు నన్నేల నిట్టి భవాటవిలోఁ బడవైచినాఁడను జిత్తగ్లాని కలిగెనా ఆతనికిఁ జింతచే హృదయము క్షుబ్ధమగును. ప్రభువిరహము స్మరణమునకు వచ్చెనా హృదయము దుఃఖపూరితమగును. కన్నులవెంటఁగారెడు నీరుకారుచునే యుండును. నేత్రముల నుండి నిరంతరమును బ్రవహించు నానందబాష్పములు నవనీరదాభములగు నాతని శ్రీయంగములను దడుపును. ఆహా ! శ్యామసుందరుఁడు నన్ను సంసారసాగరమున విడిచి స్వయముగ దాగుకొనినాఁడను ననుభూతి రాఁగానే అశ్రుధారలు పెల్లుబికి వచ్చును. ఆతఁడు గంటల కొలఁది యేడ్చుచుండును, కొట్టుకొనుచుండును. వెక్కి వెక్కి యేడ్చుచుండును. దీనికి విపరీతముగ నెన్నడైన హృదయమందు భగవత్స్మృతి జాగృతినిఁజెందెనా, లేక హృదయమున

హృదయ సర్వస్వ జీవనధనమును శ్రేష్ఠతముఁడును ప్రాణ నాథుఁడుననగుఁ బ్రభుని సంస్పర్శకలిగెనా ? భావజగత్తున ఆతని నాలింగన మొనర్చుకొనెనా ఆస్పర్శ సుధ ననుభవించి పిచ్చివానివలె నవ్వను. నవ్వినన్లే నవ్వను. ఇతరులు చూచినచో నీతఁడకారణముగఁ బిచ్చివానివలె నవ్వుచున్నాఁడు. ఈతని కేమైన మస్తిష్క సంబంధమైన రోగముండు నను కొందురు."

ఒక్కొక్కప్పు డాతని మనస్సులోని క్రియాలోచనము వచ్చుచుండును. "అయ్యో, నాయీ చర్మపు జిహ్వ వ్యర్థముగ ముఖరూపమగు బిలమందున్నది. దీని యొక్క ముఖ్య కర్తవ్యము భగవద్గుణగానము. అది అట్లుచేయక పరనిందాస్తుతు లొనర్చుచుఁ బరాపవాదము లొనర్చుచున్నది. దీని సార్థకత శ్రీకృష్ణగుణ గానమందే కలదు. అహర్నిశలు భగవన్నామో చ్చారణ మొనర్చుటచేతనే దీనికి సఫలత కలదు. దీనిని నేను సఫల మొనర్చు కొందునని లజ్జనువీడి భవద్గుణ గానమందు సంలగ్నుఁడగు చుండును. జాములకొలది భగవన్నామ కీర్తన మొనర్చుచుండును. మధ్యమధ్యహుంకార మొనర్చుచు, విహ్వలుఁడగుచు, తపతపకొట్టుకొనుచు, నేడ్చుచుఁ గేకలువేయుచు నదే ఆవేశములో లోకలజ్జను వదలి నాట్యమాడును. నాట్యము చేయఁగాఁ జేయఁగా నాతనికి భగవద్భావావేశము రాఁగానే భగవంతుని మధుమయ లీలలు ననుసరించును, ఒక్కొక్కప్పుడు గోవర్ధనమెత్తినట్లు నటించును. ఒక్కొక్క డావులను మేపఁ

భోవు లీలల నొనర్చును. ఒక్కొక్కప్పుడు ధనుర్బాణములను ధరించి రాఘవలీలలను ప్రదర్శించును, ఒక్కొకప్పుడు వన గమన లీలల నొనర్చును.

ఒక్కొక్కప్పుడు భగవద్ధ్యానమందు తల్లీనుఁడై శ్రీహరితన్నుఁ దన కరకమలములతో నెత్తుకొని హృదయమునకు హత్తుకొనినట్లు భావించును. భగవానుని స్పర్శను బొంది ఆతని రోమ రోమము నిక్కబొడుచును, శరీరమంతయును బులకించును, వాక్కురుద్ధమై గద్గదికమగును ప్రియతముని ఆలింగన సుఖముచే శరీరము శిథిలముకాఁగా నేత్రములను మూసికొని అవిచల భావముతోఁ గూర్చుండి ఆనందాశ్రువులను గార్చుచుండును. ఆ సమయమున ముకుళించిన రెండు కమలములనుండి మఱచు బిందువులు రాలుచున్నట్లుండెను.

ఆతని స్థితి అత్యున్నతమైనది. అట్టి స్థితి కాముకులకును విషయాసక్తులకును బ్రాప్తించుట కఠినమే కాదు అసంభవము. ఇది నిష్కించన భగవద్భక్తుల నిరంతర సహవాసముచేతను, హృదయపూర్వకముగ నొనర్చిన భగవత్పరిచర్యచేతను, ఆతని సహైతుక కృపచేతను బ్రాప్తింపఁగలదు. ఇట్టి ప్రేమభక్తినిఁ బ్రాప్తించిన వారు వారు తరించుటయేకాక సమీపవర్తుల నందఱను దరింపఁజేయుదురు. ఇట్లు వృద్ధినిబొందిన ప్రహ్లాదుని భగవద్భక్తివలనఁ గుసంగగ్రస్తులగు వారికి మాటి మాటికిని శాంతినిఁ బ్రసాదించుచుండెను. వారి చిత్తమునందును నానంద

ప్రోత ప్రవహింపజేయుచుండెను. వారినిఁగూడ ఉత్కట స్నేహముచే నాహ్లాదితులఁగావించుచుండెను.

ధర్మరాజగు యుధిష్ఠిరుఁడు నారదునితో నిట్లనెను :- "రాజా ! ఇట్టి భగవద్భక్తుఁడును, ననురాగియు, సాధుస్వభావముగల ప్రహ్లాదుని తోడను హరిద్రోహియును; తనకు దండ్రియునగు హిరణ్యకశిపుఁడు విరోధించినాఁడా ? ఈ విరోధాంతమునఁ జివరకు భగవంతుఁడు నృసింహావతారమునెత్తి ప్రహ్లాదుని తండ్రియగు హిరణ్యకశిపుని వధింపవలసి వచ్చినది."

అను నీ మాటనువిని ఆశ్చర్యముతో ధర్మరాజిట్లడిగెను:- "స్వామీ తండ్రి తన పుత్రునితో నేల విచారించెను ? ఇది చాల ఆశ్చర్యముగ నున్నది."

అంత నారదుఁడిట్లనెను :- "రాజా ! ఇందులో నాశ్చర్యమును జెందవలసినదేమున్నది ? విరోధము భార్యాభర్తలకును, అన్నదమ్ములకును, పితాపుత్రులకును, సంబంధులలోను గలుగుచునే యుండును."

ఇది విని ధర్మరాజిట్లనెను :- "లేదు స్వామీ ! నాయభిప్రాయ మేమనఁగా బుత్రుఁ డెట్టివాఁడైనఁ గానిండు పుత్రుఁడే, అయోగ్యులు. మూర్ఖులునగు బుత్రులయెడలను దల్లిదండ్రుల కనురాగముండును. మోహముండును. శిక్షణము కొఱకు కసరి కొట్టిన నది వేఱువిషయము; కాని ఆతనిని ద్వేషించి వానినిఁ జంప బోవుట చాల ఆశ్చర్యకరమైన విషయము, ప్రహ్లాదుఁడు

మహాత్ముఁడు, వాని సంబంధమున నధికముగ నేనేమి చెప్ప గలను ? త్రిలోకములందు వందనీయుఁడవును, జతుర్దశ భువ నములందును సమానముగ సమ్మానమునుబొందు సాధుపుంగ వుండవును, భగవత్స్వరూపుఁడును, ఆతని గుణములను గూర్చి యెంతగా వర్ణించిననుదనివి తీరదుకదా! ఆతని మహాత్మ్యమును గూర్చి చెప్పుట సూర్యునకు గరదీపికను జూపించుటయగును. ఇట్టి సరళుఁడును, సదాచారియును, ధర్మాత్ముఁడుననగు బుత్రునిఁ దనతండ్రి యేల ద్వేషించినాఁడు ? ఈ విషయమును వినుటకు నాకు మిక్కిలి కుతూహలము కలుగుచున్నది. అది మీకుచిత మని తోచినచో నాకు విస్తారపూర్వకముగఁ జెప్పవలయును."

అంత నారదుఁడిట్లనెను :- "రాజా ! ద్వేషమునకుఁ గార ణము తన యిచ్ఛకుఁ బ్రతికూలాచరణము, ఎంతటి సన్ని హిత సంబంధము కలవాఁడైన సరియే ఆతఁడు మన యిచ్ఛకు విరుద్ధమగు కార్యము నొనర్చినచో, మనము కాదనిన కార్య మున హాతముఁ జేసినచో విరోధము కలుగును. వానికి మన మనిష్టమొనర్పఁ బ్రయత్నించుచునే యుందుము. ప్రయత్న మొనర్చినను మనము వానినేమియును జేయఁజాలము. అప్పుడు మన హృదయము లందు ప్రతిహింసాగ్ని ప్రజ్వలించును. వాని నేదో విధమున సాధించుటకై అధికాధికములగు వనిష్టమును జేయసిద్ధపడుదుము. ఇట్టిదే ప్రహ్లాద హిరణ్యకశిపుల యెడల సంభవించినది."

ఇదివిని యుధిష్ఠిరుఁడిట్లనెను:- "హిరణ్యకశిపుడుప్రహ్లాదునిచే నేమి చేయింపఁ దలఁచినాఁడు? ఏది కాదనుచుండెను? తండ్రి కొడుకును జంపుటకు సిద్ధపడునట్లుగా నీ విషయ మేల ముదిరినది? స్వామీ? ఈ సమస్తవృత్తాంతమును నాకుఁజెప్పి నాకుతూహలమును శాంతింపఁ జేయుము."

అంత నారదుఁడిట్లనెను:- "రాజా! వినుము. ఇప్పుడు నేను మహాభాగవతుఁడగు ప్రహ్లాదుని చరిత్రమును మొదటి నుండియు జెప్పెదను."

సూతుఁడిట్లనెను:- "మునులారా! ప్రహ్లాదుని చరిత్రను నారదుఁడు ధర్మరాజునకుఁ జెప్పినరీతిని, నా గురుదేవుఁడగు శుకమహర్షిముఖమునఁ బరీక్షిన్మహారాజు సభలో వినినరీతిని నేనుమీకువినిపించెను. మీరందఱును దత్తచిత్తులరై శ్రవణమొనర్పుఁడు."

ఛ ప్ప య

జిన కీ లఖి కేఁ భక్త సబీ జనమోహిఁ సుఖారే।
హిరనకశిపు హరినామ సునత ఫటకారే మారే॥
గురుగృహ భేజే పఢన పఢే కాపఢే వఢాయే।
రాజనీతి కే దావ పేఁచ తిని మన నహిఁ భాయే॥
పూఛే ఇక దిన పుత్రతేఁ, అంక లా ఇపుని చూమిముఖ।
సుత! ప్రియ తోక కాలగే, కౌనకాజతేఁ పావౌ సుఖ॥

....o....

# పితాపుత్రులకు మతభేదము

౪౬౨

శ్లో॥ తత్సాధు మన్యే౽సురవర్య దేహినామ్
సదా సముద్విగ్నధియా మసద్గ్రహాత్।
హిత్వా౽౽త్మపాతం గృహమంధ కూపమ్
వనంగతో యద్ధరి మాశ్రయేత॥

-- శ్రీభాగ. ౭ స్కం, ౫ అ. ౫ శ్లో॥

ఉ॥ ఎల్ల శరీరధారులకు నిల్లను చీఁకటి నూతిలోవలన్
ద్రెళ్ళక వీరు నేమను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వమున్నతని దివ్యకళామయమంచు విష్ణునం
దుల్లముఁజేర్చి తానడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ॥

--శ్రీమదాంధ్రభాగవతము.

విభిన్న స్వార్థములు రెండొక్కచో సంఘర్షించినపుడు విరోధము కలుగును. మన యభిప్రాయమునకు విరుద్ధాభిప్రాయము గల వారెందఱో ఉందురు. మాకు విపరీతముగ నున్నా రేమి యని మనము వారితోఁ గలహింపఁబోవుటలేదు. కానిమన పుత్రుఁడు, ఆశ్రితుఁడు, పాలనీయుఁడు, సంబంధి, అధీనుఁడు మనకు విరుద్ధమగు విచారమొనర్చినచో మనకు దుఃఖము కలుగును. వాని యభిప్రాయములను మనముందు ప్రకటించినచో మనకింకను గ్లేశము కలుగును. తమ యభిప్రాయములనువెలి

బుచ్చక, పైగా మన యభిప్రాయముల నవహేళనమొనర్చినను వానిని హేయముగను నుపేక్షణీయముగను జెప్పి ఆజ్ఞోల్లంఘన మొనర్చుచో వానిని మనము యథోచితముగ దండింపవల సియుండును. ఇందు సురలదోషమునులేదు. ఆసురుల దోషమును లేదు. ఇది స్వాభావిక నియమము.

ధర్మరాజగు యుధిష్ఠిరుఁడు నారదునితోనిట్లనెను: "రాజా! ప్రహ్లాదునకును హిరణ్యకశిపునకును గలిగిన యభిప్రాయభేదమును గుణించిన ప్రసంగమును నేను నీకు వినిపించెదను. ప్రహ్లాదుని తల్లిపేరు కయాధు. కయాధు గర్భమున వేలఁకొలది సంవత్సరములున్నమీఁదట ప్రహ్లాదుఁడు పుట్టినాఁడు. పుట్టఁగానే భక్తికి సంబంధించిన ఆటలనే ఆడుచుండెను. పిల్లలేమి ఆటలాడుచుందురో పెద్దవారికి కొందఱికేమియును పట్టదు. విశేషించి పిల్లలు తల్లిదగ్గఱనే నివసించుచుందురు. తల్లి స్వభావమెట్టిదిగనుండునో పిల్లవాని స్వభావమును నట్టిదిగనే యేర్పడును. రాజా! ప్రహ్లాదుని తల్లి నా శిష్యురాలే. అందువలన నాతనికి భగవత్సంబంధమైన ఆటలందును, భగవన్నామ సంకీర్తనమందును, భగవత్కథలందును నడ్డుపెట్టిన వారు లేకుండిరి. కాని ఆమె తన నాథునకు సదా భయపడుచు నీపిల్లవాని మనోభావము బయటపడునేమోనని చింతించుచుండెను. అందువలన నామె సాధ్యమైనంతవఱకాతని భావములను గప్పివేయుటకుఁ బ్రయత్నించుచుండెడిది. ఈవిధముగఁ బ్రహ్లాదుని వయస్సు అయిదాఱు సంవత్సరములు నిండెను.

ఒక దినమున హిరణ్యకశిపుఁడు తన భార్యయగు కయాధువుతో నిట్లనెను :- "ఏమే ! విన్నావఁటే ! ప్రహ్లాదునకిప్పుడు చదువనీడు వచ్చినది, ఇఁక గురు గృహమునకుఁ జదువఁబంపవలయును. మన పురోహితుఁడగు శుక్రాచార్యుఁ డెచ్చటికో వెళ్లెననియు శీఘ్రముగ రాఁడనియు వినియున్నాము."

అంత హిరణ్యకశిపుఁ డిట్లనెను :- "భార్గవభగవానులు లేకున్నచో నాతని కుమారులు శండ, అమర్కులనువారుకలరు. గురువెంతో గురుపుత్రులంతే. గురువులవారు వచ్చువఱకు గురుపుత్రులకడఁ బ్రహ్లాదుఁడు చదువఁగలడు."

కయాధు నిట్లనెను:- "అయితే మంచిదే, రేపు పలకలకు పుస్తకములకుఁ బూజనుజేయించి, ప్రసాదమును బంచిపెట్టించి అక్షరారంభము నొనర్పవలయును."

అంత ధర్మరాజిట్లడిగెను :- "స్వామీ ! శుక్రాచార్యుఁడు బ్రాహ్మణఋషిగదా ! వారి పుత్రులకు శండ, అమర్కులను నశుభ నామములను, రాక్షనామము లేలఁబెట్టఁబడినవి ?"

నవ్వుచు నారదుఁ డిట్లనెను :- "ఇప్పుడు రాజా ! దీనికి నేనేమిప్రత్యుత్తర మొసంగెదను. అసుర పురోహితుల కిట్టిపేర్లు స్వాభావికముగనే పెట్టుచుందురు. కొంచెముగ నాసురత్వము వచ్చుచునే యుండును. ఇంకేమున్నది మఱునాఁడు శుభలగ్నమున, శుభముహూర్తమున మిక్కిలి వైభవముగఁ బ్రహ్లాదునకు అక్షరారంభమయ్యెను. ఇప్పుడాతఁడు నియమముగఁ బాఠశాలకుఁబోయి పండితులవలనఁ బాఠములు చదువమొదలిడెను.

ఇంకను జాలమంది అసుర బాలకులాతనివెంటఁ జదువవచ్చు చుండెడువారు, ప్రహ్లాదుఁడును పలకను భార్యపుస్తకములను గైకొని క్షేమపూర్వకముగఁ బాఠశాలకుఁజదువఁబోవుచుండెను. ఒక్కొక్కప్పుడింటికిఁబోవును. కొన్ని దినములు గురుగృహము ననే నివసించును, గురుపుత్రుఁడు నీతిశాస్త్రపండితుఁడు. అందు వలన నాతఁడు బాలకులకు రాజనీతి శాస్త్రమును చెప్పుచుండెను. శత్రువులతో నెట్లు మెలగవలయును. సామప్రయోగము నెట్లు చేయవలయును. దానము నొసంగి శత్రువును, శత్రుపక్షము వారిని నెట్లు వశపఱచుకొనవలయును. శత్రువుయొక్క శత్రువు లను శత్రురాజ్యమందును భేదమునెట్లు పెట్టవలయును. సంధి యెట్లు చేసికొనవలెను. అవసరమువచ్చినపుడెట్లు దండింప వల యును. దండములోని రకములును, నేస్థానమున నుపయోగ కరముగ నుండునదియు మొదలగు నీతి శిక్షణమందఱకును నిచ్చెడివారు. ప్రహ్లాదునిబుద్ధి అత్యంత తీవ్రమైనది. గురు ముఖతఃవినగాఁనే మరల జెప్పివైచెడువాఁడు. ఇట్టి తీక్ష్ణబుద్ధిని, విలక్షణ ప్రతిభను గాంచిన గురుపుత్రుల కాశ్చర్యము వేయు చుండెడిది. ఇట్టి శిష్యునకు శీఘ్రముగఁ జదువును జెప్పి రాజు వలన నవ్వారిగఁ బారితోషికములను బెందవచ్చునని వారికి లోలోన నత్యధికాభిలాష యుండెడిది.

ప్రహ్లాదుఁడు చదివిన పాఠములను వెంటనేనప్పగించెడు వాఁడు. గాని ఆతనికి రాజనీతి రుచింపకుండెను. దానిలో వీఁడు నావాఁడు వాఁడు పరాయివాఁడు వాఁడు శత్రువు, వీఁడు మిత్రు

డనియే యుండును. ప్రహ్లాదుఁడు సమదర్శి, ఆతఁడు మనస్సులో నెవనిని శత్రువుగా భావింపఁడు. అందువలన నిట్టి యసదాగ్రహ యుక్తములగు విషయము లాతనికి బాగుండలేదు. అయినను పితృాజ్ఞనుబరిపాలింపఁ దలఁచి ఆతఁడు చదువుచుండెను.

శా॥ అంతం గొన్నిదినంబులేఁగిన సురేంద్రారాతి శంకాన్విత
స్వాంతుండై నిజనందనున్ గురువులేజాడం బఠిపించిరో
భ్రాంతుండేమి పఠించెనో పిలిచి సంభాషించి విద్యాపరి
శాంతిం జూచెదఁగాక నేఁడని మహాసౌధాంతరాసీనుఁడై ॥

--శ్రీమదాంధ్ర భాగవతము.

ఒకనాఁడు ప్రహ్లాదుఁడు చదువుకొని వచ్చుచుండెను. హిరణ్యకశిపుఁడు మహలులోఁ గూర్చుండియుండెను. ప్రహ్లాదుఁడు పలక పుస్తకములను బట్టుకొనియే తండ్రియొక్క పాద పద్మముల కత్యంత వినీత భావముతోఁ బ్రణామము కావించెను. పుష్పపేశల సుకుమార శరీరుఁడగు తన పుత్రుని వినయభక్తులను గాంచఁగానే దైత్యరాజున కత్యంతానందము కలిగెను. ఆతఁడు ప్రేమతోఁ బుత్రునిలేవఁదీసి, తనవడిలో గూర్చుండఁ బెట్టుకొని మాటిమాటికిని ముద్దు పెట్టుకొని ప్రేమతో నిట్లనెను :-

శా॥ ఉత్సాహ ప్రభుమంత్రశక్తియుతమే యుద్యోగమారూఢ సం
విత్సంపన్నుఁడవైతివే చదివితే వేదంబులున్ శాస్త్రముల్
వత్సా రమ్మని చేరఁజీరి కొడుకున్ వాత్సల్యసంపూర్ణుఁడై
యుత్సంగాగ్రముఁజేర్చిదానవవిభుండుద్యుత్కటదీపింపఁగన్

--శ్రీమదాంధ్ర భాగవతము.

నమ్రతతో; బ్రహ్లాదుఁ డిట్లనెను :- "తండ్రీ ! ఆజ్ఞయైన వినిపించెదను."

పిల్లలతో నవ్వులాటకనునట్లు పిల్లవానితో నవ్వులాటలకు హిరణ్యకశిపుఁడిట్లనెను :- "నాయనా ! నీకెయ్యది భద్రంబై యున్నది సెప్పుము. నీయభిప్రాయమునఁ బురుషునకు సర్వ శ్రేష్ఠమగు గర్తవ్యమేది ?"

ప్రహ్లాదుఁడు తప్పించుకొని పోవువాఁడు కాఁడు. ఆతని కొక నిశ్చిత సిద్ధాంతము కలదు. మానవునకే పదార్థము కడు పులో నుండునో అట్టి త్రేపే వచ్చును. ఆతఁడు తన తండ్రితో నిట్లనెను :- తండ్రీ !

ఉ॥ ఎల్ల శరీర ధారులకు నిల్లను చీఁకటి నూతిలోపలన్
త్రెళ్ళక వీర మేమను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వమున్నతని దివ్యకళామయమంచు విష్ణునం
దుల్లముఁజేర్చి తారడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ॥

-శ్రీమదాంధ్ర భాగవతము.

అహంకారమమకార రూపమగు నసదభినివేశముచేనెవని బుద్ధి ఉద్విగ్నమైయున్నదో అట్టివాఁడీ జలములేని గృహస్థాశ్రమ మను నంధకూపమును వెంటనే పరిత్యజింపవలయును. ఈ గృహస్థాశ్రమమందు దుఃఖముతప్ప సుఖమేమున్నది? జిహ్వో పస్థల క్షణకాల సుఖమును బరిణామమున దుఃఖమును గలదు. వీన్నిని సేవించుటచే నాత్మోన్నతిగాక ఆత్మపతనము కలుగును.

కావున నాయుద్దేశ్యమున సాంసారిక విషయములందు విరక్తుఁడై నిరంతరము శ్రీహరి పాదపద్మములను ధ్యానించుచు, హరిశరణమును బొందుటే సర్వ శ్రేష్ఠకార్యమగును."

నారదుఁడిట్లనెను:- "రాజా! సర్పమును గదపిన నదియును గొట్టునట్లును, ప్రజ్వలితాగ్నియం దాహుతిని వైచినచో నదియింకను ప్రజ్వలించినట్లును నాతని హృదయము భగవన్నామమును వినఁగానే ద్వేషముచే మండుచుండెను. అంత నాతఁడు ప్రహ్లాదుని వైపునకుఁజూచెను. చూచుటకా పిల్లవాఁడు, మాటలు దేవగురువగు బృహస్పతి పలికినట్లు పలుకుచుండెను. పిట్ట కొంచెము. కూతఘనముగానుండునప్పటికి పిల్లవానిఅమాయకత్వమునుగాంచఁగానే ఆతనికి నవ్వువచ్చెను. రాజా! బాలబుద్ధి అవక్వముగనుండునందురు కాని నాకు బాలత్వము మిక్కిలి ప్రియము. నాకు శక్తియున్నచో నెల్లప్పుడును బాలకుఁడనుగానుండఁగోరుదును బాలకులొనర్చిన యపరాధములన్నియును క్షమ్యములే. ఎట్టి యపరాధము నొనర్చినను తల్లిదండ్రులుపిల్లవానినిఁగోపఁబడినచో నితరులు వారికిట్లుపదేశించెదరు:- "పోనీయుఁదయ్యా! పిల్లవాఁడుగదా! పిల్లల విషయమంతగాఁ బట్టించుకొనరాదు. పిల్లవాఁడు పెరిగినకొలఁది వాని విషయమున శ్రద్ధ యెక్కువగును. ఆతఁడు దోషిగను నపరాధిగను నెన్నుచుందురు. హిరణ్యకశిపునకు భగవన్నామమునుబలుకుట గొప్ప అపరాధమైనను ప్రహ్లాదుఁడు బాలకుఁడని నవ్వి తనలోఁదా నిట్లనుకొనెను:- "దీనినే పిల్లతనమందురు. పిల్లలబుద్ధి యితరుల

చెప్పుడు మాటలచేఁ జెడిపోవుచుండును. కాని బాల్య కాలపు సంస్కారములు నశింపవు. కావున నేను దీని నుపేక్షింపరాదు. ఇప్పటినుండి వీని విషయమున నేదైన గట్టుదిట్టము చేయవల యును," అని పలికి తన గృహకార్యములను నిర్వహించు మంత్రినిఁబిలిచి యిట్లనెను:- "వీఁడిప్పుడింటికి రావలసిన పని లేదు. అచ్చట గురుగృహమందే చాల జాగ్రత్తగ నుంచవల యును. వీని విషయములోఁ జాలగఁనిపెట్టి యుండవలసినదని ఆ బ్రాహ్మణులతోఁ జెప్పవలెను. విష్ణుపక్షీయులు గుప్తవేషము నుధరించి తిరుగుచున్నారు. సరళ చిత్తులును నమాయకులునగు వారికి యీ మాటలను జెప్పి వైష్ణవుల నొనర్చుచున్నారు. మాన వుఁడు వైష్ణవుఁడయ్యెనా వారికి లౌకికబుద్ధి నాశనమగుచున్నది. వారు నిరర్థకులగుచున్నారు. వారు దేనికిని బనికిరారు. శత్రువు లపైఁ గ్రోధమురాదు. తమ దగ్గఱనున్న దానిని పని పాటలేని వారికి దోచిపెట్టుదురు. కావున వైష్ణవుల నుండి వీనినిఁ గాపాడ వలయును. గురుపుత్రులకు గసరిచెప్పి నే నిట్లు చెప్పినట్లు చెప్ప వలెను."

నారదుఁడిట్లనెను:- "రాజా! ఇట్లు పలికి హిరణ్యకశిపుఁడు వెంటనే ప్రహ్లాదుని మంత్రిచేతికిచ్చి గురుగృహమునకుఁబంపెను మంత్రివెడలి గురుపుత్రులతో నిట్లనెను:- "విప్రులారా! మీరి రాజకుమారున కేమిచెప్పినారు? మహారాజుగారు నేఁడు కోపబ డుచు నిట్లనినారు:- మా అసురులకు విరుద్ధమగు పలుకులను వీఁడు పలుకుచున్నాఁడు. "మీరు వీనిని జాగ్రత్తగాఁ జూడవలయు

ననుసంగతిని జ్ఞాపకముంచుకొనవలయును. మీ వద్ద విష్ణుపక్ష పాతులగు దేవతా గుప్తచరులున్నట్లు తోఁచుచున్నది. వారు బాలుని బుద్ధిని నాశనం చేయుచున్నారు."

రాజు పలికిన యీ క్రోధ పూరిత వాక్యములను విని గురు పుత్రులు భయపడిరి. వారు వినయముతో నిట్లనిరి :- "మంత్రీ ! మేము కుమారున కిట్టి వేవియును బోధింపలేదు. ఇఁక దేవతాగుప్త చరుల విషయమందుమా మీరే చూడుఁడు, మా పాఠశాలలోని వారందఱును విశ్వసనీయులగు నసురబాల కులే. ఇట్టి విరుద్ధ విషయములను దైత్యరాజ సమ్ముఖమున కెవరువచ్చి యెట్లు చెప్పిరాయను నాశ్చర్యము కలుగుచున్నది. మంచిది. మేము వీనినడిగెదము. మా పక్షమున మీరు మహా రాజునకు బిల్లవాని విషయములో నేఁటినుండి మేము జాగ్రత్తగ నుండెదమని చెప్పుఁడు. వీనికిట్టి విపరీత బుద్ధియెట్లు పుట్టినదో తత్పరతతో జాడఁదీసెదము. కారణమును దెలిసికొని దానికిఁ బ్రతీకార మొనర్చుటకు శక్తికొలఁది ప్రయత్నించెదము" ఇది విని మంత్రి వెడలిపోయెను మంత్రి వెడలిపోఁగానే ఆ గురు పుత్రులిద్దరును మిక్కిలి ప్రేమతోఁ బ్రహ్లాదునిఁ దమకడకుఁ బిలిచి, వడిలోఁ గూర్చుండఁబెట్టుకొని బుజ్జగించి గడ్డముపట్టు కొని యిట్లడిగిరి :- వత్సా ప్రహ్లాదా ! ! మేము నిన్నొకమాట నడుగుచున్నాము. నిజము చెప్పుము, అసత్యము చెప్పరాదు."

ప్రహ్లాదుఁడిట్లనెను :- "గురువుగారు ! అడుగఁదలఁచిన దేదియో అడుగుఁడు."

గురుపుత్రులు మరల నిట్లనిరి:- "అడిగెదము. నాయనా! మేము నీకు గురువుల మను సంగతిని జ్ఞాపకముంచుకొనవల యును, మా ముందేదైన నబద్ధపు పలుకులు పలికిచోఁ బాపము లభింపఁ గలదు, నీవు రాజకుమారుఁడవు. అబద్ధము పలుక వను సంగతి మాకుఁ దెలియును.నీవు చాల మంచిపిల్లవాఁడవు."

ప్రహ్లాదుఁడిట్లనెను :- "గురుదేవా! మీరు నన్ను విశ్వసిం పుఁడు. మీ రడిగిన దానికి నేను సత్యము చెప్పెదను."

గురుపుత్రు నిట్లనిరి:- "అయితే చెప్పుము, నీవు నీ తండ్రి సమ్ముఖమున నాయా పలుకులు పలికితివే వానిని నీ కెవరు బోధించిరి. మేము చెప్పలేదే పోనిమ్ము; ఈ పిల్లలలో నెవరైనఁ జెప్పినచో వాని పేరును జెప్పుము లేక యెవరైన భిక్షుకుఁడు, గుప్తవేషమును ధరించి పండితుఁడుగా, జ్యోతిష్కుఁడుగా సాధువుగా, నింక ననేక రూపములతో నెవరైన గుప్తచరులు వచ్చియుండినచో వారిని గూర్చి చెప్పుము. నీకీ విషయముల న్నియు నెట్లు తెలిసినవి ? అట్లు చూచుచు నూరకుండినచో దోషము మా నెత్తినఁ బడఁగలదు. నీకు జెప్పిన వానినిఁగూర్చి మాకు తెలిపినచో నిఁక జాగ్రత్తను వహించి తన్నివారణోపాయ మును జూడఁగలము."

ధర్మరాజుతో నారదుఁ డిట్లనెను :- "రాజా ! గురుపుత్రుని యీ మాటలను విని ప్రహ్లాదుఁడు చిరునవ్వు నవ్వి వారి ప్రశ్నలకుఁజాల చక్కఁగఁ బ్రత్యుత్తర మొసంగెను."

.... )o( ....

# ప్రహ్లాదుఁని ప్రత్యుత్తరమున గురుపుత్రుల కోపము

౪౬౩

శ్లో॥ స యదానువ్రతః పుంసాం పశుబుద్ధిర్విభిద్యతే॥
అన్య ఏష తథాన్యోఽయమితి భేదగతాసతీ॥

శ్రీభాగ. ౭ స్కం. ౫ అ. ౧౧ శ్లో॥

వ. "పురోహితు నిరీక్షించి ప్రహ్లాదుండిట్లనియె!- మోహనిర్మూలనంబు సేసి యెవ్వనియందుఁ దత్పరులయి యెఱుక గల పురుషులకుం బరులు దామనియెడు మాయాకృంతంబయిన యసద్గ్రాహ్యంలగు భేదంబు గానంబడదట్టి పరమేశ్వరునకు నమస్కరించెద"

-శ్రీమదాంధ్ర భాగవతము.

పుట్టఁగానేజీవి పూర్వజన్మ సంస్కారానుసారముగఁ గార్యము లొనర్చుచుండును. ఆవు దూడను బెట్టఁగానే దానిని నాకును. దూడ పుట్టఁగానే లేచుటకుఁ బ్రయత్నించును. తల్లి స్తనములను వెదుకుకొనును. స్తనములు దొఱకకున్నచో ముందు కాళ్ళమధ్య క్రుమ్మును. తర్వాత వెదకి వెదకి చివరకు గనుఁ గొని త్రాగ మొదలిడును. ఇదంతయును దానికెవరు నేర్పిరి? ఇది దాని జన్మ జన్మాంతర సంస్కారమని చెప్పవలసియుం డును. పూర్వజన్మసంస్కారము లేకున్నచో లక్ష ప్రయత్నము లొనర్చినను నదివానికి రాదు. వచ్చినను నెంతో ప్రయత్నమొ నర్చినఁగాని కొంత సంస్కారమేర్పడదు. ఆ సంస్కారము రాఁబోవు జన్మకుఁ బనికివచ్చును. కొన్ని సంస్కారములపూర్ణ ముగనుండును. అవి యీ జన్మములో గురువుచేఁ బూర్తికావిం పఁబడును. కొన్ని సంస్కారములు పూర్ణముగనుండును. వానిలో నేదైనఁ గొంచెము లోపము సంభవించెనా భగవదేచ్ఛచే నీధరాధామమున మరల జన్మింపవలసియుండును. వానికి శిక్ష ణము దీక్ష పూర్వజన్మమునందే పూర్తి అయినది. ఈ జన్మ మున దానినిఁ బూర్తిచేయవలసిన పనిలేదు. ప్రారబ్ధమును భోగించి సాంసారిక ఆవాగమనమునుండి బయటబడును. ఇట్టి వారు స్వత: అట్లాచరించుటను గాంచి అజ్ఞానులు కొందఱు వానిని స్వయంభూయందురు. కొందఱమాయకుఁడని యెగతాళి జేయుదురు. కొందరసమర్థుఁడని తిరస్కరించెదరు. వీనికిం తటి జ్ఞానము నెవరు నేర్పిరి యెట్లు నేర్చినాఁడనియు వీనికిం

తటి విద్య యెట్లు వచ్చినదనియు, నింతటి సాధన సంపన్నుఁడు స్వయముగ నెట్లైనాఁడని శిక్షణ దీక్షలనొసంగఁగల పండితులా శ్చర్య చకితులగుచుందురు. ఈ శిక్షణ దీక్షలన్నియును బూర్వ జన్మముననే పూర్తియైనవనుసంగతిని వారెఱుఁగరు.

నారదుఁడు ధర్మరాజగు యుధిష్ఠిరునితో నిట్లనెను:- "రాజా! గురుపుత్రులు ప్రహ్లాదునిఁ బ్రేమపూర్వకముగ నీకు భగవద్భక్తి శిక్షణము నెవరొసంగిరని అడుగఁగా నాతఁడిట్ల నెను:- "స్వాములారా? ప్రత్యుత్తరమిచ్చుటకు ముందు నేను మంగళాచరణ మొనరించెదను."

గురుపుత్రు లిట్లనిరి:- "సరియే, మంగళాచరణమొనర్చి యే ప్రత్యుత్తరమిమ్ము."

ఇది విని ప్రహ్లాదుఁ డిట్లనెను:-

శా॥ అజ్ఞుల్ గొందఱు నేము దాము నుచు మాయం జెందిన సర్వాత్మకుం
ప్రజ్ఞాలభ్యుదురన్వయ క్రమములన్ భాషింపఁగాఁ నేరరా
జిజ్ఞాసా పథమందు మూఢులు గదా చింతింప బ్రహ్మాదివే
దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ దర్శింపఁగా నేర్తురే॥

....శ్రీమదాంధ్రభాగవతము.

అట్టి మాయాపతికి నేను నమస్కరించెదను."

గురుపుత్రు లిట్లనిరి:- "వత్సా! నీవెవరికిఁ బ్రణామ మొనరించుచున్నావు? ఈ భేద భావ మనాదియైనది, స్వభావాను

సారమైనది. ప్రహ్లాదుఁడిట్లనెను :- "గురుదేవులారా! ఈ లోకములో నేను, మీరు, అనునదియే పశుబుద్ధి ఇదియే అజ్ఞానం. సర్వాంతర్యామియగు నాహరి జీవులపైఁ గృపచూచినప్పుడును, జీవి ఆతని కృపకు అధికారి అయినప్పుడును నీ భేదభావము నశించిపోవును. భగవత్కృప అనుగ్రహసాధ్యము. కావున సదా సర్వదా భగవదనుగ్రహ ప్రతీక్ష నొనర్చుచుండినచోఁ నెప్పుడో ఒకప్పుడు కరుణేశుఁడుకృపఁజూచును."

అంత గురుపుత్రులు క్రోధముతో నిట్లనిరి :- "ఓరీ! నీవు తలతిక్కమాటలు మాటలాడుచున్నావు. నీబుద్ధిని భ్రష్టము కావించిన దెవరు ?

ఉ॥ పంచశరద్వయస్కుఁడవు బాలుఁడ వించుక గాని లేవు భా
షించెదు తర్కవాక్యములు చెప్పిన శాస్త్రములోని యర్థ మొ
క్కించుకయైనఁజెప్ప వసురేంద్రుని ముందటమాకునౌవలన్
వంచుకొనంగఁజేసితివి వైరి విభూషణ వంశదూషణా !

-- శ్రీమదాంధ్రభాగవతము.

మేమడిగినదానికి సమాధానము చెప్పవు. అనుగ్రహ, ప్రతీక్షా, సాధన. సాధ్యములను గుఱించి యింకేమేమో పలుకుచున్నావు. మాకు జ్ఞానముపదేశింప బయలుదేరితివి. నీబుద్ధి యెట్లుభ్రష్టమైనది. నీకీ దుర్బుద్ధి నెవరుపదేశించిరి ?"

అంతఁ బ్రహ్లాదుఁడిట్లనెను :- "మూర్ఖులాత్మయందారోపించు స్వపరభేదము సత్యముకాదు. బుద్ధిహీనులగు వారే యిట్లు

నిరూపించెదరు. ప్రభుకృపను బొందినవారిట్టి విపరీతవాక్యములను త్రికాలములందును బలుకరు. ఆ మదనమోహనునిమోహినీ మాయమిక్కిలి దుర్జేయమైనది. గొప్పగొప్ప వేదజ్ఞులగు బ్రాహ్మణులును బ్రహ్మాది దేవతాగణమును నాతని మోహమునఁబడి మోహితులగుచుందురు. ఆ మదనమోహనుఁడే నాబుద్ధియందు భేదభావమునుత్పన్నము కావించినాఁడు. నేనేమి చేయుదును బ్రాహ్మణోత్తములారా! మీరు నాకు గురువులు. నేను సత్యమును జెప్పుచున్నాను. ఏ వ్యక్తియును నన్ను భ్రమపెట్టి బోధింపలేదు.

తే. ఇనుమయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషికేశు సన్నిధి నా విధమున
గరఁచుచున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తమ చిత్తంబు భ్రాంతమగుచు.

-- శ్రీమదాంధ్రభాగవతము.

సీ. మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు

తే. నంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయునేల ?

-- శ్రీమదాంధ్ర భాగవతము.

మనస్సు సమ్ముఖమునకు విషయము రాఁగానే స్వతః అది దానివైపున కాకర్షింపఁబడునట్లును, నెత్తునఁ బడిననీరు పల్లమునకు జారిపోవునట్లును, భగన్నామ గుణములవైపునకు నా మనస్సు స్వాభావికముగఁ బ్రవృత్తినిఁ జెందియున్నది. ఎవరైనను జెప్పుట చేతఁగాని, మోసగించుటచేతఁగాని నే నిట్టి పలుకులు పలుకుటలేదు."

అంత గురుపుత్రు లిట్లనిరి :- "నీవు గొప్పమాటలకారివి రా పిల్లవాఁడా ? నీవు బాలుఁడవగుటచే బాల్యచాపల్యమున నిట్లు పలుకుచున్నావను కొనుచున్నాము, కానీ నీవు పెద్ద పెద్దవారినిఁ గూడ మించిపోయినావే, మాకును నుపదేశించు చున్నావే ఈ వ్యర్థ ప్రసంగమును విడువుము."

గురుపుత్రులు కోపబడుటను గాంచి ప్రహ్లాదుఁడు మరల వారితో నిఁకఁబలుక నుచితము కాదనుకొనెను. వారిద్దరును గోపమును జెంది కాదనుచున్నను లక్ష్యపెట్టలేదు. ఆతఁడు మౌనముగ నుండెను.

తమ వాక్యముల నవహేళనమొనర్చుచున్నాఁడనియు, వినుటలేదనియుఁ దెలిసికొని, గురుపుత్రులు క్రోధమును జెంది పండ్లను బట పటఁ గొఱకుచు నిట్లనెను :- ఓరీ, దుర్మఖా ! లోపలి నుండి మా బెత్తములను దీసికొనిరండురా, ఈ నీచ కులాంగారము చెప్పిన వినఁడు. దెబ్బల దేవుఁడు బెత్తములతోఁ గాని వినఁడు. మే మెంతో ప్రేమతోఁజెప్పితిమి, రాజభయమును జూపితిమి, మంచి చెడ్డలన్నియును జెప్పితిమి; కాని వీని బుద్ధి మీఁద బండపడినది. వీనికి దెబ్బలతోఁగాని దయ్యముపాఱదు. వీని వీపుమీఁదఁ దడ దడ మని పది యిరువది దెబ్బలుపడెనా వీని బుద్ధి త్రోవకువచ్చును. అప్పుడు వీఁడయ్యో అమ్మా, అయ్యో ! బాబూ అని మొత్తుకొనఁగలఁడు."

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను :- "రాజా ! దాసత్వ మునకు మించిన పాపములేదు. ఆశ్రితులు సదా తమ ఆశ్రయ దాత చెప్పినట్లు చేయవలసియుండును, ఆతని నానందపరచు టకు వివిధ క్రియలొనర్చవలసి యుండును. యజమాని పగలును రాత్రియన్నను, రాత్రినిఁబగలన్నను నొప్పుకొనవల యును. రాత్రియందు సూర్యోదయమైనదని చెప్పవలసి యుండును. ఈ శండ, అమర్కులు హిరణ్యకపుని ఆశ్రితులు. రాజు నానంద పఱచుటకై ఆతని పుత్రునితో వారిఁడిట్లనెను :- "ఓయీ నీచరాజకుమారా ! నీవు కులనాశ మొనర్పకుము, గొడ్డలినిఁ దీసికొని వనమును నఱకు వానినిఁగాంచి వనవృక్షము లిట్లనెను :- "ఓయీ ! కట్టెలను గొట్టువాఁడా ! నీవు మమ్ముల

నేమి నడకఁగలవు; కాని యేమిచేయుదుము నీచేతిలోఁ బట్టు కొన్న వస్తువు మా జాతికిఁజెందిన కట్టియే," ఇంటిగుట్టుజెప్పిన వాఁడే లంకను నాశము కావించినాఁడు.

చ. తనయుఁడుగాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడుదైత్యచం
దన వనమందుఁ గంటకయుతక్షితి జాతముభంగిఁ బుట్టి నాఁ
డనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతి సేయుచుండు దం
డనమునఁగాని శిక్షలకుఁడాయఁడు పట్టుఁడు కొట్టుఁడుద్ధతిన్.

-శ్రీమదాంధ్ర భాగవతము

నీ మూలమున నీ కులమంతయును నాశము కాఁగలదు ఇప్పుడు నీవు శత్రుగీతమును గానము చేయుచున్నావు. ఆతని భక్తి చేయుచున్నావు. విష్ణువు దైత్యులకు గండ్రగొడ్డలి వంటి వాఁడు, నీవు వానికి దాసుఁడవు. నీసహాయముననే ఆతఁడసుర కులమును నాశము చేయఁగలఁడు."

నారదుఁడిట్లనెను :- "రాజా ! ఈ విధముగ నా గురు పుత్రులు ప్రహ్లాదున నేననేకవిధములఁజెప్పఁదగిన విషయములను జెప్పిరి. కాని ప్రహ్లాదుఁడు గురుగౌరవముచే దేనికినిఁ బ్రత్యుత్తరమీయలేదు. ఆతఁడు మెదలక వారి మాటలను వినుచుండెను. చివరకు గురుపుత్రు లిట్లనిరి :- "మంచిది, నేటికి నిన్ను క్షమించుచున్నాము, ఈసారి మరల నిట్టివి జరిగెనా బాదక వదలము, ఇప్పుడు మే మేది చెప్పిన దానిని గ్రహింప

వలయును. ఈ ప్రకారము వివిధోపాయములచేఁ ప్రహ్లాదుని భయపెట్టి వానికి ధర్మార్థకామములకు సంబంధించిన విద్యను జెప్పసాగిరి. ప్రహ్లాదునకివి నచ్చలేదు; కాని గురుగౌరవమున నాతఁడన్నిటిని శ్రద్ధతో వినుచుండెను.

....)o(....

## తండ్రి ప్రహ్లాదుని మరలఁ బ్రశ్నించుట

౪౬౪

శ్లో॥ ప్రహ్లాదనూచ్యతాం తాత స్వధీకం కించిదుత్తమమ్।
కాలేనైతావతాయుష్మ న్యదశిక్షద్గురోర్భవాన్॥
....శ్రీ భాగ. ౩ స్కం. ౫ అ. ౨౨ శ్లో॥

వ. అని మఱియుఁబుత్రా నీకెయ్యది భద్రబై యున్నది సెప్పుమ
నినఁ గన్నతండ్రికిఁ బ్రియనందనుం డిట్లనెను."
....శ్రీమదాంధ్ర భాగవతము.

స్వభావము దుస్త్యజ్యమైనదికాకున్నచో దుర్మార్గులు ఉపకారులయెడల దుర్వ్యవహార మేలచేయుదురు? సాధువులు దుష్టులచే నవమానితులయ్యుఁ తిరస్కృతులయ్యు, దండితులయ్యు వారిమేలునే యేలగోరుచుందురు? దీనినిఁబట్టి ఉత్తముఁడుత్తమ కార్యమును, అధముఁడధమకార్యమును జేయుటకు వివశుఁడగు

నని తేలుచున్నది. జూదము వలన లాభములేదని అందఱకును దెలియును. ఎప్పుడైన నొకరూపాయి లాభించినను నింకొకసారి పదిపోవును. సురాపానము దుర్వ్యసనమని త్రాగుబోతుకును దెలియును. దీనివలన నంతయును హానియే. కాని స్వభావముచే వివశులగుచున్నారు. ఇదే విధముగ జన్మచేతనే భగవద్భక్తికలవారు భగవత్పరిచర్య చేయకుండజాలరు. పరోపకార పారీణులు పరోపకారము కొఱకెంతో కష్టపడవలసియుండును. నిందను వినుచుందురు. విరోధమును సహించెదరు. దెబ్బలను భరించెదరు. దగ్ధమయ్యెదరు, ఇంతెందులకు నవ్వుచు నవ్వుచు నుఱికంబమునకెక్కెదురు, కాని పరోపకారమును భయకారణమున నేమియును వీడరు. నిర్భయులై ఆ కార్యమునే చేయుచుండును. ధర్మమునందును, పరోపకారమునందును సాహసముండును. ప్రతి పక్షు లెంతటి బలవంతులైనను ధర్మాత్ములు తమ సాహసమును, ఆత్మబలవశమున వారికి భయపడరు.

నారదుఁడిట్లనెను:- "ధర్మరాజా! శుక్రాచార్యుని పుత్రులగు చండ, అమర్కులు ప్రహ్లాదుని సామ, దాన, భేద, దండోపాయముల ధర్మార్థకామములకు సంబంధించిన రాజనీతిని మిక్కిలి పరిశ్రమతో నేర్పుచుండిరి. ప్రహ్లాదుఁడు రాజపుత్రుఁడు ఆతనికి రాజనీతియనిన విరోధములేదు. వ్యవహారమునకు దీని నొప్పుకొనుచు, సర్వశ్రేష్ఠమైనది భగవద్భక్తియనుకొనును; కాని గురుజనులకడఁదన యాంతరంగిక భావములను గొంత కాలము దాచియుంచెను. ఆతని బుద్ధి అత్యంత తీవ్రమైనది.

గురువు లేదిచెప్పిన వానిని వెంటనే జ్ఞాపకముపెట్టుకొని ఒప్పగించును. ఆతని యిట్టి చమత్కారపూర్ణ విలక్షణ ప్రతిభనుగాంచి గురుపుత్రు లాశ్చర్య చకితులై లోలోన నానందపడుచు నిప్పుడీతని తండ్రికడకుఁ గొనిపోయిన కోరిన పారితోషికము లభించునని తలఁచిరి.

అల్పకాలములోనే ప్రహ్లాదుఁడు నీతిశాస్త్ర పారంగతుఁడయ్యెను. ఆతఁడు యోగ్యుఁడైనాఁడను సంగతినిఁ దెలిసికొని గురుపుత్రుఁ లాతనిని రాజాంతఃపురమునకుఁ గొనిపోయెను. కయాధు గురుపుత్రులతోఁ దనపుత్రుడుండుటనుగాంచి మిక్కిలి హర్షమును జెందెను. ఆమె గురుపుత్రులను విధ్యుక్తముగఁబూజించెను. పుత్రుని వడిఁ గూర్చుండఁబెట్టుకొని ప్రేమతో ముద్దులాడి, శిరస్సును మూర్కొని ఆతని కుశలము నడిగెను. అమాయకుఁడగు నా బాలకుఁడు తల్లిని గౌఁగిలించుకొనఁగా నామెకు పాలచేపువచ్చి ప్రహ్లాదుని వస్త్రములను, వెండ్రుకలను దడిపెను. తల్లి లేచి పిల్లవానికి నలుగుఁబెట్టి విధ్యుక్తముగ స్నానము చేయించెను. మంచి వస్త్రములనుగట్టెను. అమూల్యాభరణములచే నలంకృతుఁగావించెను. కన్నులకు దట్టముగఁ గాటుకను బెట్టెను. ముఖమున గోరోచన తిలకమును బెట్టెను. సుందరస్వాదిష్ట పదార్థములను, ఖాద్య,భోజ్య, లేహ్య, చోష్య, పేయాది పంచవిధ భోజనపదార్థములనుబెట్టి, గురుపుత్రుల వెంటఁ దండ్రి సమీపమునకు నభకుఁపంపెను.

ప్రహ్లాదుఁడు సభలోనికిఁబోయి మిక్కిలి శ్రద్ధాభక్తులతోఁ దండ్రి పాదములపైఁబడి సాష్టాంగ నమస్కారమొనర్చెను. తన ప్రియ కనిష్ఠపుత్రుడు తన పాదములపై బడుటను గాంచఁగానే తండ్రి హృదయము కఱగిపోయెను. ఆతఁడు వెంటనే పుత్రుని లేవఁదీసి కౌఁగిలించుకొనెను. శిరస్సును మూర్కొని ముద్దిడుకొనెను. అంతనాతని ఉంగరములు తిరిగిన చిన్నచిన్న వెండ్రుకలను దన వ్రేళ్ళతోఁ జిక్కుఁదీయుచు హిరణ్యకశిపుఁడిట్లనెచు :- "వత్సా ! ఇప్పుడు నీవు చక్కని శిక్షణను బొందియుందువు. నేను గురుపుత్రులతో నీసారి చాల జాగ్రత్తగ నుండవలయునని చెప్పియుంటిని, అన్నిటికంటే సర్వశ్రేష్ఠమగునదేది ? నీవు చదివినవాటిలో సర్వశ్రేష్ఠమగున దేది ? సమస్త ప్రాణులకును గల్యాణము కలిగించునదేది ? దానిని నాకుఁజెప్పుము."

నారదుఁడిట్లనెను :- "రాజా ! ప్రహ్లాదుని మనస్సులో వేఱు విషయమున్నది. ఆతఁడు ప్రపంచ కళ్యాణము ఆసుర ప్రకృతికి విపరీతాచరణమువలనఁ గలుగునవి తలఁచియుండెను. ఆతఁడు నిర్భయుఁడై యిట్లనెను :- "తండ్రీ ! నా మాటను శ్రద్ధతో వినుఁడు. మధ్యలో నడ్డుచెప్పకుడు, నేను దెలిసికొనిన సారసిద్ధాంతమును సంక్షేపముగ మీకుఁ జెప్పెదను. మీరు సావధానులరై శ్రవణము జేయ ననుగ్రహింపుఁడు."

హిరణ్యకశిపుఁ డుల్లాసస్వరమున నిట్లనెను :- "మంచిది నేను మధ్యలో నడ్డు చెప్పను. నీవు నిర్భయుఁడవై చెప్పుము."

అప్పుడు ప్రహ్లాదుఁడిట్లనెను :- తండ్రీ ! చాలమందికి పరనింద, పరచర్చ, ప్రవాదాపవాదములు, ఇతరవిషయములు మిక్కిలిగ రుచించును, ఈ విషయములను వినుటలో వారికి మిక్కిలి రసము లభించును, కాని నేను విష్ణుభగవానుని నామ, గుణశ్రవణమునే సర్వశ్రేష్ఠ సాధనముగ నెంచుచున్నాను. ఇదియే సంసార సాగరమును దరించుటకుఁ బ్రథమసోపానము కొందఱు కామక్రోధాదిగుణములకు వశీభూతులగు వారి గుణ కీర్తనమునే తమలాభముగ నెంచుకొందురు. వీరినిఁ బ్రశంసించిన వారేదో యిచ్చెదరను నాశయును వారికి కలదు. తామే ఆఁకలిచెందిన వారేమీయఁగలరు ? ఇంకను మాయాజాలములోఁ బడవేయుదురు, భవజాలమును ఖండించునది, ఛిన్నాభిన్న మొనర్చునదియు శ్రీకృష్ణనామ గుణ కీర్తనములే. కృష్ణకీర్తనమునకు మించినదీ ప్రపంచమున శ్రేష్ఠమైన దేదియును లేనే లేదు.

సాధారణముగ మానవులు విషయచింతన మొనర్చుచుందురు. ఎవరు దేనిని జింతించుచుందురో వారి కంత్యకాలమున నావస్తువే ప్రాప్తించును. విషయచింతన మొనర్చువారు విషయరూపమగు విషయమును ద్రావి జననమరణములను జెందుచుందురు. విషయములను వీడి విష్ణుస్మరణమెవరు చేయుదురో వారలమరులగుదురు. కావున నా యభిప్రాయమున విష్ణుశరణ్యమే సర్వశ్రేష్ఠమైనది."

పాపుల పాదసేవనమొనర్చి ప్రాణులు పాపమయులగుదురు. కాని ప్రేమపూర్వకముగఁ బ్రభు పాదపద్మములను బూజించినచో వానికిఁ బరమపదప్రాప్తి కలుగును. కావునప్రభు పాదసేవనమునకు మించిన సుఖకరమగు సామగ్రి ప్రపంచమున నేదియును లేదు. కొందఱు విషయాసక్తులను సేవించెదరు. కొందఱన్యరాజన తామస దేవతల నర్చించెదరు, కాని నేను వారినినిందింపను. నాయభిప్రాయమున నచ్యుతునకు మించిన నుత్తమ అర్చనీయుఁడగు దేవుఁడులేడు. కావున నత్యంతము దుఃఖనివృత్తి అచ్యుతారాధనముచేతనే కలుగఁ గలదని నాయభిప్రాయము.

విషయాసక్తులకు విషయప్రాప్తికొఱకువందనమొనర్చుచో నీతఁడమృతము నొసంగి విషమును గ్రహించుచున్నాఁడని తెలిసికొనవలయును. విశ్వములో వందనీయుఁడువాసుదేవ భగవానుఁడొక్కఁడే, వాసుదేవుఁడను బుద్ధితో నెవరికి వందనమొనర్చినను నది యుత్తమ వందనమగును. మిగిలినవన్నియును సంహార బంధనమున నలగఁబొడుచునవియే కాఁగలవు."

ప్రపంచములోని జనులు బంగారము, వెండి, కాగితపు ముక్కలకొఱకు తమ శరీరము నర్పణమొనర్చుకొందురు. రాత్రింబవళ్ళు కేవలము ధనముకొఱకే దాసతారూపమగు రజ్జువునందు బంధింపఁబడుదురు. విషయాసక్తుల సంకేతమున నాట్యమాడుదురు. వారికుత్సితవాసనా పూర్తికొఱకు తమ ధర్మకర్మలను, సత్యసదాచారములను వీడనాడుదురు. ఈదుష్టుల

దాసత్వమును వీడి దయా సాగరుఁడును దీనబాంధవుడగు భగవంతుని దాసత్వమును స్వీకరించినచో, నిష్కపట భావముతో నాతని దాస్యభక్తియందే లగ్నమై యుండుచో నీ జన్మము సఫలము కాఁగలదు. నేను నరదేహము యొక్క సార్థకత భగవంతుని దాస్యభక్తివలననే కలుగునని తలఁచుచున్నాను."

ప్రజలెవఁరు సుందరముగను, సహృదయుఁడుగను, ధనవంతుఁడుగను, గుణవంతుఁడుగను నుండునో అతనివైపున కాకర్షింపఁబడుచుందురు. కోరుచుందురు. అతఁడు తమకు మిత్రుఁడుకావలయు ననుకొనుచుందురు. సాంసారికమైత్రి శుద్ధముగనుండదు. అదిస్వార్థము తోడను, శాఠ్యముతోడను గలిసి యుండును ఇట్టి మానవులతో మైత్రినెఱపుట వ్యర్థము. మదన మోహనుఁడగు మధుసూదనునితో మైత్రినెఱపినచో మానవుల మనోవాంఛలు మటుమాయము కాఁగలవు. మాధవుని మంజుల మూర్తిమనమున నిలిచెనా మోక్షమును తుచ్ఛమగును. ఎల ననఁగా మురారి ముక్తికిని బతియె. కావున నాయభిప్రాయమున మురళీమనోహరునితో మైత్రిని నెఱపుటయే మనుష్యులకు సర్వశ్రేష్ఠమగు కార్యము.

మానవుఁడు సర్వభావములచే విషయముల కధీనుఁడగును. మనస్సును వశపఱచుకొనజాలక మనస్సునకే లొంగిపోవును. అది యెట్లు చెప్పిన నట్లాడుదురు. దానికి యంత్రము

లగుదురు. అట్లుగాక తన సమస్తకర్మలను, సమస్త కోరికలను, వాసనలను శ్రీహరి కర్పణ మొనర్చినచో, తన కేమియును మిగుల్చుకొనక అన్నిటి నాతని కర్పణమొనర్చినచో నాయభిప్రాయమున నుత్తమకర్మ లొనర్చువారిలో నాతనికి మించిన వారెవరును నుండరు ఈ విధముగా-

మ॥ తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్
వందనార్చనముల్ సేవయునాత్మలోనెఱుకయున్సంకీర్తనల్
చింతనం, బను నీతొమ్మిది భక్తిమార్గముల
సర్వాత్మున్ హరిన్ నమ్మి సజ్జనుఁడై యుండుట భద్ర
మంచు దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా॥

భగవదర్పణపూర్వకముగ వీని నాచరించుటయే చదువునకు ఫలమనియు, సర్వశ్రేష్ఠమగు నధ్యయనమనియుఁ దలఁచుచున్నాను. తండ్రీ ! నేను నా మనస్సులోని విషయములను సత్యములని తోచినవి. చెప్పితిని, ఇంక నిప్పుడు మీరేమైన నడగినచోఁ జెప్పెదను.

ప్రహ్లాదుని యీ వాక్యములను విని హిరణ్యకశిపుఁడు క్రోధ కారణమున మండిపడెను. ఆతఁడు కనుబొమ్మలను ముడివైచెను. శరీరము గడగడ వణఁకసాగెను. అధరమదురుచుండెను. పెదవులను గొఱకుచుఁగండ్లెఱ్ఱగఁజేయుచు నా గురుపుత్రుఁడగు చండామార్కులతో నిట్లనెను :-

చ॥ పటుతర నీతిశాస్త్రచయ పారగుఁజేసెదనంచు బాలు నీ
వటు గొనిపోయి వానికి ననర్థములైన విరోధి శాస్త్రముల్
కుటిలతఁజెప్పినాఁడవు భృగు ప్రవరుండవటంచు నమ్మితిం
గటకట బ్రాహ్మణాకృతివి గాక యథార్థపుబ్రాహ్మణుండవే॥

ఓయీ! బ్రాహ్మణులారా! మీరీపిల్లవానికి నేర్పిన దిది యేనా? ఇట్టి శిక్షణ నొసంగుటకేనా వీనిని మీకడకుఁబంపినది. మీరు మదోన్మత్తులైతిరి మీరు స్వతంత్రుల మనుకొనుచున్నారు. నాయాజ్ఞలు మీరు గుర్తించలేదా ? నా శత్రువగు విష్ణువు నాశ్రయించి, ఆతని ప్రశంశా సూచకముగ నెట్టి సారహీనమగు శిక్షణను మీరీ శిశువున కొసంగితిరి మేము మిమ్ము హితమును గోరు పురోహితులనుకొంటిమి. మీరింటఁదిని యింటివాసములను లెక్కించు వారైతిరి. అంగరకాలో దాగిన సర్పమువంటి వారైతిరి. మీరు మా యింటిలోఁగల్లోలములు, భేదభావములు పెట్టఁదలఁచుచున్నారు. మీరు మాకు శత్రువగు విష్ణుని గుప్తచరులుగాఁగనఁబడుచున్నారు, మీ బ్రతుకు బయటబడినది. మీ కపటము కండ్లబడినది. పాపమెన్నటికిని దాగదు. కాష్ఠపుపాత్ర మాటి మాటికిని పొయ్యనెక్కదు; మీరు బురోహితులుకారు వైరులు, మిమ్ములనుదండించెదను."

నారదుఁడిట్లనెను;- "రాజా! హిరణ్యకశిపుని యిట్టిక్రోధయుక్తములగువాక్యములను వినిగురుపుత్రుఁ డాతని నోదార్చుచు శాంతిపూర్వకముగఁ బ్రత్యుత్తరమీయ నుద్యుక్తుఁడయ్యెను.

....o....

# ప్రహ్లాదుఁడు గురుపుత్రులు నిర్దోషులనుట

౪౬౩

శ్లో॥ నమత్ప్రణీతం న పర ప్రణీతమ్
సుతో వదత్యేష తవేంద్రశత్రో।
నైసర్గికీయం మతిరస్య రాజన్
నియచ్ఛ మన్యుం కదదాః స్మమానః॥

....శ్రీ భాగ. ౭ స్కం, ౫ అ. ౨౮ శ్లో॥

ఉ॥ తప్పులు లేవు మావలన దానవనాథ విరోధి శాస్త్రముల్
చెప్పము, క్రూరులై పరులు సెప్పరు మీచరణంబులాన సు
మ్మెప్పుడు మీ కుమారునకు నింతయు నైజమనీషియెవ్వరుం
జెప్పెడి పాటిగాదు ప్రతిచింతఁదలంపుము నేర్పుకైవడిన్॥

....శ్రీ మదాంధ్ర భాగవతము

భృత్యుని అపరాధదోషము స్వామిదిగానే భావించెదరు. శిష్యుని ఉద్దండతయొక్క ఉత్తరదాయిత్వముగురువుపైనుండును. సామాన్యముగా బాలురు తమ యధ్యాపకులనుండి చెడ్డవిషయములనే నేరుకోందురు. అందువలన గురువుశిష్యులకిట్లుపదేశించును:- "నాయనా! నాలోఁగల సుచరితమేది కలదో దానినే గ్రహించు ఏదైన దుర్విషయములు నాలోఁగనఁబడినచో వానిని

గ్రహింపవలదు. సామాన్యముగా మనకు పెద్దలగుణములకంటె దోషములనే శీఘ్రముగ గ్రహించెదము. ఏలననఁగా జీవులకు విషయములందు స్వాభావిక ప్రవృత్తియుండును. ఒక్కొక్కప్పుడు దీనికి విపరీతముగఁగూడ నుండును. నేర్పకుండగనే అభక్తులకును భక్తిగలుగుచుండును. దుష్టసంసర్గమున నున్నను బాలకులు సాధువులగు చుందురు. వారిపై సాంగత్యప్రభావము పడదు. వారు తమ భిన్న ప్రకృతిని, భిన్నస్వభావమునుగైకొని పుట్టుచుందురు. దీనినే స్వాభావలేక జన్మజాత విద్యయందురు.

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను :- "రాజా ! హిరణ్యకశిపుఁడు గురుపుత్రులను మిక్కిలి గద్దింపఁగా నప్పుడా దీనులు రాజ సేవకులకు దాము నిరపరాధులమని ఋజువుచేయుచు నిట్లనిరి :- "రాజా ! మీరు న్యాయప్రియులు, ముందుగా మా మాటలను వినుఁడు. మాలో దోషమున్నచో మమ్ములను దండింపుఁడు, మీ రకారణముగఁ గేవలము సందేహము మీఁదనే మమ్ములను దోషులుగా నొనర్పకుఁడు, క్రోధమును వీడి మా ప్రార్థనమును వినుఁడు."

క్రోధమున నెఱ్ఱగ గ్రుడ్లనురుముచు హిరణ్యకశిపుఁడిట్లనెను :- మంచిది. చెప్పఁడేమి చెప్పెదరో ?"

దీనులై గురుపుత్రు నిట్లనిరి :- "ప్రభూ ! మీరు మమ్ములను విశ్వసింపుడు, మే మీతని కిట్టి విషయములను నేర్పలేదు. మీకు శత్రువైనవాఁడు మాకును శత్రువే. మే మాతని భక్తి,

ప్రపత్తి, ప్రశంసల నేలఁజేయుదుము? మీశరణమునువదలి యా యశరణశరణమునకేలఁ బోయెదము ?

క్రోధముతో దైత్యరాజిట్లనెను :- "మీరట్లు చెప్పినమేము మీ మాటను నమ్మఁగలము. మీరు నేర్పకున్నను మీకడ విష్ణు దూతలగు వైష్ణవులు రహస్యముగ నుండి వీనికి విష్ణుదాసతా వాక్యములను నేర్పుచుందురు."

గురుపుత్రులిట్లనిరి :- "అన్నదాతా ! అపరిచిత వ్యక్తితో నీతనికి సమావేశము కలుగనీయరాదని మీరు చెప్పినప్పటినుండి మేము చాల జాగ్రత్తగ నుంచుచున్నాము. ఈతని నెల్లప్పుడును దగ్గఱనే కూర్చుండఁబెట్టుకొను చున్నాము. దగ్గఱనే పరుండఁ బెట్టుకొనుచున్నాము. మాలో నొక రేదైన పనిమీద నవశ్యముగ వెళ్ళవలసి వచ్చినచో రెండవవార మవశ్యమీతని సమీపమున నుండి కనిపెట్టుచుంటిమి. కావున నితరులవలన వీఁడు దీనిని నేర్వలేదని మేము దృఢముగఁ జెప్పఁగలము."

ఇది వినఁగానే హిరణ్యకశిపునకు గురుపుత్రులయెడలఁ గలిగిన కోపము తగ్గిపోఁ జొచ్చెను. సరళముగ నాతఁడు వారితో నిట్లనెను :- "ఇది చాల ఆశ్చర్యకరముగ నున్నది. మీరు చెప్ప లేదు, ఇంకెవరినిఁ గలిసికొనలేదు. అట్టియెడల నీతఁడు మన శత్రుభక్తి నెట్లు నేర్చుకొనినాఁడు ?"

రాజు క్రోధరహితుఁడగుటను గాంచఁగానే గురుపుత్రులకు సాహసమినుమడించెను. వారు తమ మాటను సమర్థించుకొనుచు నిట్లనిరి :- "ఇంద్రారీ ! త్రిభువనాధిపా ! రాజా !

కొన్ని గుణములు కొందఱు పిల్లలందు స్వాభావికముగ నుండును. ఆతఁడు తల్లిగర్భములోనే దానిలోఁ బారంగతుఁడ గును. ఏది పలుకుచుండిన దానిని జేయుచుండును. ఇదే విధ ముగ నిది యీతనికి స్వాభావిక బుద్ధి. ఈ విషయమున మీరు మమ్ములను వ్యర్థదోషులుగ నొనర్పవలదు."

గురుపుత్రుల మాటలపై హిరణ్యకశిపునకుఁ గొంచెము కొంచెముగ విశ్వాసము కలిగెను; దానిని దృఢమొనర్చుటకై తన క్రోధమును ప్రహ్లాదునిపైఁ బ్రసరింపఁజేయుటకు వానిని గసరుచు దైత్యరాజు క్రోధపూర్వకముగ నిట్లనెను :- "ఓరీ కుర్రా! నీవు నిజమును జెప్పుము. నీకీ యమంగళమయమగు చెడ్డ బుద్ధి యెట్లు పుట్టినది ? ఈ విషయములు గురువులు చెప్ప కున్న వీనిని నీ వెచ్చట నేర్చితివి ? అసత్యమును జెప్పవలదు. నిజమును జెప్పుము నీవా యీ మాటలను గలిపి చెప్పినచో నీ చర్మము నీ బెత్తముతో వలిచెదను. నీ యెముకలను ముక్కలు చేసెదను."

నారదుఁడిట్లనెను :- "రాజా ! ప్రహ్లాదునితో నీవిధముగఁ గన్నులెఱ్ఱజేసికొని అసురవరుఁ డిట్లడుగఁగా భక్తాగ్రగణ్యుఁడును మహానుభావుఁడును నగు ప్రహ్లాదుఁడు వెనుక ముందులేక నిర్భ యుఁడై తండ్రి వడిలోఁ గూర్చుండియే మేఘ గంభీరవాక్కు లతో నిట్లనెను :- "తండ్రీ ! గురుపుత్రుల దోషమేమియునులేదు. వీరు నాకీ విషయములను నేర్పలేదు. పూర్వజన్మసంస్కారము లేనిది యెంతగా నేర్పినను నీ విషయములు రావు."

అంతఁ బండ్లుపటపటఁ గొఱుకుచు హిరణ్యకశిపుఁడిట్లనెను :- "దుష్టా ! అదియే నేనడుగుచున్నాను. గురుపుత్రులు చెప్పనిదే నీకీ విషయములందు ప్రవృత్తి యెట్లు కలిగినది?"

ప్రహ్లాదుఁడు నమ్రతతో నిట్లనెను :- "తండ్రీ ! గృహాసక్తులను విషయాసక్తులు నైనవారికి దీనియందుఁ బ్రవృత్తి యెట్లుకలుగఁగలదు. అదియే భార్య, అవియే అన్న జల, పుష్ప శయాదులు, ఒక్కసారి అనుభవించినను నీపదార్థములందు దృప్తియేల జనింపదు. ఎవరు నేర్పిన వీనియందు మాటిమాటికి భోగలాలస కలుగుచున్నది. సాంసారిక భోగ మనిత్యమైనదని సాధుసజ్జనుల వలన వినుచుందుము. క్షణభంగురమును నశ్వరమునైనప్పటికిని దీనినేల బరిత్యజింపరు. ఈ గ్రామ్య సుఖాసక్తులగు వారి బుద్ధి స్వతఃగాని పరతఃగాని పారిస్పరిక సత్సంగముచేఁగాని భగవంతునియందు లగ్నముకాదు. కావున మహారాజా ! ఇవి నేర్చుకొనిన రావు."

హిరణ్యకశిపుఁ డిట్లుచెను :- "ఓరీ, నీచా ! కులాంగారా ! నీ భగవంతుఁడట్టి వాఁడగునో నాసమ్ముఖమున కేలరాఁడు. నా బుద్ధిని విపరీతముల నేలఁగావింపఁడు, పిల్లలను జెడగొట్టు టెందులకు ? అమాయకులను ధన మాయలోఁ బడవైచుకొను టెందులకు ?"

అంతఁ బ్రహ్లాదుఁడిట్లనెను :- "మహారాజా ! అందఱ యెదుట నా శ్రీహరి ప్రకటముకాఁడు. అందఱు నాతనిఁ బొందలేరు. ఈ సాంసారిక విషయములనే సర్వస్వమనియు సుఖ

సాధనమనియు భావించి వానివెంటఁబడి, 'అపుత్రస్యగతిర్నాస్తి' అనునిట్టి పుష్పిత వాక్యములనే ప్రమాణముగ భావించి తోడేళ్ళ బారిబడి అంధకూపమునఁబడిన మీవంటి దుర్మాత్ములకు బరమ పురుషార్థ స్వరూపుఁడగు శ్రీహరి యెట్లు ప్రాప్తించఁగలఁడు?"

అంతఁ బెదవులను బండ్లతోఁ గొఱకుచుఁ గ్రోధముతో దైత్యేశ్వరుఁడగు హిరణ్యకశిపుఁడిట్లనెను :- "ఓరీ దుష్టా! ఆ పరమ పురుషార్థరూపుఁడగు నీ విష్ణు వెచ్చటనున్నాఁడురా ? వాఁడుబలహీనుఁడనియు, నపుంసకుఁడనియు, బిఱికివాఁడనియు నేననుకొనుచున్నాను. వానిలో నేమైన శక్తియున్నచో నాయెదు టకు వచ్చి చేతులు కలుపరాదా !"

ప్రహ్లాదుఁడు నిర్భీకుఁడై యిట్లనెను :- "తండ్రీ ! కోప మును జెందకుఁడు. క్రోధము చాల చెడ్డది. భగవంతుఁడందఱ కును లభించువాఁడుకాఁడు. నిష్కించిన భగవద్భక్త మహాపురు షుల చరణరజమును శ్రద్ధతో నిత్యనియమముగఁ బాదాదిశిరః పర్యంతము సర్వాంగ స్నానము చేయనంతవఱకు భగవద్ద ర్శనము దుర్లభము, అసంభవము, అసాధ్యము. మహారాజా ! బుద్ధి వాసుదేవుని చరణారవిందములందు విలీనము కానంత వఱకు సంసారరూపమగు ననర్థము సర్వథా నాశముకాదు. మీకు బాహ్యదృష్టియే కలదు. ఇప్పుడు నే నింత నధికముగ నేమి చెప్పగఁలను."

ప్రహ్లాదుని నోట యీ మాటలు వినఁగానే హిరణ్యకశి పుని కోపమునకు మేఱలేకుండెను. ఆతఁడు క్రోధాంధుఁడ

యెగ్యుడు. వడిలో నున్న తన ప్రియకుమారునిఁదీసినేలకు వైచి కొట్టి భటులను సంబోధించుచు నిట్లనెను :- "ఈ దుష్టునిట నుండి దీసికొనిపొమ్ము, ప్రాణములతో వదల వలదు."

సమీపమునఁ గూర్చుండిన మంత్రి యిట్లనెను:- 'ప్రభూ! పసిబాలకుని మీఁద నింతకోపముచితముకాదు."

క్రోధావేశమున దైత్యరాజిట్లనెను:- "వీఁడు పసివాఁడు కాఁడు. పరమపోకిరి. వీనినిమించిన నీచుఁడెవఁడుండును? విష్ణువు మాకుల సంహారకుఁడు. నాకు తమ్ముఁడును వీనికిఁబిన తండ్రియగు హిరణ్యాక్షునిఁ జంపినవాని నీతఁడు పూజించుచు న్నాఁడు. వానికి దాసుఁడైనాఁడు, వీనికిని విష్ణువునకును భేదమే మున్నది? శత్రుని మిత్రుఁడు కూడ మనకు శత్రువే. ఒకానొక ప్పుడు వీఁడును నాశత్రువుతోఁ జేరి నన్నుఁ జంపింపఁ గలడు. వీనికంటె నీచుఁడింకెవఁడుండును? "నేను విష్ణుపూఁజనుజేసెదను. ఆతనిభక్తినిఁజేసెద'నను చుండును. వీఁడు విష్ణువునకైనను నేమి భక్తి చేయఁగలఁడు. తన తండ్రికే భక్తుఁడు కానివాఁడు విష్ణు భక్తుఁ డేమికాగలఁడు? ఆతనితో నభిప్రాయ భేదమువచ్చెనా ఆతనిని ద్వేషించును. పుత్రుని పాదములు పురిటింటిలోనే కనఁ బడును. వృద్ధికివచ్చు చెట్టాకులు పుట్టుకతోడనే దట్టముగ నుండును. పువ్వు పుట్టఁగానే పరిళమించును. ద్వేషి అందఱను ద్వేషించుచుండును. ప్రేమద్వేషములను మానవుఁడు పుట్టుక తోడనే నేర్చుకొనును. తండ్రికిని, గులమునకును, బరివారము నకును హితైషికానివాఁడు, పక్షపాతికానివాఁడు దేశధర్మమునకు

పక్షపాతి యెట్లుకాఁగలడు? ఇంటిలోని వారియెడల ద్వేషమును శత్రువుల తోడ మైత్రియు నిదియే నాభక్తి, ఐదేండ్లవాఁడు. వీఁడు నాయెదుట నెట్లెదిరించి మాటలాడు చున్నాఁడో చూడుఁడు సిగ్గును గూడ చెందుట లేదు."

మంత్రి యిట్లనెను:- "మహారాజా! ఏమైనగానిండు పుత్రుఁడు పుత్రుఁడే, తన శరీరమునుండి పుట్టిన పుత్రు నెవఁడు వధింపఁగలఁడు?"

అంతఁ గ్రోధముతో హిరణ్యకశిపుఁ డిట్లనెను:- మంత్రీ! నీ వెట్టిమాటలు మాటాడుచున్నావు. శరీరమున నుత్పన్నమైన వన్నియును గ్రాహ్యములు కావు. మలమూత్రములు, స్వేదము, శ్లేష్మము, పాచి, పుసి, నఖ, కేశ, రోమ, రోగములు నివియన్నియును శరీరమునుండి యుత్పన్నమైనవియే. బుద్ధిమంతుఁడగు వాఁడు తన హితముకొఱకు వీనిని వెంటనే శరీరమునుండి వేఱుఁగావించి, మరల వానివైపునకుఁ జూడనైనఁ జూడఁడు. రోగములు శరీరమునుండియే పుట్టుచున్నవి. వాటిని మనహితములని భావించెదము; కాని శరీరమునుండి యుత్పన్నమైన రోగములను నాశమొనర్చు నోషధులితరస్థలములందే యుత్పన్నమగును. అవి హితకరములని వానికి స్థానమొసంగుచున్నాము; తినుచున్నాము. కాలికి మేహవ్రణము లేచి క్రుళ్ళినచో బుద్ధిమంతుఁడగువాఁడు యంగమును ఖండించిపాఱవైచి, యింక నెచ్చటనో పుట్టిన కాష్ఠలోహ పాదములను దగిలించుకొను

చుందురు. కావున నీదుష్టునిమీఁద దయనుజూపరాదు. సర్పము నకుపాలనుబోసినచో విషమే అభివృద్ధినిఁజెందును."

శా॥ అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి
షాంగ శ్రేణికి రక్షసేయు క్రియ నీయజ్ఞుం గులద్రోహి దు
స్సంగుం గేశవ పక్షపాతి నధముం జంపించి వీ వ్రతో
త్తుంగ ఖ్యాతిఁజరించెదం గులము నిర్దోషంబు గావించెదన్॥
....శ్రీమదాంధ్రభాగవతము.

సేవకులు చేతులు జోడించుకొని యిట్లడిగిరి:- "ప్రభూ! వీనిని మేమే యుపాయముచేఁ జంపవలెను?"

హిరణ్యకశిపుఁడిట్లనెను :- "వీఁడెట్లు చావఁగలఁడో అట్లు చంపుఁడు. లడ్డులో విషమునుబెట్టి తినిపింపుఁడు. పాలలోఁగలిపి గుటగుటఁ ద్రావింపుఁడు. ఇనుపరేకులపైఁ బరుండఁబెట్టి విష ప్రయోగమొనర్పుఁడు అగ్నిలోఁ గూర్చుండఁబెట్టుఁడు. నీటిలో ముంచుఁడు. సారాంశమేమనఁగా నేయుపాయముచేనైనను వీని ప్రాణములను దీయు నుపాయమును జూడుఁడు."

యుధిష్ఠిరునితో నారదుఁ డిట్లనెను :- "రాజా! ఆసేవ కులు ద్రవ్యదాసులు ద్రవ్యముకొఱకు వీరు సర్వమును జేయఁ గలరు. తమయజమాని చెప్పినది ఉచితముకానిండు అను చితముకానిండు దానిని జేయవలసియుండును వారసుర స్వభావ ముచేఁ గ్రూరులైనను నమాయకుఁడును రాజపుత్రుఁడునగు ప్రహ్లాదునిఁజంపుట కిష్టములేదు; కాని యేమి సేయఁగలరు?

వారి స్వామియే తన యౌరసపుత్రుని@ జంప నాజ్ఞాపించు చున్నాఁడు. అందువలన వారు కట్టుఁడు కొట్టుఁడు చంపుఁడని తమ తీక్షణములగు గోరలను బయటపెట్టుచు పరశు, భల్ల, త్రిశూలాదులను గైకొని ప్రహ్లాదుని@ జంపుటకుఁ బరువిడి; కాని యచ్యుతునిచే రక్షింపఁబడువారి నెవరేమిచేయఁగలరు ? అందు వలన వారి అస్త్రశస్త్రములు వ్యర్థములయ్యెను. అప్పుడసురులు ప్రహ్లాదుని@ జంపుట కనేకోపాయములను గావించిరి. వానిని అభివర్ణించెదను.

....౦....

## ప్రహ్లాదుని@పై ప్రహారము

౪౬౬

శ్లో॥ పరే బ్రహ్మణ్య నిర్దేశ్యే భగవత్యఖిలాత్మని ।
యుక్తాత్మన్యఫలా ఆసన్నపుణ్యస్యే వసత్క్రియాః॥

....శ్రీ భాగ. ౭ స్కం, ౫ అ. ౪౧ శ్లో॥

వ. "ఇట్లు సర్వాత్మకంబై యిట్టి దట్టిదని నిర్దేశింపరాని పర బ్రహ్మంబు దానయైయమ్మహా విష్ణువుయందుఁ జిత్తంబుఁజేర్చి తన్మయుండయి పరమానందంబునం బొందియున్న ప్రహ్లా దునియందు రాక్షసేంద్రుండు దన కింకరులచేతం జేయించు చున్న మారణకర్మంబులు పాపకర్మునియందుఁబ్రయుక్తంబు లైన సత్కారంబులుంబోలె విఫలంబులగుటం జూచి."

-శ్రీమదాంధ్ర భాగవతము.

భగవంతుఁడు ముందుగా సహనశక్తి నొసంగి తరువాత దుఃఖము నొసంగును, సాధారణముగాఁజికిత్సలత్యంత వ్యయసాధ్యమైన గొప్ప రోగములు సాధారణముగ నిర్ధనులకును, దరిద్రులకును రావు. సహనశక్తి కలవారికే దుఃఖములు వచ్చిపడును. అప్పుడు భగవంతుఁడొక్కొక్క దేహమందు దనశక్తినిఁ బ్రదర్శించును, మానవులు గొప్పవారిలో గొప్ప, చిన్నలోఁజిన్న, లావులోలావు, బరువులో బరువు, అగునట్టి అణిమాగరిమాలఘిమాది యోగశక్తు లనేకములు గలవు. శక్తులచే నాకాశమున నెగురవచ్చును. త్రిలోకములను వశపఱచుకోవచ్చును. నూతన సృష్టి చేయవచ్చును. మనస్సే కాగ్రమైనపుడు దానినే కార్యమందు దృఢముగ నియోగించిన నదియేకాఁగలదు. మనస్సుననసంతశక్తి కలదు. ఈ ప్రపంచమంతయును మనస్సు చేతనే నిర్మింపఁబడినది. చిత్తమునే కాగ్ర మొనర్చుట కొక్క మార్గముకాదు. అనేక మార్గములుకలవు. దేనిమీఁదనైనను సరియే, యెట్లైనను యథాభిమత ధ్యానముచేఁగూడ చిత్తమేకాగ్రమగును. తమ చిత్తమును జిత్తచోరుఁడగు వ్రజకిశోరుని చారు చరణములందు లగ్నమొనర్చినప్పటికినదియును నట్లేకాఁగలదు. భగవంతుఁడనిర్వాచ్యుఁడు. కావున భగవద్భక్తులందెంతటి మహత్మ్యముండునో దానినెవరును జెప్పఁజాలరు. భగవానుఁడు సర్వాత్ముఁడగుటచే భక్తుని సుఖదుఃఖములును నందఱ సుఖదుఃఖములగును. ఆతనికేవిషయముననను సుఖమునులేదు దుఃఖమునులేదు. అట్టివాఁడెల్లప్పుడును సుఖదుఃఖములకుఁ బలమగు

బరమానందమందు నిమగ్నుఁడగును. సారాంశమేమనగా భగవంతునకు భక్తునకును భేదమేలేదు, ఇద్దరునొక్కటే.

నారదుఁడిట్లనెను :- "రాజా ! స్వపరాభి నివేశము అజ్ఞానముచేఁ గలుగుచున్నది. స్వార్ధమున నంధుఁడై మనుష్యుఁడు కర్తవ్యాకర్తవ్యములను మరచిపోవును. తనమాటను నెగ్గించుకొనుటకును, శ్రేష్ఠమనిపించుకొనుటకునుసమస్త ప్రయత్నములను జేయుచుండును. ప్రహ్లాదుఁడు హిరణ్యకశిపుని ఇచ్ఛకు విరుద్ధముగ భక్తిమహిమను వర్ణింపఁగా నాతఁడు తన వడిలోనుండి యావలఁబారవేయుటయేకాదు, తన సేవకులను బిలిచి వానినిఁజంపఁబంపెను, రాక్షసులు క్రూరులుగ నుందురు. పైగా వారాతని సేవకులు. స్వామి యేయాజ్ఞలొసంగిన దానిని భావింపవలయును. అందునలన వారుత్రిశూలములను ద్రిప్పుచుఁ గొట్టుఁడు, కట్టుఁడు, కోయుఁడు పట్టుకొనుఁడనుచు నఱచుచు వారివారి బల, పౌరుష, క్రోధములను జూపించుచుఁ ప్రహ్లాదుని వైపునకుఁబరువిడిరి. కాని ఆ సమయమున నాతని శరీరము వజ్రసదృశమయ్యెను. భగవానుఁడే భక్తుని హృదయరూపమగు భవనమందు దృఢవపువును గావించుకొని కూర్చుండెను. ఇప్పుడు భగవంతునిఁగొట్టుటకు సామర్థ్య మెవరికిఁగలదు ? పరమాత్మనెవరు కొట్టి కోయఁగలరు ? అందువలన నసురుల యాప్రహారములు ప్రహ్లాదుని మర్మస్థానములందు గోమల పుష్పములతోఁ గొట్టుచున్నట్లుండెను. అసి, త్రిశూల, ఖడ్గ, తోమరాది అస్త్రశస్త్రములు గిరులపైగొట్టిన ఖడ్గములు విఫల

ములైనట్లు ప్రహ్లాదుని శ్రీయంగములయందు విఫలములై పోయెను. భగవంతుఁడెవని చిత్తముననుండి, భగవద్రూపమై పోయినదో వానికి హానినిఁజేయఁగలవారెవరు ?

ధర్మరాజుతో నారదుఁడిట్లనెను :- "రాజా! అతిబలులగు నసురుల అస్త్రశస్త్రములు ప్రహ్లాదుని శరీరమున వ్యర్థముకాఁగా హిరణ్యకశిపుని ఆశ్చర్యమునకు మేఱలేకుండెను. ఆతడిట్లను కొనెను.

ఉ॥ ముంచితి వార్ధులన్ గదల మొత్తితి శైలతటంబులందు ద్రొ
 చ్చించితి శస్త్రరాజిఁబొడిపించితి మీఁద నిభేంద్ర పంక్తి ద్రొ
 ప్పించితి ధిక్కరించితి శపించితి ఘోర దవాగ్నులందుఁ ద్రో
 యించితిఁబెక్కుపాట్ల నలయించితిఁజావఁడిదేమి చిత్రమో॥

చ॥ ఎఱుఁగఁడుఁ జీవనౌషధము లెవ్వరు భర్తలులేరు బాధలం
 దరలఁడు నైజతేజమునఁ దథ్యము జాడ్యములేదు మిక్కిలిన్
 మెఱయుచు నున్నవాఁడొక నిమేషముదైన్యమునొందఁడింకనే
 తెఱఁగునఁద్రుంతు వేసరితి దివ్యము వీనిప్రభావమెట్టిదో॥

-- శ్రీమదాంధ్ర భాగవతము.

వీఁడపశ్యము మంత్రమేదైన నేర్చియుండ వచ్చును. తప్పక విష్ణు పక్షపాతులగు గుప్తచరులు వీనికేదో విద్యను నేర్పియుందురు. అందువలననే వీనికెన్ని ప్రహారములను గావించినను జావకున్నాఁడు. కాని నేను నా శత్రువునెట్లు బ్రతుకనిచ్చెదను, ఇంద్ర, వరుణ. కుబేరాది గొప్పగొప్ప దిక్పాలురే వశముకాఁగా నీకుట్టిఁడేమిలెక్క ? వీఁడెన్ని మాయలను నేర్చి

నను ఆపి నాముందఱఁ బనికిరావు. నేను వీనినిఁజంపకమానను. ఇట్లాలోచించుచున్నాఁడు గాని వాని చిత్తము శంకించుచునే యుండెను. పాపి చిత్తమెల్లప్పుడును శంకించుచుండును,"

ఇప్పుడాతఁడు తన సేవకులతో నిట్లనెను:- "గజశాలకు ముందునున్న ప్రత్యేక గజశాలలో నొక మదోన్మత్త గజమున్నది. వీనిని దానిముందు బడవేయుఁడు. అది వీనిని దన పాదములతో మర్దించివేయఁగలదు."

సేవకులట్లే యొనర్చిరి. ప్రహ్లాదునిఁ గొనిపోయి నరవాసన కొట్టఁగానే చీల్చివేయు మదపుటేనుఁగుముందుఁ బడవైచిరి. అది యాతని శ్రీ యంగములను మూఁజూచి ప్రేమతోఁ దొండముతోఁ జుట్టి వీపుపైఁ గూర్చుండబెట్టుకొనెను. ఇప్పుడు ప్రహ్లాదుండు దాని చెవినిఁబట్టుకొని తోలసాగెను. అది నెమ్మదిగా గేదె వలెఁ బ్రహ్లాదు నెక్కించుకొని యేయుపద్రవమును గావింపకయే రాజసభాద్వారము కడకువచ్చి నిలుచుండెను. మదించిన గజము బ్రహ్లాదుని ఆజ్ఞానుసారముగఁ గార్యమొనర్చుటనుగాంచి హిరణ్యకశిపుఁడు మిక్కిలి ఆశ్చర్యమును జెందెను. ఆతఁడిట్లనుకొనెను:- ఈ యేనుఁగులకు విషములేదు. ఎప్పుడైన మదమున నున్మత్తమగును. ఒక్కొక్కప్పుడు మదము దిగును. విషధరసర్పముల కోఱలయందు సదా విషమునిండియుండును. పది యిరువది గొప్ప సర్పములను వీని శరీరమునకుఁ జుట్టింపఁ

జేసినచో నవి తప్పక గాటు వేయఁగలవు, తీక్ష్ణ విషముగల క్రూరసర్పములు కఱచినచోఁ బ్రాణులు బ్రదుకఁజాలరు. వాని విషముచేఁ బచ్చిచెట్టుకూడ తక్షణ మెండిపోఁగలదు." ఇట్లాలోచించుకొని ఆతఁడు సేవకులతో నిట్లనెను:- "పోండు, పెద్దపెద్ద తీక్ష్ణ విషధరసర్పములను గొనిరండు వానిచేఁ గఱపింపుఁడు. అప్పుడు వీఁడు చావఁగలఁడు."

వీఁడేయుపాయము చేతను జావఁడని సేవకులకు విశ్వాసము గలిగెను. జడచేతనములన్నియును ననుకూలములైన ప్పుడు, ప్రకృతి దాసియైనపుడు వీనికిఁ బ్రాకృతికోపాయములచే మృత్యువెట్లు సంభవింపఁగలదు? అయినను స్వామియాజ్ఞను బాటింపవలయును. గొప్ప గొప్ప విషధరసర్పముల నాతఁడు తీసికొని వచ్చెను. ఒక సురక్షిత స్థానమునఁ బ్రహ్లాదునిఁ గూర్చుండఁబెట్టి బుసలుకొట్టుచుఁ గ్రోధమున నున్న విషధర సర్పములను నొకదానివెంబడి యింకొక దానినిఁ బడివైచిరి. కాని యీ సర్పము లన్నియును బ్రహ్లాదుని వడిలోఁబరుఁడెను. ఆతని శరీరమునకుఁజుట్టుకొని యాడుకొనుచుండెను. "అహింస ప్రతిష్ఠాయాం వైరత్యాగః" అహింస ప్రతిష్ఠయందు వైరము డుగును. ఏ జంతువుయెడలను లేశమాత్రమైన హింసాభావము లేకున్నచోఁ గొన్నాళ్ళకు గ్రూరజంతువులు కూడ వైరమును బరిత్యజించును. వానికిఁ బ్రపంచములో నెవ్వఁడును వైరియుండఁడు. వానికరిష్టమెవ్వరును జేయఁజాలరు. ఇట్టి నిర్వైరిని సర్పములేమికాటు వేయగలవు. ప్రహ్లాదుఁడా విషధరసర్పము

లతో నిశ్శంకతో నాడసాగెను. నోరును దెఱచి వానిపండ్లను జూడసాగెను. వానిని హృదయముతోఁ గౌఁగిలించుకొనెను. హారములవలె మెడకువైచుకొనెను. కంకణ కేయూరములవలె నంగములకు ధరించెను.

ఈ లీలను జూచి హిరణ్యకశిపునిముఖము వెలవెలఁబోయెను. వీనికేవో మంత్రతంత్రములు తెలియుట నిశ్చయము. మంత్రములను వ్యర్థమంత్రము లొనర్చుచున్నాఁడు. కావున మంత్ర తంత్రజ్ఞులను బిలిచి వానిమంత్రసిద్ధిని వ్యర్థమొనర్చుటకు హిరణ్యకశిపుఁ డాలోచించుచుండెను.

నారదుఁడిట్లనెను:- "రాజా! ఇప్పుడు హిరణ్యకశిపునకు సంతోషములేదు. సర్వదా ప్రహ్లాదునిఁ జంపుటకు నుపాయములను యోచించుచుండెను.



# ప్రహ్లాదుని చంపు నుపాయము



శ్లో॥ దిగ్గజైర్దందశూకైశ్చ - అభిచారావపాతనై।
మాయాభిః సన్నిరోధైశ్చ గరదానై రభోజనైః॥
శ్రీభాగ. ౭ స్కం. ౫ అ. ౪౩ శ్లో॥

సీ. ఒకమాటు దిక్కుంభి యూథంబుఁ దెప్పించి,
కెరవి డింభకునిఁ ద్రొక్కింపఁ బంపు
నొకమాటు విషభీకరోరగ శ్రేణులఁ,
గడువడి నర్భకుఁ గఱవఁబంపు
నొకమాటు హేతి సంఘోగ్రానలములోన
విసరి కుమారుని వ్రేయఁబంపు
నొకమాటు కూలంకషోల్లోల జలధిలో
మొత్తించి శాబకు ముంపఁబంపు

గీ. విషముఁబెట్టఁబంపు విదళింపఁగాఁబంపు
దొడ్డ కొండచఱులఁ ద్రోయఁబంపుఁ
బట్టి కట్టఁబంపు బాధింపఁగాఁబంపు,
బాలు గినిసి దనుజపాలు డధిప.

సీ. ఒకవేళ నభిచార హోమంబు సేయించు,
నొకవేళ నెండల నుండఁబంచు
నొకవేళ వానల నుపహతి నొందించు,
నొకవేళ రంధ్రంబు లుక్కఁబట్టు
నొకవేళఁ దనమాయ నొదవించి బెగడించు.

సర్వాత్మభావముతోఁ దన్నుఁ బ్రభువున కర్పణమొనర్చు కొనిన వారికిట్టి ఘోరవిపత్తులు వచ్చినప్పటికినిఁ బ్రతీకార మొనర్పరు వారిట్లందురు :- "మా యొక్క తను, మన, ధన ములనన్నిటిని నాతని కర్పించితిమి ఆతఁడేమి చేసినను సరియే. మనమనురోధమును జేయరాదు. విరోధము నొనర్పరాదు. ఇదే విధముగఁ బురుషార్థవాదులు తమ పురుషార్థము చేతనే సమస్త కార్యములను జేయఁ బ్రయత్నించుచుందురు. ఆగతి విపదాపత్తు లను దమ ప్రయత్నముచేతనే ప్రతీకార మొనర్పఁదలఁచెదరు. వారు ప్రాణములున్నంతవఱకు ప్రయత్న మొనర్చుచుందురు. ఎన్నటికిని హతోత్సాహులు కారు.

నారదుడు ధర్మరాజుతో నిట్లనెను :- "రాజా ! అసురుల వలనఁ ద్రిశూలములవలనఁ జావక దిగ్గజములు [illegible] నలుగక, విషధరములు కఱచినను జావకున్న[illegible] కశిపుఁ డిట్లనుకొనెను :- "ఈతఁ డిట్లు [illegible] ప్రభావముచే నీతఁడి విపత్తుల నన్నిటిని [illegible] కావున వీనిపై నభిచారమును గావింపవలయును. అభిచారముచేఁ దారుణ శక్తుల వలన వీఁడు తప్పకఁ జావఁగలఁడు" ఇట్లాలో చించి యాతఁడు గొప్ప గొప్ప ఇంద్రజాల మహేంద్రజాలము లొనర్పఁగల మంత్ర తంత్రజ్ఞులను బిలిపించెను.

పిలిచి అందఱితో నిట్లనెను :- మీరందఱును మారణ, మోహన, ఉచ్చాటనముల నెఱుఁగుదురా? నేను శత్రురూపుఁడగు నా యీ పుత్రుని వధింపఁగోరుచున్నాను.

అంతనొకఁడిట్లనెను :- "మేము ప్రయోగ మొనర్చిచంపెదము" ఒకఁడిట్లనెను:- "మేము హవనమొనర్చి కృత్యనుత్పన్నముగావించి దాని ద్వారా వానినిఁ జంపెదము." ఇంకొకఁడిట్లనెను :-"మేము కొన్ని వస్తువులను వీనిమీఁదఁ బడవైచెదము. ఆతఁడట్లే నిద్రించి నిద్రించి యిఁక లేవకుండును."

అన్ని విషయములను విని అసురుఁడా సామగ్రినంతను దెచ్చుటకు యథేష్టద్రవ్యము నొసంగెను. వారు తమయిష్టశక్తులను స్మరించి తామసప్రయోగమును జేసిరి. కాని సాత్వికదేవుఁడగు విష్ణుని సమ్ముఖమున నీ తామస భూత, ప్రేత, పిశాచ, కృత్యాదులేమి చేయఁగలవు. విష్ణుభక్తులైనవారిని, సర్వేశ్వరుని హృదయములో నిల్పుకొనినవారిపై నభిచారము పనిచేయదు. కృత్య అట్టివాని కడకు వచ్చుటకు భయపడును. వానిపై ప్రయోగించిన మారణ, మోహన మంత్రాదులన్నియును వ్యర్థమైపోవును. అందువలన నింతమందిచేఁ జేయఁబడిన కార్యములు ప్రహ్లాదునిపై నేమియును జేయఁజాలకపోయెను."

వీనిపై మంత్ర తంత్రములు పనిచేయలేదని హిరణ్యకశిపుఁడు తెలిసికొనెను. అప్పుడాతఁడు సేవకులను బిలిచి, యిట్లనెను:- "వీనినిఁ జాల యెత్తైన కొండశిఖరము మీఁదకుఁ గొని పోయి పడవేయుఁడు. పడునప్పుడు రాళ్ళు తగిలి చచ్చిపోఁగలఁడు. ఒకవేళ మధ్యలోఁ జావకున్నను క్రిందపడిన తర్వాత నవశ్యము చావఁగలఁడు."

సేవకులు సేవకులేకదా! స్వామి యాజ్ఞనుబొంది వారు ప్రహ్లాదుని బర్వతముమీదఁకుఁ గొనిపోయిరి. ఆతనిని గిరిశిఖరమునుండి క్రిందకు దొఱలించిరి. కాని ప్రహ్లాదుని శరీరము భగవత్కృపచేఁ బుష్పమువలెనయ్యెను. ఆతని కేమియును గష్టము కలుగలేదు. ఆతని క్రింద నెవరో ఆతనిని వడిలోనికిఁ దీసికొనినట్లు తోచెను.

అంత శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఇదెట్లు జరగఁగలదు. ఇందులో నత్యుక్తిమాకు కనఁబడుచున్నది."

అంత సూతుఁడు గంభీరుఁడై యిట్లనెను:- "అన్నివిషయములు తర్కమునకు సిద్ధింపవు. విశ్వాసము ముఖ్యము. ఇది కృత యుగము నాటిమాట. ఈ కలియుగమునందును దర్కముచే సిద్ధము గాని విషయములెన్నిటినో చూచుచున్నాము.

ఒక పిల్లవాడు బావిలోఁ బడెను. మూఁడురోజుల కట్టుబడినాఁడని తెలిసెను. వానిని బావిలోనుండి తీయఁగా బ్రతికి స్వస్థముగ నుండియుండెను; అడుగఁగా నాతఁడిట్లు చెప్పెను:- "నన్నెవరో వడిలోఁగూర్చుండ బెట్టుకొనినారు. నిత్యమును బాలను ద్రావించెడు వారు." ఒకనొకచోట భూకంపమువచ్చెను. చాలమంది దానిలో నడుగునఁబడిపోయిరి. మూఁడవదినమున చాలమంది మనుష్యులుపోయి రాళ్ళను, మట్టిని తొలఁగించఁగా నొక వృద్ధుఁడును బాలకుడును బ్రతికి బయటఁబడిరి. ఇంకొకచోట భూకంపముకలిగెను. ఒక గర్భిణియు నందఱితోనడుగునఁ బడిపోయెను. చాల దినములైన తరువాత మట్టి తొలఁగింపఁ

బడెను. ఆ గర్భిణి స్వస్థముగనుండుటమేగాక, ఆమెకొకపిల్ల వాఁడు కలిగెను. మాతాపుత్రు లిరువురును స్వస్థముగ బ్రతికి బయటఁబడిరి. స్వామీ! ఇట్టివి ఒకటికాదు రెండుకాదు. అనేకో దాహరణములు ప్రత్యక్షముగ నీ కలికాలమున లభింపఁగలవు. ఇచ్చట తర్కము పనిచేయదు. కావున స్వామీ! ప్రహ్లాదుఁడు అనన్యభగవద్భక్తుండు. ఆ భగవంతుని యాజ్ఞలేక నొకయాకై నను గదలదు. వాయువెవని భయమున వీచుచున్నదో, సూర్యుఁ డెవరి భయముచేఁ బ్రకాశించుచున్నాఁడో అట్టి సర్వసమర్థుఁడగు భగవంతుని శరణువేఁడినవాని కెవరి భయముండఁగలదు? వాని నెవరు బాధింపఁగలరు?

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! నీవు యథార్థమును జెప్పు చున్నావు. అచింత్యభావమునకు సంబంధించినవి తర్కముచే సిద్ధంపవు. సరియే, తరువాత నేమియైనది?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! అయినదేమున్నది? ఇచ్చట తండ్రి ప్రహ్లాదుని దుఃఖపెట్టినకొలఁది, ప్రహ్లాదునకు భగవంతుని యందు విశ్వాసము వృద్ధినిబొందెను. అటు దైత్యరాజున కంత కధికముగ క్షోభమును క్రోధమును వృద్ధిఁబొందుచుండెను."

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను :- "రాజా ? పర్వతము నుండి పడవైచినను బ్రహ్లాదుఁడు చావకపోఁగా నాతఁడాసురీ మాయ నుత్పన్నము కావించెను.

హఠాత్తుగా నాకాశమునుండి గడగడ దడ దడ మను శబ్దము బయలుదేరెను. రక్తము వర్షించుచుండెను. మెఱపులు

మెఱయు చుండెను. గొప్పగొప్ప రాక్షసులు ఖడ్గ, పాశ తోమ రాది నానా అస్త్రశస్త్రములను గైకొని దిగుచుండిరి. చేతిలోఁ ద్రిశూలములను గ్రహించి శాకినీ డాకినీ మొదలగు శక్తులు వచ్చి కొట్టు, నఱుకు, పట్టుకో యని పలుకుచుఁ గేకలు వేయు చుండెను. ఇది ఇట్లు జరుగుచునే యుండెను. కాని ప్రహ్లాదుఁడు కన్నులు మూసుకొని భగవద్ధ్యానమునఁ దన్మయుఁడయ్యెను.

మాయ యంతయును వ్యర్థముకాఁగాఁ బ్రహ్లాదు నొక చీకటికొట్టునందు బంధించిరి. దానివలన నాతనికిసుమంతైనను గష్టము కలుగలేదు. పైగా మిక్కిలి యానందము కలిగెను, ఆతఁడిట్లనుకొనెను :- "ఇచ్చట నేకాంతమున భగవద్ధ్యానము నిర్విఘ్నముగ సాగఁగలదు. ఆతఁడు ప్రేమాశ్రువులనుగార్చుచు నుచ్చైస్స్వరమున శ్రీహరికీర్తనము చేయసాగెను. ఏకాంతమునఁ జీఁకటికొట్టులో నాతఁ డానందపూర్వకముగ భజన చేయుటను గాంచి హిరణ్యకశిపునకు మిక్కిలి కోపము వచ్చెను. ఆతఁడు తన పత్నియగు కయాధువుకడఁకు బోయి యిట్లనెను :- "నీవు నా యాజ్ఞను మన్నింతువా లేదా ?"

పతివ్రతయగు కయాధువు చేతులు జోడించుకొని యిట్ల నెను :- "నాథా ! మీరిట్లు ప్రశ్నించుచుంటిరేల ? పతివ్రతకుఁ బతికిమించి తల్లి, తండ్రి, పుత్రులు, పరిజనము, పురజనము, బంధువులు ఇంకెవరును లేరు. స్త్రీలకు పతియే దైవము పతియే యిష్టము, ఆమెకు ప్రత్యేకమగు నిచ్ఛలేదు ఆమె పతి యిచ్ఛ యందే తన యిచ్ఛయు చేర్చును. నాకు మీరే సర్వస్వము."

అంతనాదుష్టుఁడిట్లనెను:- "నీవునాయాజ్ఞను మన్నించుచో నీవు నీ కొడుకునకు నేను చెప్పినట్లు విషమిమ్ము."

ఏడ్చుచుఁగయాధువిట్లనెను :- "ప్రాణనాథా ! మీరు నాతో నెట్టిప్రస్తావమును గావించుచున్నారు ? పశుపక్షులును ప్రాణమునొడ్డి తమ సంతానమును రక్షించుకొనును. ఒక్క పాముతప్ప తన సంతానమును జంపుకొను తల్లియెవరుండును. నాథా ! మీరు సర్వసమర్థులు. త్రిలోకములను మీ భుజ బలముచే జయించితిరి. మీరిట్టి యాజ్ఞనునాకొసంగకుఁడు. మీయిచ్ఛ వచ్చినట్లు చేయుఁడు. పుత్రుఁడు నీచాతినీచుఁడైనను తల్లి వాని మేలే కోరును. అట్టియెడనిట్టి యోగ్యుడఁగు సుతునకు నా చేతులతో నేనెట్లు విషమును బెట్టఁగలను ?"

హిరణ్యకశిపుఁడిట్లనెను :- "ఇది నేను వినను. ఒక్క మాటను జెప్పుము. నీవు నాతో నుండదలఁచినచో నీవు పుత్రునకు విషము నొసంగవలెను. నీవు పుత్రునే ప్రేమించునెడల నేనిప్పుడే నిన్నుఁబరిత్యజించెదను."

కయాధువిట్లనుకొనెను:-ఇప్పుడీతఁడఁగీకరింపఁడు. నన్ను పరీక్షించుచున్నాఁడు - నా పుత్రుడు మదమత్త గజముచేతను, విషధర నాగములచేతను, నభిచారాదుల చేతనుజావకున్న విషముచేఁజచ్చునా ? వాని హృదయమున విషహారియగు వాసుదేవుఁడు నివసించుచున్నాడు. ఆతఁడు పూతన స్తనములందలి విషమును జీర్ణింపఁజేసికొనినాఁడు. అనుకొని ఆమె చేతులను జోడించి యిట్లనెను :- "స్వామీ ! అట్లగుచోఁబతి పుత్రులలోఁ

బతియొక్క గౌరవమే అధికమైనది. పతియుండిన ననేకులగు బుత్రులు కలుగుదురు. కాని పతి పరిత్యజించినచో స్త్రీలకు గతి లేనేలేదు. నేను మీయాజ్ఞప్రకారమే చేసెదను."

హిరణ్యకశిపుఁడీర్ష్యా ద్వేషములచే నున్మత్తుఁడయ్యెను. ఆతఁడు ప్రహ్లాదుని చీఁకటికొట్టునుండి స్వయముగఁబోయి తీసికొనివచ్చి వాని తల్లికి సమర్పించెను.

నారదుఁడిట్లనెను :- "రాజా ! ఈర్ష్యాళువు, ద్వేషులు! లోభులు తమ సంబంధులనైన విశ్వసింపరు. హిరణ్యకశిపుఁడు తన చేతి తోడనే అతి తీక్షణమగు హాలాహల విషమును ఘటించి తెచ్చి తన భార్యచేతికొసంగెను.

ఆమె యేడ్చుచు నేడ్చుచుఁగరుణాశ్రువులను గార్చుచు వణకుచుఁ జేతులతో నా విషమును బ్రహ్లాదున కొసంగెను. ప్రహ్లాదుఁడు భగవన్నామ మొనర్చుచు దానినిఁ ద్రాగఁగానే తల్లి యుచ్చ స్వరమునఁగేకవైచి నేలమీఁదఁబడి అచేతయయ్యెను. విషమునంతను బ్రేమపూర్వకముగఁద్రావి ప్రహ్లాదుఁడు తన తల్లిని లేవనెత్తి యిట్లనెను :- "అమ్మా ! నీవు నాకమృతము నొసంగి దుఃఖించెదవేల ? అమ్మా ! జనార్దనుని నామమును బలికి, ఆతనికి నివేదించి తీసికొను నేవస్తువైనను నమృతమునకు మించినది కాఁగలదు. భగవత్ప్రసాదముచే నింతవఱకెవరికిని ననిష్టముకలుగలేదు. కలుగఁబోదు. అమ్మా ! నేను స్వస్థుఁడనై యున్నాను. నీవు లేచి నను ముద్దాడుము."

తనపుత్రుని యీ వచనములను విని తల్లిలేచి చూడఁగాఁ బిల్లవాఁడు స్వస్థుఁడై నవ్వుచుండెను. భగవంతుని సుమధుర నామములను గీర్తించుచుండెను. అప్పుడామె కాంతరిక సంతోషము కలిగెను. కాని హిరణ్యకశిపుని క్రోధమునకు మేఱలేకుండెను; అప్పుడాతఁడింకను గ్రుద్ధుడయ్యెను. కానియేమి చేయఁగలఁడు ? ఆతఁడు తన శక్తికొలఁది సమస్త ప్రయత్నముల నొనర్చెను. ఏ యే కారణములచే మృత్యువు సంభవింపఁగలదో వాని నన్నిటినిఁ బ్రయోగించెను. కాని ప్రహ్లాదుని నవియేమియును జేయలేకపోఁగా, ఆతఁ డెంతగా నాతనిఁ జంపఁదలచుచుండెనో అంతకెక్కుడుగ నానందమును జెందుటను గాంచుటచేతను, ఆతఁడు తనను ద్వేషింపక విష్ణునామకీర్తనమును వీడకుండుటను గాంచి వానినిఁజంపుట కన్యోపాయముల నన్వేషించుచుండెను.

....o....

## హరిభక్తునకు భయమెక్కడిది ?

౪౬౦

శ్లో॥ హిమవయ్వగ్ని సలిలైః పర్వతా క్రమణైరపి।
నశశాక యదా హన్తుమపాపమసురః సుతమ్।
చింతాం దీర్ఘతమాం ప్రాప్తస్తత్కర్తుం నాభ్యపద్యత॥
-శ్రీభాగ. ౭ స్కం. ౫ అ॥ ౪౪ శ్లో॥

సీ॥ .......నొకవేళ మంచున నొంటి నిలుపు
నొకవేళఁ బెనుగాలి కున్ముఖుఁగావించు
నొకవేళఁ బాఁతించు నుర్వియందు

గీ॥ నీరు నన్నంబు నిడనీక నిగ్రహించుఁ
గశల నడపించు ఉవ్వించు గండశిలల
గదల వ్రేయించు వేయించు ఘనశరములఁ
గొడుకు నొకవేళ నమరారిక్రోధి యగుచు॥

వ. మఱియు ననేకమారణోపాయంబులఁ బాపరహితుండైన పావని రూపుమాపలేక యేకాంతంబున దురంతచింతా పరిశ్రాంతుడయి రాక్షసేంద్రుండు దన మనంబున-

--శ్రీమదాంధ్ర భాగవతము.

మరణచింతయును, జీవనరక్షణ చింతయును, రేపెట్లు జరుగునా యను చింతయును గలవాఁడు పూర్ణభక్తుఁడుకాఁడు. భక్తునకు జీవన చింతయును మృత్యుభయమును నుండదు. ఆతఁడు దుఃఖములకు విసిగి వేసారి మరణింపఁగోరఁడు. రానున్న మృత్యువును గాంచి పాఱిపోఁడు, ఆతఁడు తనజీవన తంతువును శ్రీహరి కప్పగించినాఁడు. ప్రభూః నీ వెచ్చటికైనను దీసికొనిపొమ్ము. ఎట్లైనను ద్రివ్వుము. ఇట్టి యనన్యాశ్రయుని శ్రీహరి స్వయముగ రక్షించును. ఆతని యోగక్షేమములను నాత్మఁడు వహించును.

ధర్మరాజు నారదునితో నిట్లనెను:- "రాజా! విషమొసంగినను బ్రహ్లాదుఁడు చావకపోఁగా హిరణ్యకశిపుఁడు తన ప్రయత్నమును విరమించలేదు. ఆతఁడిట్లనుకొనెను:- "వీఁడేయుపాయములచేతను జావలేదు. కాని వీనికి భోజనమిడకున్నచో నాఁకలితో వీఁడు చావఁగలఁడు." అని యిట్లాలోచించి యాతఁడు ప్రహ్లాదుని నొక కొట్టులోనుంచి బంధించి తాళములనువైచి, తాళపుచేతిని తనకడఁబెట్టుకొని, యేయుపాయముచేనైన దెరువకుండుటకై తాళముపై సీలుముద్ర నిశానీలను వైచెను.

ప్రహ్లాదునకేచింతయునులేదు. ఆతఁడులోపలఁగూర్చుండి యుచ్చస్వరమున 'శ్రీకృష్ణగోవింద హరే మురారే, హేనాథ నారాయణ వాసుదేవ" అను సుమధుర భగవన్నామములను గీర్తించుచుండెను. దినమంతయును గడచిపోయెను. చీఁకటిపడెను ప్రహ్లాదున కాకలి దప్పులు లేకుండెను. కావలివాండ్రు పిల్లవాఁడాకలిని చెందినాఁడేమోనని చాలదుఃఖించిరి. కాని యీతఁడు నిరంతరము ఆదివ్యాధులను నశింపఁజేయు భగవన్నామామృతమును బానము ప్రేమ పూర్వకముగఁ జేయుచున్నాఁడను సంగతి వారికిఁదెలియదు. మఱునాఁడొక సువర్ణపాత్రమున ఆరు పిండివంటకములను బెట్టుకొని ఒకానొక వ్యక్తి యిట్లనెను:- ప్రహ్లాదా! ఇది భగవత్ప్రసాదము. దీనిని నీవు ప్రేమ పూర్వకముగఁ దినుము."

భక్తులకు భగవంతుని మహాప్రసాదమే సర్వస్వము. ప్రసాదము లభింపఁగానే భక్తుఁడు దానిని వెంటనే తినివేయును

దాని నుంచుకొనఁడు. ఆలస్యమును జేయఁడు. అట్లుచేసిన నది మహాప్రసాదమును నవహేళనము చేసినట్లు కాఁగలదు. ప్రహ్లాదుఁడు క్షీరాన్నమును జుట్టఁగానే కావలివాండ్రు అదరిపడి ఒక ఛిద్రముకుండా లోపలికిఁజూచిరి. ప్రహ్లాదుఁడు సుందర స్వాదిష్ట దివ్యప్రసాదమును దినుచుండెను. దాని మనోహరగంధముచేఁ గొట్టంతయును సువాసితమయ్యెను. ఆ సుగంధముచేఁ గావలి వాండ్రు తృప్తులైరి. వారుపోయి రాజునకు నివేదించిరి:- "ప్రభూ! పిల్లవాఁడు లోలోనే యేదో తినుచున్నాఁడు." ఇది వినఁగానే అసురుఁడచ్చటకివచ్చి చూడఁగాఁ తాళమెప్పటి యట్లే వేయఁబడియుండెను. సీళ్ళుముద్రలు నట్లే యుండెను. లోపలఁ బ్రహ్లాదుఁడు కమ్మని పాయసమును జుర్రుచుండెను.

చూఁడగానే హిరణ్యకశిపుఁడు క్రోధమును గ్రుడ్లెఱ్ఱగ నొనర్చి యిట్లనెను:- "నేను నిన్ను కొట్టులో బంధించితిని. నీకిన్ని సుందర పదార్థముల నెవరొసంగిరిరా?"

ప్రహ్లాదుఁడుల్లాసముతో నిట్లనెను:- "తండ్రీ! తల్లికడుపులోని కొట్టింతకంటెఁ జిన్నది. దానిలోనుండఁగాఁ దినుట కొసంగిన వాఁడిప్పు డిచ్చట నీయఁజాలఁడా? కడుపులో నుండగాఁ జేతులు కాళ్ళను గదలింపజాలము. నోటిని దెరువఁజాలము. చేతులతో గ్రాసము నెత్తుకొని నోటఁబెట్టుకొనలేము. అయినప్పటికిని నేవిధముగనైనను గడుపులోనికి భోజనము నందించుచున్నాఁడు ఇంత పెద్దకొట్టులోనికి, నేను చేతులతో బాగుగాఁ దినఁగలిగియుండ భోజనము నొసంగుటలో నాశ్చర్యమేమున్నది?"

ఈమాట వినఁగానే హిరణ్యకశిపునకు మిక్కిలి క్రోధము కలిగెను. కాని యేమిచేయ గలఁడు ? ఈతని నిఁక బంధించుట వ్యర్ధమనియు, నింకొకయుపాయమున వీనినిఁ జంప వలయుననియు దలఁచి వానినిఁ గొట్టునుండి బయటకుఁదీసి మంచుగడ్డమీదఁ బరుండఁ బెట్టిపైన మరల మంచు గడ్డలను బెట్టెను. అప్పుడును నాతఁడు చావలేదు. గాలిలో నెగురవైచెను. వేడివేడి ఆవిరిగాలిని మీఁదకు విడిచెను. ఈయుపాయము లన్నియును వ్యర్థములయ్యెను. అప్పుడు హిరణ్యకశిపుఁడత్యంత చింతితుఁడయ్యెను. ఆతఁడిట్లనుకొనెను :- "ఇప్పుడు నేనేమి చేయుదును ?"

ఆతఁడు చింతితుఁడగుటనుగాంచి హోళికయను నాతని సోదరి యిట్లనెను :- "అన్నా ! నీవింతగాఁ జింతించెదవేల ?"

ఆతఁడిట్లనెను :- "సోదరీ ! ఏమిచెప్పుదును ? నాయీ దుష్ట పుత్రుఁడు నా శత్రుపక్షమునఁ జేరి నన్నుఁ జంపఁ గోరుచున్నాఁడు. కావున నేనీ గృహశత్రువును నిప్పుడే చంపఁదలఁచుచున్నాను. నేను వీనినిఁ జంపుట కనేకోపాయములను జేసితిని కాని వీఁడు దేనిచేతను జావలేదు."

హోళిక యిట్లనెను :- "అన్నా ! నీవు చింతింపకుము. నీవు వీనినిఁ జంపఁదలఁచుచోఁ నేను వీనినిఁ జంపఁగలను. నేనెట్టి అగ్నిహోత్రమునఁ గూర్చుండినను గాలకుండునట్లు వరమును బొందితిని, నేనీబాలకుని వడిలోఁగూర్చుండబెట్టుకొని

మండుటగ్నిలోఁ గూర్చుండెదను. వీఁడు చావఁగలఁడు. నేనప్పుడు బయటకు వచ్చెదను."

ఇది వినఁగానే హిరణ్యకశిపునకు మిక్కిలి ఆనందము కలిగెను. ఆతఁడచ్చటచ్చట పుల్లలను, గాష్ఠములను, గడ్డిగాదమును దెచ్చి కొండొంతకట్టెల మండెను వైచెను. హోళిక ప్రహ్లాదుని వడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని దానిమీఁదకుఁ బోయి కూర్చుండఁగానే ఆ కట్టెల మండెకు అసురులగ్నిని ముట్టించిరి. భగభగమని కట్టెలన్నియును మండఁ జొచ్చెను. అగ్నినుండి మంటలు లేచిన కొలఁది ప్రహ్లాదుఁడు నవ్వుచుండెను. దీని కాశ్చర్యమును బ్రకటించుచు హిరణ్యకశిపుఁ డిట్లడిగెను :- "వత్సా ! ప్రహ్లాదా! అగ్నిచేఁగాలకుండుటకు నీవేదైన నౌషధమును దింటివా లేక శరీరమున కేదైనను రాచుకొంటివా ? నీవు మండుటగ్నిలో నుండుటచే భయమువేయుట లేదా ?"

నవ్వుచుఁ బ్రహ్లాదుఁడిట్లనెను :-

శ్లో॥ రామనామ జపతాంకుతో భయమ్।
సర్వతాప శమనైక భేషజమ్॥
పశ్యతాత ! మమగాత్ర సన్నిధౌ ।
పావకోఽపి సలిలాయతేఽధునా॥

విష్ణుపురాణము -

తండ్రీ ! రామ నామము జపించినచో సమీపమునకు భయము వచ్చునా ? అది సర్వ తాపములను బోఁగొట్టఁగల

నౌషధము. నాయనా ! నాశరీరమున జూడుఁడు. నాకిప్పుడు పావకుఁడును జల్లని నీరువలె నైనాఁడు, శరీరమున కేదైన నౌషధమును బూసికొంటివాయని యడిగితిరి. నేనౌషధమును గాను, మహౌషధమను. సంజీవిని. జీవనౌషధమును దింటిని. నిరంతరము దానినే సేవించుచున్నాను. దానిని సర్వదా సేవించుటచే నా కాధివ్యాధుల వలనఁ గలిగిన బాధకలుగుటలేదు. నాకు దుఃఖము లేదు. శోకము లేదు. భయము లేదు. గ్లాని లేదు. చింతలేదు. మీరు ప్రత్యక్షముగఁ జూచుచున్నారుగదా ! ఈయగ్ని నాకు నలువైపులను మండుచున్నది, కాని నా సమీపమునకు వచ్చుటలేదు. నాకు దీని జ్వాలలు శీతలములుగ నున్నవి. మలయాచల శీతల, మంద, సుగంధిత వాయువు వీచుచున్నట్లుండెను."

ప్రహ్లాదుని యీ ప్రత్యుత్తరమును విని అసురవరుండు లజ్జితుఁడయ్యెను. ఆతఁడు ప్రహ్లాదుని నగ్నినుండి బయటకు దీయించెను. ప్రహ్లాదుని వస్త్రపుకొనయైనను గాలలేదు. హోళిక ఆ యగ్నిలో భస్మమయ్యెను. ప్రాతఃకాలమున నీ స్థితినిఁగాంచి అందఱును దానిమీఁద దుమ్మునుబోసిరి. నాటినుండి లోకమందు హోళి, ధూళి పర్వము ప్రచలిత మయ్యెను. ఇది రామనామ మహిమమునకుఁ బావనప్రతీకము.

హిరణ్యకశిపునకు ద్వేషేర్ష్యాభయకారణమున రాత్రి యందు నిద్రరాలేదు. ఆతఁడు ప్రహ్లాదున కంతగా భయభీతుఁడగుటయేలనో తెలియదు. పాపిహృదయము సదా భయముచే

నిండియుండును ఆతఁడు మంత్రుల సలహాను దీసికొనెను. వారిలో నొక మంత్రి యిట్లనెను :- "మహారాజా! కుమారుని జంపుటకు మీరనేకోపాయములనుబన్నిరి. వానిలో దేనివలనను వానికిమృత్యువురాలేదు. ఈతఁడేదైనవరదానముచే నజరామరుఁడై నాఁడని తోఁచు చున్నది. నా యభిప్రాయమున వీనిని సముద్రజలమునఁ బడవైచి మరలఁబైకి లేవకుండుటకై పెద్ద పెద్ద పర్వతములను బడవైచినచో నతఁడు చావఁగలఁడు. చావకున్నను వానిక్రిందఁబడియుండును. మనకేమి హానిఁజేయగలఁడు?

ఈ యభిప్రాయమసురులకు నచ్చెను. ఆతఁడు వెంటనే ప్రహ్లాదుని సముద్రమునఁబడవైచి, వేలకొలది రాక్షసులచే గొప్ప గొప్ప పర్వతములను దెప్పించి వానిపైఁ బడవైచి సముద్రమున నొకవిధమగు పెద్దకోటగోడను కట్టెను. ప్రహ్లాదుఁడు దానిలోఁ గూర్చుండి భజన మొనర్చుచుండెను. అసురుఁలు దానినిగట్టిపోఁగానే ప్రహ్లాదుఁడిట్లనెను:- ప్రభూ! నీ విప్పుడేమి కోరెదవు. ఇచ్చట నీ శ్రీవిగ్రహములు కల దివ్యదేశముల యొక్క దర్శనములేదు, సత్సంగములేదు. మంచిది. ఏది లేకున్నను భవభయ హారియును శ్రుతిమధురమునగు నీ మంజులమయ మనోహర నామములు గలవు. వానిని నిరంతరము జపించుచుందును. వానినేయిచ్చటఁగూర్చుండికీర్తించుచుండెను."

నారదుఁడిట్లనెను:- "ఈ విధముగఁ బ్రహ్లాదుఁ డనుకొను నంతలో నా కొండలన్నియును బెండులవలెను, బుష్పముల వలెను దేలుచుండెను. ప్రహ్లాదుఁడు వానిక్రిందనుండి బయటకు

అంత సూతుఁడిట్లనెను :- "మహాభాగా ! శునశ్శేపుని కథను నేను ముందు విపులముగ వర్ణించెదను. అతని తండ్రి అజీగర్తుఁడాతనిని యజ్ఞపశువుగా నమ్మినాఁడని మాత్రము గ్రహింపుఁడు. ఆతఁడపుడు భయభీతుఁడై విశ్వామిత్రుని శరణమునకు వచ్చెను. అప్పుడు విశ్వామిత్రుఁడు తన తపోబలముచే నాతనిని రక్షించెను. విశ్వామిత్రుఁడు మరల మీ తండ్రికడకుఁ బొమ్మనిచెప్పఁగా నాతఁడుస్పష్టముగఁ గాదనునునిట్లుచెప్పెను:- "నాతండ్రి క్రూరముగ నన్నమ్మివేసినాఁడు. ఆతనికడకు నేను బోను, ఆతని గోత్రములోను నుండను," అప్పటి నుండి యాతఁడు విశ్వామిత్రగోత్రుఁడయ్యెను. సూతుఁడిట్లనెను :- "స్వామీ ! ప్రహ్లాదుఁడేమైనఁదనకుఁ జేసిన అపకారములను స్మరించి నన్ను ద్వేషించుచు విష్ణువుతోఁగలిసి మోనముతోఁ దన్నుఁ జంపునేమోనని హిరణ్యకశిపున కనుమానము కలదు. కాని యిది ఆతని భ్రమ. కేవలమాతని కడుపులోని పాపమే. భగవద్భక్తుఁడెవరికిని ద్రోహమొనర్పఁడు. ఇతరుల కపకారముజేయుటకు దలఁపడుఁడు."

నారదుఁడు ధర్మరాజుతో నిట్లనెను :- "రాజా ! ప్రహ్లాదుని అపరిమిత ప్రభావమును స్మరించి హిరణ్యకశిపుఁడు చింతలోఁ బడిపోయెను. ఆతఁడు కింకర్తవ్యవిమూఢుఁడై భవిష్యత్కర్తవ్యమును నిర్ణయించుకొనఁజాలలేకపోయెను.



# హిరణ్యకశిపునకు గురుపుత్రుల సమ్మతి

శ్లో॥ ఇమంతు పాశైర్వరుణస్య బద్ధ్వా
నిధేహి భీతోనపలాయతే యథా ।
బుద్ధిశ్చ పుంసో వయసార్యసేవయా
యావద్గురుర్భార్గవ ఆగమిష్యతి ॥

- శ్రీ భాగ. ౭ స్క. ౫ అ. ౫౦ శ్లో॥

శా॥ వక్రుండైన జనుండు వృద్ధగురు సేవంజేసి మేధానయో
పక్రాంతిన్ విలసిల్లు మీఁదట వయఃపాకంబుతో బాలకున్
శక్రద్వేషణ బద్ధుఁజేయుచు మదిం జాలింపుమీ రోషమున్
శుక్రాచార్యులు వచ్చునంత కితఁడున్ సుశ్రీయుతుం
డయ్యెడున్॥

....శ్రీమదాంధ్రభాగవతము.

మానవునకు దనప్రయత్నము లన్నియును విఫలములైనపుడు ఆతఁడాస్తికుఁడగుచో భగవంతుని శరణువేఁడుటచే నాంతరికశాంతి కలుగును. నాస్తికునకు చింతా, దుఃఖ, ఖేద, గ్లాని, క్షోభలు సంభవించును. ఆతని బుద్ధి విక్షిప్తమగును. అట్టి విక్షిప్తావస్థయందు చాలామంది ఆత్మహత్యను జేసికొందురు. చాలామంది చేయరాని పనులనుజేయుచుందురు. తమ మృత్యువు

స్వతఃసంభవించునట్లు కొందఱు విపరీతాచరణమును గావించెదరు.

నారదుఁడిట్లనెను :- "రాజా ! ఇప్పుడు హిరణ్యకశిపునకు నిద్రించినను, మెల్కొన్నను లేచుచున్నను, కూర్చుండినను ప్రహ్లాదుని చింతయే. ఈతఁడు నాశత్రువగు విష్ణుని భక్తుఁడు. ఈతఁడు చావకున్నచో నేను జావవలసినదే. ఏలననఁగా నేను విష్ణుభక్తునే చంపఁజాలకున్నచో విష్ణువు నేమిచంపఁగలను ?" ఈ విధముగ నాతడనేక విధములఁజింతించుచుండెను.

ఒకానొక దినమున నాతఁడేకాంతమునఁ జింతితుండై కూర్చుండియుండఁగా శుక్రాచార్యులవారి శండ అమర్కులను నిద్దరు పుత్రులాతని సమీపమునకువచ్చి అసురేశ్వరునకు జయ జయకారము లొనర్చి కుశల ప్రశ్నానంతర మిట్లడిగిరి :- "ప్రభూ! మీరింత చింతితులై యున్నారేల ?"

హిరణ్యకశిపుఁడిట్లనెను :- "నాయీ పాపపుత్రుఁడెట్ల జరామరుఁడైనాఁడో మీరు చూచుట లేదా ? చావఁడు నా మాటను వినఁడు."

అంత గురుపుత్రులిట్లనిరి :- "మహారాజా ! మీరింత గొప్పవారై యుండియును బిల్లవాని కొఱకు చింతించుచున్నారా? ఎచ్చటనైన నేనుఁగు చీమపైఁబ్రహారమును గావించునా ? మీ రెక్కడ ? పసికూనయగు వీఁడెక్కడ ? మీరు సామాన్య శాసనులు కారే, మీ భృకుటి విలాసముచే సమస్త దేవతలు,

లోకపాలాది సమస్తైశ్వర్యమాన్యులు భయభీతులై పాఱిపోవు చుందురు. త్రిలోకాధిపతియగు నింద్రుని, ఆతఁడాధిపత్యమును వహించిన లోకములను మీరు యుద్ధము చేయకయే జయించి తిరి. అట్టి మీముందీ బాలకుఁడెంత ? వీఁడు పిల్లవాఁడేకదా ! మీ ప్రతాపాగ్నిముందు వీఁడుపతంగ మంతయైననుగాడు. పైఁగా నెవరును బాలుర విషయములను లక్ష్యపెట్టరు. ఈ యవస్థయే అట్టిది. బాలకుఁడేదోషముల నాచరించినను వాని యపరాధముల నన్నిటిని క్షమించవలయును.

అంత హిరణ్యకశిపుఁడిట్లనెను :- "నాకు విపరీతాచరణ మొనర్చువానిని వదలమందురా ? నేను వీనిని క్షమించినచో నిఁక ముందువీఁడు పెచ్చుపెరిగిపోవును. ఇతరులను జెడఁ గొట్టును. సర్వత్ర అరాజకత పెల్లుబుకును."

గురుపుత్రులిట్లనిరి :- "ప్రభూ ! మా అభిప్రాయమది యెన్నటికినిఁగాదు. వీనిని వదలమనము. వీనికిఁగొంత యవకాశ మొసంగవలయునని మేము కోరుచున్నాము. మా తండ్రియు మనకు గురుదేవుఁడిప్పుడిచ్చట లేడు. వారు వచ్చునంతవఱకిట్లే యుండ నిండు."

హిరణ్యకశిపుఁడిట్లనెను :- "వీనిని వదలివైచినఁబాఱి పోయి శత్రువులతోఁగలియును."

గురుపుత్రు లవహేళనా స్వరమున నిట్లనిరి :- "అయ్యా శత్రువులతో నేమి చేరఁగలఁడు. వీఁడు ప్రాణభయముచే భయ

భీతుఁడై పాఱిపోవచ్చును. దీనికొక్కటే యుపాయము కలదు. వీనిని వరుణ పాశములతోఁగట్టి పాఱిపోకుండఁజేయవచ్చును."

హిరణ్యకశిపుఁడు సమస్తము జేసి విసిగి యోడిపోయెను. ఆతడేదైన నుపాయము నన్వేషించు చుండెను. గురుపుత్రు లిట్లు పలుగఁగా నాతఁడిట్లనెను :- "మంచిది, మీకందఱకట్టి యభిప్రాయమున్నచో సరియే; కాని వీనిని మీరే కనిపెట్టి యుండవలయును. వీఁడింతకుమించిన యుద్దండుఁడు కారాదు."

గురుపుత్రులిట్లనిరి :- "ఏమి యుద్దండుఁడు కాఁగలఁడు మహారాజా! ఈయవస్థలో నట్లే యుండును. బాల్యావస్థలో సదసద్వివేకముండదు. వయస్సు పరిపక్వమగుకొలఁది గురుజన సాంగత్యము లభించినకొలఁది గంభీరత వచ్చుచుండును. కర్తవ్యాకర్తవ్య వివేకము కలుగుచుండును. కావున మీరీతని ధృష్టతమ కేవలము బాల్య చాపల్యమనియే భావింపుఁడు."

ఇది విని హిరణ్యకశిపుఁ డిట్లనెను :- "బాగున్నది మీ సమ్మతిని నేను సహర్షముగ స్వీకరించితిని, కాని కేవలము బంధించుటచేఁ పని జరుగదు. మీరు వీనిని మీవెంటఁ గొనిపొండు, వానినిఁ జాల జాగ్రత్తగ నుంచుచు నసుర రాజధర్మముల నుపదేశింపవలయును."

హిరణ్యకశిపుని ఆజ్ఞనుబొంది ప్రహ్లాదుని వెంటఁ బెట్టుకొని గురుపుత్రులు తమతమ గృహములకుఁ బోయిరి. ప్రహ్లాదుఁడు సమదర్శి. ఆతనికన్ని స్థానములు నొక్కటియే. తండ్రి గురుపుత్రుల వెంటఁ బొమ్మనగా నాతని యాజ్ఞను శిరసా

వహించి గురుగృహమునకుఁ బోయెను, ఇప్పుడు శండ అమర్కు-లను నిద్దరు గురుపుత్రులు మిక్కిలి శ్రద్ధతోఁ బ్రహ్లాదునకు శాస్త్రములను జెప్పసాగిరి. పాఠశాలలోఁ జదువుటకై యితర దైత్యబాలురును వచ్చుచుండిరి; కాని గురుపుత్రుల యున్నతి ప్రహ్లాదునిపైననే ఆధారపడి యుండెను. రాజపుత్రుఁడగుటచే నాతని నెక్కుడుగఁ గసరజాలకుండిరి. ప్రేమ పూర్వకముగ నసురధర్మములగు ధర్మార్థకామములను గుఱించి యుపదేశించెడివారు. ప్రహ్లాదుఁడన్నిటిని వినుచుండెడువాఁడు. విషయభోగాసక్తులకు శ్రేష్ఠమని చెప్పఁబడిన శిక్షణమాతనికి రుచింపలేదు. ఏలననఁగా నా శిక్షణము రాగద్వేషములతో నిండియున్నది. శత్రువులతో నిట్లు వ్యవహరింపవలయును, కామాదుల విషయములలో నిట్లు వ్యవహరించి సంతుష్టిని జెందవలయును మొదలగు విషయములను జెప్పుచుండిన నవి ఆతనికిఁ బ్రియము లేకుండెను. ఆతనికి భగవన్నామ సంకీర్తనము భగవచ్చర్చ, జ్ఞానము, వైరాగ్య వార్తలు మొదలగునవి యిష్టము.

ప్రహ్లాదుఁడు గురుపుత్రులకు విరోధించక పోవుటను గాంచి వారికీతఁడు బాగుపడఁగలఁడను విశ్వాసముకలిగెను. ఆతనికుత్సాహమును కలిగించుటకై గురుపుత్రులాతనిని బడి పెద్దగా నొనర్చి యిట్లనిరి:- "మేము లేనప్పుడు వీరికి చదువును జెప్పుచుండుము."

ఇంకేమున్నది ? ప్రహ్లాదునకు దీనివలన సత్సంగము చేయుట సంభవించినది. పిల్లలను బరస్పరము కలిసికొని ఆట

లాడుకొనుటయు, గంతులువేయుట యందలిస్వాభావికాభిరుచి యుండును. అవకాశము లభించినపుడు వారెగిరి గంతులు వేయుచుందురు. కాని సంస్కారము గల బాలకులకు యెగిరి గంతులు వేయుట ప్రియముగనుండదు. వారు భగవచ్చింతనము, భగవన్నామ సంకీర్తనము, భగవత్కథా కథన శ్రవణములందే తమ కాలమును సదుపయోగ మొనర్చుచుందురు.

ఒకానొక దినమున గురుపుత్రుల యింట నొకానొక పర్వోత్సవము, వారు దానికై పాలను దెచ్చుటయు, పెరుగును గొనుటయు, సామగ్రినిఁ బ్రోవుచేయుటయందే మగ్నులై యుండిరి. గురువులు ప్రహ్లాదునితో నీనాఁడు మాకు కొంచెము పనియున్నది పిల్లలను జూచుచుండవలయునని చెప్పిరి. ఇట్లు చెప్పి వారు తమ తమ పనులలో నిమగ్నులై యుండిరి.

పిల్లలెంత చిన్నవారుగానుండిన వారధ్యాపకులకంత తక్కువగా భయపడుచుందురు. అధ్యాపకుఁడు లేకున్నచో వారి సామ్రాజ్యమే యగును. పుస్తకములను దాఁకరు. కక్షలలోఁ గూర్చుండరు. గోల యారంభమగును. గురుపుత్రులు వెడలి పోఁగానే పిల్లలలో గోల ప్రారంభమయ్యెను, ఒకఁడిట్లనెను :- "మనము చెడుగుడునాడుకొందుము. ఇంకొకఁడు చెర్వట్టీ ఆడుదమనెను. ఇంకొకఁడు గుర్రాలాట నాడుకొందమనెను. కొందఱె గురుచుండిరి, కొందఱు గంతులిడుచుండిరి. కొందఱు గుడ్డలను బైకిబిగించి తొడలు చఱుచు చుండిరి, ఒకఁడింకొకనితోఁ బోరుచుండెను. కొందఱు కొట్టుకొని యేడ్చుచుండిరి. కొందఱేడ్చువారి

నోదార్చుచుండిరి. ఇంకొకఁడు బుజ్జగించుచుండెను. ఇంకొకఁడు చక్కిలిగింతలను బెట్టుచుండెను. క్షణకాలములోఁ బాఠశాల క్రీడా శాలగను, మల్లశాలగను నైపోయెను. కాని ప్రహ్లాదుఁడు తన తరగతిలోఁగూర్చుండి ధ్యానమొనర్చుకొనుచుండెను. ఇంతలో నొక పోకిరి పిల్లఁవాఁడిట్లనెను :- "ఏమయ్యా, నీ వొంటరిగాఁ గూర్చుంటివేల ? నీవును నాడుకొనుము. నేను రాజ కుమారుఁ డనని నీవనుకొని యుండవచ్చును. సోదరా ! ఆటలో రాజెవరు దరిద్రుఁడెవరు ? ఆటలో నందఱొక్కటియే.

ఇదివిని ప్రహ్లాదుఁ డిట్లనుకొనెను :- "వీరందఱ శిరస్సున గాలుఁడు తాండవమాడు చున్నాఁడు. మృత్యువు నిత్యమును దగ్గఱ దగ్గఱ పడుచున్నది. వీరందఱును నాటల పాటలలో నిమగ్నులై యున్నారు. పెడత్రోవను బడిన దీనులగు నాయసుర బాలురమీఁదఁ బ్రహ్లాదునకు దయ గలిగెను. వైష్ణవుల స్వభావ మిదియే, వారకారణముగ దీనుల ననుగ్రహించు చుందురు. పరపీడవలన వారి అంతఃకరణము కఱగిపోవును. కావునఁ బ్రహ్లాదుఁడు వారిమీఁదఁ గృపాదృష్టినిఁ గఱపుచుఁ బ్రేమ దృష్టితోఁ జూచుచు నవ్వుచు నిట్లనెను :- "రండు బాలకులారా! నేడు మనమొక క్రొత్తయాటను నాడుకొందుము. ఆ యాట యెట్టిదియో తెలియునా ? దానిని బాగుగా నాడినచో నీ సంసారిక ఖేలనము శాశ్వతము సమాప్తము కాఁగలదు."

పిల్లలకుఁ గుతూహల మెక్కుడుగ నుండును. వారి హృదయము సరళముగ నుండును. దానితో రాగద్వేషము

లుండవు. ప్రహ్లాదుని ప్రభావ మిదివఱకే బాలురపైఁ బడెను. వారాతని శీల సదాచారములచేఁ బ్రభావితులైరి. రాజపుత్రుఁడు కూడా. అందఱు నాతని నాదరించుచుండిరి. ఆతనియందు గౌరవబుద్ధి నుంచెడువారు. అతని మాటను విని అందఱును దమ ఆటపాటలను గట్టిపెట్టి బంతి, కఱ, మొదలైనవాటిని వీడి ప్రహ్లాదుని చుట్టును గూర్చుండిరి. అందఱకును మధ్యలోఁ బ్రహ్లాదుఁడు కూర్చుండెను. ఆతని ముఖ కమలమును జూచుచుఁ దృష్టి నాతనియందే లగ్నమొనర్చి అసుర బాలకులు కూర్చుండిరి. ఇప్పుడు భక్తి పాఠశాల ప్రారంభమయ్యెను.

నారదుఁడిట్లనెను :- "రాజా ! ఆ ప్రహ్లాదుని భక్తి పాఠశాలలోని కొన్ని పాఠములను మీరును వినఁదలఁచుచో నేను మీకు వినిపించెదను.

మిక్కిలి యుత్సాహముతో ధర్మరాజిట్లనెను:- "స్వామీ ! అవశ్యము వినిపింపవలయును. ఇవియే వినవలసిన విషయములు. మీరెంత యధికముగఁ బాఠములను వినిపించెదరో అంత అధికముగ మాకానందము కలుగును."

ధర్మరాజు యొక్క యుత్సాహమునుగాంచి నారదుఁడిట్లనెను :- "రాజా ! మంచిది. ఇప్పుడు మీరు భక్తి పాఠశాల యొక్క ప్రథమ పాఠమును బ్రేమపూర్వకముగ శ్రవణ మొనర్పుఁడు."

.... )o( ....

# ప్రేమపాఠశాల ప్రథమ పాఠము

౪౭౦

శ్లో॥ కౌమార ఆచరేత్ప్రాజ్ఞో ధర్మాన్భాగవతానిహ ।
దుర్లభం మానుషం జన్మ తదప్యధ్రువమర్థదమ్॥
యథాహి పురుషస్యేహ విష్ణోః పాదోప సర్పణమ్ ।
యదేష సర్వభూతానాం ప్రియ ఆత్మేశ్వరః సుహృత్॥

శ్రీభాగ. ౭ స్కం. ౬ అ. ౧ శ్లో॥

వ. వినుండు సకలజన్మంబులందును ధర్మార్థాచరణ కారణం బయిన మానుషజన్మంబు దుర్లభంబు........గావునఁ గౌమార సమయంబున మనీషాగరిష్ఠుండై పరమభాగవత ధర్మంబు ననుష్ఠింపవలయు. దుఃఖంబులు వాంఛితంబులుగాక చేకురు భంగి సుఖంబులును గాలానుసారంబులై లబ్ధంబులగుం గావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయం జనదు. హరి భజనంబున మోక్షంబు సిద్ధించు విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు, ప్రియుండు ముముక్షువైనదేహిః దేహావసాన పర్యంతంబు నారాయణ సేవనంబు కర్తవ్యంబు.

-- శ్రీమదాంధ్రభాగవతము.

ఎవరికేవస్తువు నందత్యంత ప్రీతియుండునో దానిని వారు సర్వశ్రేష్ఠముగఁ దలచుచుందురు. ఆతఁడుదూరుఁడగుఁనో

దానిని సేవించుమని అందఱకును జెప్పును. అందఱకు దానినిఁ బంచిపెట్టును. అవసర సమయమున దానినిఁ జర్చించును. దానిని ప్రచారమొనర్చుటకును యథాశక్తిగఁ బ్రయత్నమొనరించును. మనకు రోగమువచ్చి ఒకానొక ఔషధముచే స్వస్థులమైనచో నట్టి రోగమే యింకొకరికి వచ్చినపుడా యౌషధమునే సేవింపుఁడని చెప్పుచుందుము. కారుణిక పురుషుల యొక్క సహజ స్వభావమిది.

నారదమహర్షి ధర్మరాజుతో నిట్లనెను :- "రాజా ! గురుపుత్రులు స్వగృహకార్యములందు వ్యగ్రులుకాఁగాఁ పాఠశాలలో ప్రహ్లాదుఁడును నాతని సహపాఠులు మాత్రమే యుండరి; బాలకులు తమ స్వభావాను సారముగఁ గ్రీడలందే తన్మయులై యుండిరి, కాని ప్రహ్లాదుఁడు గంభీరముగ నింకొకటి యోచించుచుండెను. పిల్లలాటల యందాసక్తినిఁ గెందుటనుగాంచి వారి మీద నాతనికి దయకలిగెను. అతఁడిట్లనుకొనెను ;- "చూడుఁడీ సమయమెంత యమూల్యమైనదో. ఒక్కొక్క క్షణము దుర్లభమైనది. అట్టి సమయమును నీబాలకులు దురుపయోగ మొనర్చుచున్నారు. వీరీవిధముగ దీనిని వ్యర్థము కావించుచున్నారు. ఈ సమయమున వీరు హరికీర్తన మొనర్చి హరిచర్చయందే లగ్నమైనచో వీరి జీవితములు ధన్యముకాఁగలవు. వీరు సాంసారిక జననమరణములనుండి బయటఁబడఁగలరు. జనన మరణ సంబంధమగు ఆసంఖ్యాకదుఃఖములను సహింపవలసిన పని లేదు."

ఈతఁడిట్లు తలఁచునంతలోఁ గొందఱు బాలురాతనిని గూడ ఆటలకు రమ్మని పిలిచిరి. ఆతఁడందఱను దనకు దగ్గఱగఁగూర్చుండ బెట్టుకొని యిట్లనెను :- "సోదరులారా ! నా మాటలను గొంచెము వినుఁడు. ఈ యాటలవలన నేమి ప్రయోజనము, ప్రపంచమున నెందఱో ఆడియాడి చచ్చిపోయిరి. వారు దుఃఖములోనేపుట్టి, దుఃఖములోనే పెరిగి, దుఃఖమునే వెంటదీసుకొని యీ ప్రపంచమును వదలిపోయిరి. కావున నీ ధనరత్నములందును. సాంసారిక భోగప్రాప్తి యందును. ఇచ్ఛ నిసుమంతైన లేదు.ఆత్మోన్నతికొఱకు కొంచెముగఁ బ్రయత్నింపవలయును. అనర్థమును వీడి పరమార్థమును జింతింపవలయును."

అంత బాలకులలో నొకఁడిట్లనెను :- "కుమారా! మనకు గురువుగారు సదా ధర్మార్థకామములను, రాజనీతిని గుఱించి యేశిక్షణ నొసంగుచున్నాఁడు. ఆత్మ, పరమాత్మల విషయములతో మనలను వంచితుల గావించుచున్నారు."

అంతఁ బ్రహ్లాదుఁడిట్లనెను :- "సోదరులారా ! అత్మ యొక్క హితాహితములను గూర్చి స్వయముగ నాలోచించుకొనవలయును. ప్రత్యక్షముగ ననర్థము కనఁబడుచున్నప్పుడు గురువచనములనైన మన్నింపరాదు. అజ్ఞానరూపమగు గాఢనిద్రలో నిద్రించువాని యాలోచనలు యుక్తులు మేల్కొలుపఁజాలవు. పైవానిని మన్నించుట యుచితముకాదు. నిద్రపోవువాఁడితరుల నెట్లు మేల్కొలుపఁగలఁడు. గుడ్డివాఁడితరులకు దారి

నెట్లు చూపింప గలడు. ఆత్మకుశత్రువులేఁడు. మిత్రుఁడునులేడు ఉదాసీనుఁడునులేఁడు. ఈ సాంసారిక సుఖదుఃఖములు ప్రారబ్ధాధీనములు. కావున నీబాహ్యావిషయములలోఁబడి ఆత్మను నధఃపాత మొనర్చుకొనరాదు. పరమపురుషార్థరూపుఁడును ప్రేమాస్పదుఁడునగుప్రభుప్రాప్తికొఱకు సతతము ప్రయత్నించ వలయును."

అసుర బాలలిట్లనిరి:- "సోదరా! నీవు చిన్నవాఁడయ్యుఁ బెద్దలవలెఁ బలుకుచున్నావే. బాల్యావస్థ ఆటపాటల కేర్పడినది ఇప్పటి నుండియే ఆత్మ పరమాత్మల రొంపిలోఁబడుటవలనఁ బ్రయోజనమేమున్నది? అవసరమైనచో వృద్ధావస్థయందుమాలను ద్రిప్పవచ్చునులే! అప్పుడే రామరామ అందుము."

ప్రహ్లాదుఁడు శీఘ్రముగ నిట్లనెను:- "అప్పుడేమి జపించెదవు? బాల్యకాలమునఁబడిన సంస్కారములే పోను పోను స్థాయియగును. కావున భాగవతధర్మాచరణము కౌమారావస్థ నుండియే చేయవలయును. జీవునకుఁ బ్రధానకర్తవ్యమిదియే."

అసుర బాలకులిట్లనిరి:- "ఈ పశుపక్ష్యాదులు నిరంతరమాహారనిద్రా భయమైథు నాదులందే సంలగ్నమైయున్నవి. అవి ఆత్మ పరమాత్మలను నీ చక్రములోఁ బడలేదు." అంత ప్రహ్లాదుఁ డిట్లనెను:- "మానవులకును బశువులకును నిదియే భేదము. దేహసంబంధమగు సుఖము కొఱకును, విషయప్రాప్తి కొఱకును సమస్త ప్రాణులు ప్రయత్నశీలమున నున్నవి.

మానవజన్మములో విశేషత యేమనఁగా దేనిద్వారా ముక్తి భగవత్ప్రాప్తి కలుగుచున్నది. ఎనుబది నాలుగు లక్షల జీవరాసులలో మానవ దేహముద్వారా పరమార్థమును సాధింపవచ్చును. గావుననే యిది సర్వశ్రేష్ఠమైనదని చెప్పఁబడినది, ఈ శరీరము అనిత్యమైనది, నాశవంతమైనది; కాని దీనిద్వారా నిత్యశాశ్వత వస్తువును బ్రాప్తింపవచ్చును, అధ్రువ దేహముచే ధ్రువస్వరూపుఁడగు శ్రీహరినిఁ బొందవచ్చును. ఇంత సులభమగుకార్యమునే బుద్ధిమంతుఁడు చేయఁడు మూర్ఖుఁడు; బుద్ధిహీనుఁడు తప్ప యిట్టిలాభమునకెవఁడు వంచితుడు కాఁగలఁడు."

అసుర బాలకులిట్లనిరి:- "అయ్యా, నీవు మిక్కిలి యాశ్చర్యకరమగు మాటలు మాటలాడుచున్నావే. ఇంద్రియములకు శబ్ద, స్పర్శ, రూప, రస గంధాది విషయము లత్యంత ప్రియములుగ నుండును. ఈ విషయప్రాప్తికొఱకు ప్రయత్నించుటే మనకు ముఖ్య కర్తవ్యమనుకొనుచున్నాము. నీవు వీనిని హేయములనియు దుచ్ఛములనియుఁ జెప్పుచున్నావు. ఇంక జేయవలసినదేమున్నది? మానవుని ముఖ్య కర్తవ్యమేమి?

ప్రహ్లాదుఁడిట్లనెను:- సోదరులారా! ఈ మనుష్య జన్మ వాసుదేవుని చరణములను సర్వతోభావ శరణమును బొందుటేయేకైక సర్వ శ్రేష్ఠమగు ముఖ్యకర్తవ్యము. ఏలననఁగావిష్ణువు కాక యింకొక ప్రియపదార్థములేదు ఆతనికి మించినది శ్రేష్ఠమైనదింకొకటి లేదు. ఆతఁడందఱకాత్మ, ప్రియతమ సుహృదుఁడు. అందఱకు స్వామి."

అంత నసురబాలకులిట్లనిరి:- "నీవా! రాజపుత్రుఁడవు. నీకు భోగ సామగ్రులన్నియును స్వతః ప్రాప్తించినవి. నీవట్లను కొనుట యుచితమే కాని మనము ప్రయత్నమొనర్పకున్నచో భోజనమెచ్చటినుండి రాగలదు. శరీరము స్వస్థముగను శుభముగను నెట్లుండగలదు ? సంతానోత్పత్తి యెట్లు కలుగఁగలదు. మనోభిలషిత యింద్రియోప భోగమెట్లు ప్రాప్తింపగలదు? సుఖసామగ్రులన్నియును బ్రయత్నము చేతను బురుషార్థముచేతను బ్రాప్తించును. ప్రయత్న మొనర్పక, చేతిలోఁ జేయివైచుకొని కూర్చుండినచో జీవనమెట్లు నడువఁగలదు. సింహము దైవసహాయమునఁ గూర్చుండిన హరిణాదులు తమకుఁ దామేవచ్చి నోఁట బడును. అట్లు మనకుఁ దినుటకు లభించునా? కావున భోగపదార్థములకొఱకు ప్రయత్న మా వశ్యకమే కాదు అనివార్యము."

ప్రహ్లాదుఁడీ విషయమును విని యిట్లనెను :- "బాలులారా ! పిల్లచేష్టలు చేయవద్దు. బాల్య చాపల్యమును వదలి గంభీరతా పూర్వకముగ దీనిని గూర్చి విచారించుఁడు. రాజు కానిండు, బంటు కానిండు. ధనికుఁడు కానిండు, దరిద్రుడు కానిండు, అందఱకును సుఖసామగ్రులు భాగ్యాను సారముగనే లభించుచుండును. చాలమంది ధనికులకు భోజన సామగ్రి యంతయు నవ్వారిగఁగలదు. వానికి సంగ్రహణీరోగము వచ్చినది. మజ్జిగను దప్ప యింకేమియును దీసికొనవలదని వైద్యులు చెప్పిరి. ఆతని కన్నివస్తువులుండియు వ్యర్థములే. అప్సరసల వలె సర్వాంగ సుందరియు నాజ్ఞాకారిణియు, సుశీలయు. సులక్ష

ఖయునగు ధర్మపత్ని కలదు. పురుషునకేదైన నసాధ్యరోగ మున్నను, నపుంసకుఁడైనను లేనివాని క్రిందలెక్క. ఇదే విధముగఁ బదార్థములు సమీపమున నున్నను భాగ్యములేకున్న భోగములేదు. చాలమంది సుఖముకొఱకు సర్వదా సతత ప్రయత్న మొనర్పవలయును. ఆతనికి సుఖము లభింపదు. దీనికివిపరీతముగ మాకుజ్వరమురావలెను. గాయము పడవలెను, కరుపు లేవవలయును, పుత్రశోకము రావలయును, కూతురు విధవ కావలయును. భార్యాపుత్రులు యోగ్యులు కావలెను. మిత్రుడు విశ్వాసఘాతకుఁడు కావలయును, అన్నములేక ఉపవాస మొనర్పవలయుపని యెవరు కోరుకొందురు ? అట్లు కోరుకున్నను బ్రారబ్ధవశమున దుఃఖములు సంభవించుచుండును. అనిచ్ఛాపూర్వకముగనైనను నా దుఃఖములను భోగింపవలసియుండును. కోరుకున్నను బ్రారబ్ధవశమున దుఃఖము లెట్లు వచ్చుచున్నవో అట్లే ప్రారబ్ధవశమునఁ బ్రయత్నమొనర్పకున్నను సుఖములు లభించును. ప్రారబ్ధములు లేకున్నచో నెంతగాఁ బ్రయత్నించినను సుఖములు ప్రాప్తింపవు. కావున నింద్రియ జనిత సుఖముల కొఱకు ప్రయాసపడుట నా కనుచితముగ దోఁచు చున్నది."

అంతఁ బురుషార్థవాదియగు నసుర బాలకుఁ డిట్లనెను:- "ప్రహ్లాదా ! ఈ విషయము మాకర్థమగుటలేదు. ప్రయత్నమేమియును జేయక అదృష్టముపై నాధారపడుట మాకుచితముగఁ గనఁ బడుటలేదు. ప్రయత్న మొనరించినను చాలమంది యిచ్ఛాను సారముగ భోగసామగ్రినిఁ బొందుట లేదనిన నది

సమాజదోషము. ధనికవర్గము శ్రమజీవులను పీల్చెదరు. మేస్త్రీలు భృత్యవర్గమును బాధించెదరు. ఇందులో భాగ్యదోష మేమున్నది ? భాగ్య నిర్మాతలము మనమే. పూర్వ జన్మమునఁ జేసిన పురుషార్థముచేతనే ప్రారబ్ధ రచనము జరుగును. కావున నీ ప్రారబ్ధాధారమున నిరుద్యోగులమగుట మాకుపయుక్తము లుగఁ దోఁచుటలేదు."

ప్రహ్లాదుఁ డిట్లనెను :- "సుఖదుఃఖము లొసంగు వారితరు లెవరో కారు. స్వకృత పుణ్య పాపములనే మానవుఁడు భోగించు చున్నాఁడు. ఫలానివాఁడు మనలను దుఃఖపెట్టు చున్నాఁడు. ఫలానివాఁడు బాధించుచున్నాఁడను నీ భావములు రాగ, ద్వేషేర్ష్యా, కపట, మత్సరములచేఁ గలుగును.పరుల వైభవమును గాంచి హృదయమందు గలుగు నొకవిధమగు నీర్ష్యనుజెందును. దానికి వశీభూతుఁడై మానవుఁడిట్టికార్యము లొనర్చుచుండును. సమాజమందు సదా విషమత కలదు, సదా ఉండఁగలదు. అందఱకును సమాన సంపత్తి యుండుట అనునది జరుగని పని, పోనిండు సాంసారిక సంపత్తి సమానముగ నున్నను; ఆయుస్సు బుద్ధి, బలము, విద్య, కళా, కౌశలము, సౌంద ర్యము, ఆకృతి, ప్రకృతి వీనిలో విభిన్నతయుండనే యుండును నేఁడు ధనకృతవిభిన్నత యుండిన రేపు జాతికృత, బుద్ధికృత, బలకృత విభిన్నత కలుగును. అధిక బుద్ధి కలవాఁడు తక్కువ బుద్ధి కలవారి నణఁచి యిష్టమువచ్చినట్లు కార్యములొనర్చెదరు. సృష్టి రచనము విభిన్నతచేతనే అయినది. సామ్యమున సృష్టి

లేదు. గుణ విభిన్నతలోనే సృష్టి సంభవమగును. కావున సాంసారిక సుఖదుఃఖములు సదా ప్రారబ్ధాను సారగముఁ గలుగును. సమాజ రచనమే సిద్ధాంతము ననుసరించి చేసినప్పటికిని విషమత నశింపదు. విషమత నశించిన ప్రళయము వచ్చినట్లే త్రిగుణముల యొక్క సామ్యావస్థకే ప్రకృతియందురు. విషమతలోనే వికృతి కలుగును. ప్రారబ్ధములు వేఱువేఱుగ నుండును. ప్రారబ్ధానుసారముగ సుఖదుఃఖము లవశ్యము కలుగును. మనకిష్టములేకున్నను మనము దుఃఖము లెట్లు సంభవించుచున్నవో, యిష్టము లేకున్నను సుఖభోగములును ప్రాప్తించును. కావున ననాయాసముగఁ ప్రాప్తించు నింద్రియ సుఖముల కొఱకేమి చింత ప్రభు ప్రేమ విషయములోఁ జింత కలిగి యుండవలయును."

అసురబాలకులలో నొకఁడిట్లనెను :- సుఖదుఃఖములు ప్రారబ్ధానుసారముగఁ ప్రాప్తించినపుడు, అట్లే ప్రభుప్రేమయును ప్రారబ్ధానుసారముగ లభింపవలసియుండిన లభించును. ఇఁక దానికొఱకై చింతయెందులకు ?"

అంత ప్రహ్లాదుఁడిట్లనెను :- "ఇది సత్యమే. ప్రభుప్రేమ ప్రాప్తింపవలసి వచ్చినప్పుడు అవశ్యము ప్రాప్తించును. ప్రేమ ప్రయత్న సాధ్యమైనదికాదు. ఏమియును విచారించకుండుటయును, సర్వథా ప్రారబ్ధముపైననే జీవితమును వదలి వేయుటయును నిది సిద్ధావస్థలక్షణము; కాని మనస్సును, బుద్ధియు నుండు నంతవఱకు మానవుఁడాలోచింపకయు, తర్కవి

తర్కము లొనరింపకయు నుండఁజాలఁడు. అందువలన మానవుని సాధకుఁడనిరి. సాధనజేయవలసి యుండినచో, విచారమొనరింపవలసి యుండినఁ బ్రభుసంబంధముననే విచారింపుఁడు. కథాకీర్తనములను బ్రచార ప్రసారము లొనర్చుటకును. జీవనమునఁ బ్రేమసంచారము కలుగుటకును, హృదయమున భగవద్భక్త్యంకుర ముత్పన్నమగుటకును సాధన మొనర్చుట అత్యుత్తమము, మానుషజీవనమునకు ముఖ్యకర్తవ్యమిదియే.

అంత నొకపిల్లవాఁడిట్లనెను :- "అట్లయినచో యువావస్థలో బాగుగా సుఖోపభోగము లొనర్చి, విషయభోగములచేఁ దృప్తిచెందిన మీఁదటఁ బరమార్థచింతన మొనర్పవచ్చును."

ఇది విని నవ్వుచుఁ బ్రహ్లాదుఁ డిట్లనెను:- "ప్రపంచములో నేఁటివఱకు విషయవాసనలకుఁ దృప్తి చెందినవారు లేరు. అగ్నిలో నాజ్యమును వేయుచుండిన కొలఁది నదివృద్ధిపొందు నట్లు విషయముల నెంతగా సేవించిన నంతగా లాలసవృద్ధి యగును. చచ్చువఱకు భోగికి వాసన నశింపదు. పరమార్థ సాధనము స్వస్థము నిరోగమైన శరీరము చేతనే బాగుగాఁజరుగగలదు. ఇంద్రియములు శిథిలములై. వృద్ధావస్థ శరీరమును జర్జరము చేసిన నింక సాధన మొనర్చున దేమున్నది ? కావున నీ సర్వావయవ పూర్ణమగు మానవ శరీరము విపద్గ్రస్తముకాక మున్నే భవభయమునఁ బడిన వివేకి తన మేలు గూర్చి తాను జూచుకొనవలెను."

అంత నసురబాలకులిట్లనిరి :- "ప్రహ్లాదా ! పరమార్థ చింతనముకొఱకు నీవింత పట్టుదలగా నేలఁజెప్పుచున్నావు. ఇంత తొందఱ యేమున్నది. ఇంకెంతో ఆయుస్సు ఉన్నది గదా! కొన్నాళ్ళాటల పాటలలో మునిఁగి తర్వాత మోహరసము నాస్వాదించి, కొన్ని దినములైన తర్వాత నాత్మపరమాత్మల విషయమును గూర్చి విచారించెదము."

ప్రహ్లాదుఁడు దృఢతాస్వరమున నిట్లనెను :- "మీరా యుస్సు గొప్పదని యేలచెప్పుచున్నారు ? మనమిన్ని దినములు బ్రదుకగలమని యెరికే నిశ్చయమున్నది ? మంచిది. మానవు నకు నూతేండ్లాయుస్సని చెప్పవడినది. దేవతాసురాది ఉపదేవ, మను, ప్రజాపతి, ఋషి, జీవులకీ యాయుఃపరిమాణము లేదు. ఎన్నాళ్లైన జీవింపఁ గలరు. కొందఱు మన్వంతరముల కొలది జీవింపఁగలరు. కొందఱు కల్పజీవులుగ నుందురు. కొందఱు బ్రహ్మాయువునకు మించి జీవించెదరు, సాధకునిఁగాఁ జెప్పఁ బడిన యీ మానవుఁడే ముముక్షువుగానుండి, మోక్షేచ్ఛ కలిగి యుండును. ఈతనికి నూతేండ్లాయుస్సని తలఁపుఁడు. అందులో నగము నిద్రకింద పోయినది. మిగిలిన నగమును నాలుగు భాగము లొనర్పుఁడు. బాల్య, కౌమార, యౌవన, వృద్ధాప్య ములు, బాల్య కౌమారముల క్రింద నిరువది యిరువదియైదేండ్లు గడచిపోవును, ఈయవస్థలలోఁ దినుట, త్రాగుట, నిద్రించుట, అయి యవకతవక విషయములను జింతించుటయే జరుగు చుండును. ఆ సమయమున నేమిచేసినను నింకను బాలుఁడనియే

వదలి వేయఁబడును. చివర యిరువది యిరువదైదు సంవత్స రములు వృద్ధావస్థలో మంచముమీఁదఁబరుండి కయ్యిఁకయ్యిఁ మని దగ్గుచుండును. కఱ్ఱ సహాయముతోఁ దిరుగవలసివచ్చును. ముసలి భార్యకూడ ఆతని విషయము నెత్తుకొనదు, మంచము లోనికి ఆహార పానీయములు వచ్చును. ఆ సమయమున శరీ రము శిథిలమైపోవును. బలము తగ్గిపోవును. కాని మమత అధి కాధిక మగును. ఈ విధముగ నాయుస్సులో రెండుభాగము లిట్లే గడిచిపోవుచున్నది."

అంత నసురబాలకులలో నొకఁడిట్లనెను :- "మిగిలిన కాలములోనే భగవచ్చింతన మొనర్పవచ్చును."

అంత నవ్వి ప్రహ్లాదుఁడిట్లనెను :- "ఇఁక యువావస్థయు న్నది నిలిచి. మీరింకను పిల్లలే. యువావస్థలోనెట్టి సంకల్పతరం గములు రేగునో దానిని యువావస్థలోఁ బదార్పణ మొనర్చిన వారే తెలిసికొనఁగలరు. ఆసమయమునసీ సంసారము విచిత్రము గఁగనఁబడును, మనస్సేదో అవ్యక్త భావమందు మునిఁగి తేలు చుండును. కామాగ్ని అమితముగా ప్రబలియుండును. దాని యొక్క ప్రచండయూర్మలందు కర్తవ్యాకర్తవ్యజ్ఞానము భస్మ మగును. రోమరోమమునుండి యున్మాదము బయలు వెడలు చుండును. గృహమునందును గృహిణియందును నత్యంతాసక్తి కలుగును. ఆ సమయమున నాత్మచింతనము నుండదు. పర మాత్మ ధ్యానముండదు. అప్పుడే విధమగు వైషయిక భోగ సామగ్రి లభించునో దాని ద్వారా వైషయిగ సుఖము ననుభ

